(ఆంధ్ర గ్రంథమాలవారి ప్రచురణము:)

# శ్రీమద్భగవద్గీత



శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావుగారు

(టీకాతాత్పర్య
విశేషార్థ
వివరణ సారాంశ
సహితము)

# భారతి

## సచిత్ర మాసపత్రిక

# BHARATHI

(A TELUGU MONTHLY)

సంపాదకుడు

శి. శంభుప్రసాద్



ఆంధ్రపత్రికా ముద్రాలయము,

మద్రాసు.

౧౯౩౯

సంపుటము ౧౬, సంచిక ౧

# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్ల వారికి ఈనెల భారతి (1939 సం. జూన్ నెల) తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువఱకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1939 సం. జూలై 10-వ తేదిని రూ. 6—4—0 లకు వి. పి పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన ప్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయమును వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

A 16. D 7. G 2, 4. H 11, 22, 23, 24, 32, 59, 63, 66. K 10, 12. L 7. N 4, 5. P 4, 6, 31. R 8, 23. S 21, 25, 28, 31, 76, 83, 84, 89, 91, 105. T 3. V 7, 8. Y 1.

---

## వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. కాగితానికి ఒకపెడే వ్రాయాలి. శాస్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ లేకుండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, మనస్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిపన్నెండు పుటలకు మించేయెడల రెండు సంచికలలో ప్రకటింపవలసివచ్చును.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక, ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, మనఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు ఎత్తుకునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను కొత్తదనంకావాలి. మన ఉద్యమాలు, మన దేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడవలసిందని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.

# భారతి - షోడశ సంపుటము—భా, ౧.

## వ్యాసముల అకారాది సూచిక

* ఈ గుర్తుగలవి ౬-వ సంచికలోని వ్యాసములు.

## త్రివర్ణచిత్రములు అకారాది సూచి

# భారతి

## సచిత్ర మాసపత్రిక

# BHARATHI

(A TELUGU MONTHLY)

సంపాదకుడు

శి. శంభుప్రసాద్

ఆంధ్రపత్రికా ముద్రాలయము,
మద్రాసు.
౧౯౩౯

సంపుటము ౧౬, సంచిక ౧

# ప్రకటన

ఈక్రింది కనబరచిన నెంబర్లవారికి ఈనెల భారతి (1939 సం. జనవరి నెల)తో ఇదివరకు చెల్లించిన చందా పూర్తి యగుచున్నది. తిరిగి ఇంకొక సంవత్సరమున కగు చందా మాకు చేరునట్లు ఈనెలాఖరులోగా మనియార్డరు చేసినచో తెంపు లేకుండ పత్రికను పంపుచుందుము. అట్లు తమ యొద్దనుండి 30-వ తేది లోపుగ సొమ్ము రానిచో సహజభాషాభిమానులగు తాము తిరిగి ఇంకొక సంవత్సరమువరకు భారతి చందాదారులుగ నుందురను నమ్మకముతో 1939 సం ఫిబ్రవరి 10-వ తేదిని రూ 6—4—0 లకు వి. పి. పంపుచున్నాము. గావున తా మెప్పటివలెనే పత్రికయం దభిమాన ముంచి సొమ్ము చెల్లించి వి. పి. ని గైకొన బ్రార్థితులు. ఒకవేళ తమకీ పత్రిక ప్రస్తుత మనవసరముగ దోచినచో మాకావిషయమును వెంటనే తెలియజేసిన యెడల వి. పి. పంపుట నాపుదుము.

B 20, 22. G 11. H 30. J 4. K 22, 23, 24. L 4. P 11, 45, 46, 47, 48. R 46, 47. S 40, 41, 47, 104, 122, 134, 140, 141, 142, 144. V 10, 39, 40.

---

## వ్యాసవిలేఖకులకు మనవి

వ్యాసాలు ఎనిమిదిపుటలకు మించకుండా ఉండాలి. వ్యాసరచన రంజకంగా ఉండాలి. స్త్రీయవిషయాలనుగురించిన వ్యాసాలుకూడా ఎక్కువ పరిభాషా, ఎక్కువ వివరాలూ ండా సంగ్రహంగాను, సామాన్యపాఠకునికి విషయం బోధపడేటట్టు సులభంగాను, స్సును కథలా ఆకట్టేటట్టు ఆకర్షకంగాను ఉండాలి. శాసనవ్యాసాలు పదిపన్నెండు పుట మించేయెడల రెండుసంచికలలో ప్రకటింపవలసివచ్చును.

దేశాన్ని ఎక్కువగా కలవరపరుస్తున్న సాంఘిక ఆర్థిక, రాజకీయాది విషయాలనుగురించీ, ఆంధ్రుల ప్రత్యేకసమస్యలనుగురించీ ప్రత్యేకవ్యాసాలు కావాలి. సాధ్యమయినంతవరకు కునే విషయంలోను, చూచే దృష్టిలోను, రచించే రచనలోను కొత్తదనం కావాలి. మన యమాలూ, మన దేశం, మనసంఘం, మనఆశయాలు భారతిలో ప్రతిఫలించేటట్టు చూడ సిందని వ్యాసకర్తలకు మనవి.—భా. సం.

---

# విషయసూచిక

# చిత్రములు



'నీరాటరేవు'

చిత్రకారుడు:
పి. హనుమంతరావు.




సంపుటం. ౧౬ బహుధాన్య, పుష్యమాసము (జనవరి 1939) సంఖ్య ౧

# స్వవిషయము

భారతికి పదిహేనేళ్లు నిండినవి; పదహారోయేడు వచ్చింది. కొత్తసంవత్సరం ఎప్పుడూ ఆనందాన్ని కలిగిస్తుంది. కాని యీయేడుమాత్రం ఆనందానికి బదులుగా విచారమే కలుగుతోంది. కారణం, భారతికి జన్మదాత అయిన కళాప్రపూర్ణ, దేశోద్ధారక శ్రీ కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు అస్తమించడమే.

స్వవిషయం వ్రాయడం వారివంతు. ఎంతటి పని తొందరలలో మునిగి వున్నప్పటికీ, దేహారోగ్యం ఎంత బాగుండక పోయినప్పటికీ శ్రీ పంతులుగారు ఈ ధర్మాన్ని మాత్రం నిర్వహించకుండా వుండేవారు కారు. చివరకు నిగుడు పుట్టైడుజబ్బులో మదనపల్లి ఆస్పత్రిలో బాధపడుతూ వుండీ కూడా భారతిమీద వుండే ప్రేమచేత, అభిమానంచేత ఏదో ఒక పుటవిషయమయినా వ్రాసి పంపకుండా ఉండలేకపోయారు. రహస్య మేమిటంటే, ఆయన తాను కూడా వారించలేని బలీయమైన కారణాలవల్ల రాజకీయ రంగంలో సుడిగుండం తిరుగుతూవున్నా ఆయన మనస్సు ఎప్పుడూ సాహిత్యరంగంలోనే విహరించేది. సాహిత్యంమీద ఉండే అభిమానం నిజంగా చూస్తే వారికి రాజకీయంమీద లేనే లేదు.

శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు కడచిన సంవత్సరం భారతికి వ్రాసిపంపించిన

మయంలోని ఈ క్రిందివాక్యాల్ని ఈ
ర్భంలో పంస్మరించవలసినవి:

"రుధిరోద్గారి సంవత్సరము(నందు)......ఆంధ్ర
మునందలి సుప్రసిద్ధ నాయకులేగాక, అఖిలభారతి
సిద్ధనాయకులును కాకినాడయందు సమావేశమైరి.
నగరము ధర్మసంస్థాపనమునందు శాశ్వతచిహ్న
ాకితమైనది. ఆ పవిత్ర సమయమునందు భారతి
ంభమైనది...గతించిన పదునాలుగేండ్లయందును
ము, సాంఘిక, సాహిత్య. కళా, వైజ్ఞానికాది
యములందు కలిగిన స్వాతంత్ర్యభావ పరిరక్షణము
స్వాతంత్ర్యప్రియులకు పరమానందము కలుగ
లను. ఈ మహోదయమునకు భారతియును
శక్తిని జ్ఞానాంజలులను సమర్పించినది......గతిం
పదునాలుగేండ్ల యందును భారతి నిర్వాహకుల
శక్తిని పత్రికానిర్వహణము చేయుటకు చేసిన
త్నముల ఫలము లోపభూయిష్ఠమైనను ఆంధ్ర
త్య ప్రపంచమునకు విదితము."

ఈ వ్యాసవిషయము నీయే డితరులు వ్రా
లసి రావడం సంతాపహేతువు. అయి
టికీ భారతి ఇంతకాలం సాగుతూరావడం
ాదకరమే. ఇంతకాలం ఇది నిర్విఘ్నం
ాగుతూవుండడానికి కారణం శ్రీ కాశీ
ని నాగేశ్వరరావు పంతులుగారి సంకల్ప
మూ, ఔదార్యమూను. వారు తమ వ్య
యంలో చెప్పినట్లు, ౧౯౨౩-వ సంవ
ం కాకినాడలో జరిగిన కాంగ్రెస్ మహా
సమయంలోనే భారతి మొదటిసంచి
ప్రకటించారు. ఆ మొదటి సంచికను
రించినప్పుడు వారిహృదయం సంతృ
తొణుకులాడి పోయింది; వారివదనం
ంతకళతో మెరిసిపోయింది; వారినిలు
ఉత్సాహంతో వెల్లివిరిసిపోయింది.

ఒక మహోత్కృష్టకార్యం నెరవేర్చినవానికి
కలిగే ఆనంద మది. ఈ భారతిద్వారా కళా
రాధకులనూ, సాహితీపరులనూ, పరిశోధ
కులనూ, విజ్ఞానఖనులనూ ఒక్క కేంద్రము
నకు తీసుకురావాలని వారిసంకల్పం. ఆ
సంకల్పం అమోఘమైనది. ఆ వజ్రసంకల్ప
బలంచేతనే భారతి ఆంధ్రసంస్కృతి నిర్మించు
కొన్న ఒక కుటీరంలా తయారయింది. వాఙ్మ
యరంగంలో గాని, విజ్ఞాన రంగంలోగానీ,
లలితకళా రంగంలోగాని, మరే రంగంలోగానీ
కృషిచేసిన, చేస్తూవున్న ప్రముఖులు ఆంధ్రు
లలో ఎవ్వరున్నా వారిని కూడగట్టుకొని,
వారి అమూల్య రచనలను సేకరించుకొని
మెప్పుపొందింది భారతి. ఈ పదిహేనేళ్ల
కాలంలో ఈ విధంగా భారతి ఎంతసేవ
చేయగలిగిందో ఆంధ్రపాఠకలోకానికే తెలు
సును. శ్రీ నాగేశ్వరరావు పంతులుగారు
కష్టమురానీ, నష్టమురానీ తాము పెట్టు
కొన్న లక్ష్యమునకు దిగిపోకుండా, తమ
యభీష్టార్థసిద్ధికి భంగము కలుగకుండా తమ
శక్తికి తగినట్లు భారతిని ఇంతకాలం కన్న
బిడ్డనులాకూడా కాదు, అంతకంటెనూ
ఎక్కుడు మమకారంతోటే పెంచారు.
దానిని అందగింప జేయడానికి ఆయన చేయని
ప్రయత్నంలేదు. భారతిలోని ఏ నూతనా
రంభాలకయినా చేయూత ఇవ్వడానికి ఆయన
వితరణహస్తము ఎప్పుడూ వెనకతీసేదికాదు.
భారతిని వెలయించి కళాప్రపూర్ణులు,
దేశోద్ధారకులు శ్రీ నాగేశ్వరరావుగారు
ఆంధ్రదేశానికి చేసిన సాహిత్యసేవ ఎవ్వరూ

మరవరానిదీ, మరవలేనిదీని. అట్టి మహాశయుడు, ఉదారుడు, పూజ్యుడు ఇక లేడంటే భారతికి ఎంతటి తీరనికొరతో సులభంగా ఊహించుకోవచ్చు.

పత్రికలను కొని చదవడానికి మన దేశం ఇంకా అలవాటు పడలేదు. విజ్ఞానంఅంటే ఇంకా దేశీయులకు తృష్ణ కలగలేదు. దేహానికి ఆహారం ఏవిధంగా అవసరమో మనస్సుకుకూడా ఆహారం అవసరమనేభావం ఇంకా మనవారికి తట్టలేదు. పాశ్చాత్య దేశాల మాట అట్లా వుంచి, ఒక్క మనహిందూ దేశం విషయంలోనే ఆలోచించినా ఆంధ్రేతరములైన బంగాళము, మహారాష్ట్రము, గుజరాతు మొదలైన రాష్ట్రాలలో వాఙ్మయాభివృద్ధీ, పత్రికాభివృద్ధీ అమితంగా అవుతోంది. ఆ రాష్ట్రాలలో తమతమ మాతృభాషలను సర్వతోముఖంగా అభివృద్ధి నొందించుకోడానికి బహుళప్రయత్నాలు జరుగుతున్నాయి. గవర్నమెంటు కార్యాలయాలలో ఉన్నతోద్యోగాలలో ఉన్నవారూ, విశ్వవిద్యాలయాలలో ఉన్నతపీఠాలను అధిష్ఠించేవారూకూడా తమకు తెలిసిన విషయాలను మాతృభాషలో వ్రాసి తమతోడి సోదరులకు విజ్ఞానం వెదజల్లుతూంటారు. మాతృభాషలకా రాష్ట్రాలలో ఎక్కడలేని జవమూ, బలమూ వస్తోంది. కాని మన దేశంలోని పరిస్థితులు వేరు. ప్రజలలో ఆ విజ్ఞానతృష్ణా లేదు; ఉత్సాహమూ లేదు.

దేశమే ఇట్లా ఉండగా శ్రీ పంతులు గారి అస్తమయంచేత ఏర్పడిన ఈనూతనపరిస్థితులలో భారతిని వెనుకటి రీతిని నడపడమంటే మాటలు కాదు. ఆంధ్రపత్రికల, అందులోనూ మాసపత్రికల స్థితి అంత ప్రోత్సాహకరంగానూ, లాభకరంగానూ లేనప్పుడు పత్రికలకు తమపొట్ట తాము పోసుకోవడమే కష్టమవుతున్నప్పుడు అనేకచిత్రాలతో, అనేకవిధాలయిన ఆకర్షణలతో భారతిని నడపడం చాలా ప్రయాససాధ్యమూ, ద్రవ్యసాధ్యమూను. ఏపత్రికకాపత్రిక అధమం స్వయంపోషకంగానైనా ఉండవలసినపరిస్థితు లేర్పడ్డాయి. ఇట్టిపరిస్థితులలోకూడా ఆంధ్రపత్రికాధిపతులు తమ శక్తికి దగినట్లు భారతిని నడపడానికే కృతనిశ్చయులవడం సంతోషింపదగ్గవిషయం. ఆంధ్రదేశంలోని ప్రముఖులైన రచయితలు వెనుకటివలెనే ఇకముందుకూడా అభిమానమూ, ఆదరమూ చూపి తోడ్పడినట్లయితే వెనుక నున్నన్ని ఆకర్షణలూ, చిత్రాలూ ప్రకటించడం సాధ్య మయినా కాకపోయినా ఇతరవిషయాలలో దేనిలోనూ భారతి వెనుకబడదని నిష్కర్షగా చెప్పవచ్చును.

సాధ్యమయినంతవరకు భారతిని వెనుకటికంటెకూడా సామాన్యపాఠకలోకానికి రుచించేటట్లు, హృదయరంజకంగా ఉండేటట్టు తీర్చిదిద్దవలెననే భారతీపత్రికా నిర్వాహకుల ప్రయత్నమూ, ఆశయమూను. ఇందుకుగాను సాహితీపరులూ, విజ్ఞానధనులూ హృదయపూర్వకంగా తోడ్పడగలందులకు కోరుతున్నాము.

* * *

# బాధ్యత

భారతి నిజంగా ఆంధ్రలోకానికి సేవ చేసేటట్టు, ఉపయోగకరంగా ఉండేటట్టు చూడవలసిన బాధ్యత రచయితలమీదా, పాఠకులమీదాకూడా ఉంది. అందులోనూ ప్రధాన బాధ్యత రచయితలది. చాలమందికి దినపత్రిక, వారపత్రిక, మాసపత్రికల విశిష్ట ధర్మము తెలియనట్లే తోస్తుంది. కొందరు రచయితలు వీలైతే దినపత్రికలోగాని, లేదా వారపత్రికలోగాని, లేదా భారతిలోగాని ప్రకటించవలసినదిగా కోరుతూ వ్యాసాలు పంపడం కలదు. ఆపంపిన వ్యాసము వీలైతే అన్నిపత్రికలలోనూ ప్రకటించమని వ్రాయడమూ ఉన్నది. దినపత్రికలోను, వారపత్రికలోను, భారతిలోను ప్రకటనకు పంపేవాటికి కొంత తేడా ఉండాలి. ఏ పత్రిక కాపత్రికకు దానిహద్దులూ, లక్ష్యాలూ వేరు. దినపత్రికకు పంపేవ్యాసాలు వారపత్రికకూ, వారపత్రికకు పంపేవి మాసపత్రికకూ ఉచితముగా ఉండవు. భారతికి పంపే ప్రతివ్యాసమూ ప్రజలకు తెలుపవలసిన, ప్రజలు తెలుసుకోవలసిన కొత్తవిషయాలను హృద్యంగా చెప్పేదికనో, అంటే విద్యావిషయక మయిన విలువగలదిగానో, లేక పద్యాలూ, కథలూ, నాటికలవంటి సాహిత్యాత్మకమైన విలువగలదిగానో ఉండాలి; విషయ విచారమును, ఆలోచనను ప్రేరేపించేచాలి అది.

రచయితలలో అనేకులు పద్యాలూ, కథలూ పంపడమే ఎక్కువ. ఏ విషయాన్నయినా బాగా చదివి, ఆలోచించి, మంచి చెడ్డలు తర్కించి వ్రాసే వ్యాసాలుగాని, ఆయా విజ్ఞాన, వాఙ్మయాది శాఖలకు సంబంధించిన కొత్తసంగతులను తెలిపే వ్యాసాలుగాని రావడము చాలా తక్కువ. పద్యాలలోకూడా చాలామట్టుకు ఛందోబద్ధమయిన పదరచనకలవే, పాత ప్రబంధఫక్కీ నున్నవే వస్తాయికాని కవితాత్మక విశిష్టత కలవి రావడం చాలా అరుదు. కవిత్వరచనకు ఎత్తుకునే వస్తువులోకూడా గొప్పదనం ఉండాలి. పద్యాలలో వ్రాసినదల్లా కవిత్వం కాదు. ఏది వ్రాసినా అందులో కొంత నవ్యతా, గుణమూ, ప్రాణమూ ఉండాలి.

ఇక కథలు మరీ నీరసంగా ఉంటున్నవి. వీటిలో చాలావరకు అనువాదాలు, లేదా అనుకరణాలు. ఇట్లని అనువాదాలు పనికిరావని కాదుకాని, అవి స్వకపోలకల్పితాలయితేనే వాటికి విలువ ఎక్కువ. ఇతివృత్తం విసుగువచ్చే ఒకటేమాదిరిది – అది సాధారణంగా ప్రేమవిషయకమే. ప్రేమవిషయకమైనా ఆదరణీయమే. కాని దానిని జీవం ఉండేటట్టు నడిపించగలగాలి. వృత్తం ఉదాత్తంగా ఉండాలి. మనస్సుకు ఒకవిధమయిన ఉత్తేజమూ, ఆనందమూ ఇవ్వాలి. కథలకు వస్తువుకోసం వెదుక్కోనక్కరలేదు. మన చుట్టూ చూసినదల్లా పనికివచ్చేదే. ఎటు వచ్చీ రచయితకు మానవప్రకృతి, మానసిక తత్వమూ, కళాదృష్టి బాగా తెలిసిఉండాలి.

ప్రకృతి విరుద్ధమయినవి అంత ఆదరింపదగ్గవి కావు. కథలలోగాని, పద్యాలలోగాని కొంత హుందాతనం ఉండాలి. అవి మరీ తేలికగానూ, పేలవంగానూ ఉండకూడదు. కథకయినా, కవిత్వానికయినా, మరిదేని కయినా కొంత గాఢమయినకృషీ, వ్యాసంగమూ అవసరం.

రచయితలుకొందరు వ్రాస్తూవుంటారు, ఎట్టివ్యాసాలు కావాలి? ఎట్టివి స్వీకరిస్తారు అని. అట్టివారికి సమాధానం ఇది. రచయితలు తమవ్యాసం ప్రకటన కావడమే ప్రధానంగా చూచుకోగూడదు. తాము తెలియ జెప్పవలసిన విషయ మేదయినా కొత్తది ఉన్నదా? అది ఏవిధంగా చెప్పితే ప్రజా హృదయానికి నచ్చుతుంది? పాఠకలోకానికి రంజకంగా ఉంటుంది? వ్రాసే రచనా విన్యాసం ఎట్లా వుంటే బాగుంటుంది? ప్రారంభ మెట్లా, అంత మెట్లా? ఈవిధంగా రచయితలు ముందు కొంత ఆలోచించుకొని, వ్రాయవలసిన విషయాన్ని బాగా అవగాహన చేసుకొని అప్పు డుపక్రమించాలి రచనకు. సాంఘిక, ఆర్థిక, రాజకీయ, విద్యావిషయక, వైజ్ఞానికాది విషయాలను గురించి అనేకవ్యాసాలు వ్రాయడాని కవకాశం వుంది. ఈ పైనిచెప్పిన శాఖలలో దినదినమూ ఎన్నో కొత్తపుస్తకాలు వస్తున్నాయి. నూతనానుభవం ఎంతో కలుగుతోంది. దినదినమూ ఈ శాఖలవిషయంలో ఇంగ్లీషులో వస్తున్న గ్రంథజాలంలో సహస్రాంశం కూడా మన తెలుగులో సంవత్సరానికి కూడా రావటం లేదంటే విచారం కలుగుతుంది. ఎందుచేత ఇది? వ్రాయాలనే ఉత్సాహం లేకనా? తెలియకనా? కాదు. శ్రద్ధలేక; పరిశ్రమించడానికి ఓపిక లేక. ఏదో ఒకవిషయాని కంటిపెట్టుకొని, దానికి సంబంధించిన గ్రంథసంచయాన్ని చదివి, మన ప్రస్తుతపరిస్థితులకు తగినట్టు, ఎట్లా దానిని వివరిస్తే బాగుంటుందో ఆలోచించి వ్యాసాలు వ్రాస్తే అట్టివి ఏపత్రికలవారికైనా శిరోధార్యాలు. ఆంధ్రలోకంలోని రచయితలు అట్టి ప్రయత్నం చెయ్యాలి. ఇంగ్లీషులో పాతబడి, చప్పనైపోయిన కథల్నీ, విషయాలనూ తెలుగులోకి తెచ్చి, ఇప్పుడు ప్రయోజనం అంతగా ఉండదు. ఆధునిక విజ్ఞానం — ఏ విషయంలో చూసినా — అనంతంగా పెరిగిపోయింది. ఇంగ్లీషు చదవలేని, నేర్వని ఆంధ్రప్రజ కది అందజేయడం లక్ష్యంగా ఉండాలి. వ్రాసే వ్యాసాలలో రచయిత తనవ్యాసంగంవల్ల ఆర్జించిన విజ్ఞానమేకాకుండా తానుకూడా కనబడాలి. ప్రతి వ్యాసమూ ఎత్తు దిగిపోకుండా మనసుకు ఉల్లాసం కలిగించేదిగానో, వినోదం కలిగించేదిగానో, విషయబోధకం చేసేదిగానో ఉండాలి.

వ్రాసే వ్యాసాలలోని విషయం మన రాజకీయ, ఆర్థిక, సాంఘికాది సమస్యలకు, అంటే మన దైనికజీవనానికి సన్నిహితమయి ఉండాలి; కేవలం గ్రంథస్థవాదాలకు మాత్రమే చెందినవైతే సామాన్య పాఠకలోకానికి రుచించదు. ఏ వ్యాసమయినా పాఠకలోకం నిమిత్తం ఉద్దేశింపబడేదే కాని ఆత్మ

సంతృప్తినిమిత్తం కాదు. ఆత్మ సంతృప్తికే అయితే దాన్ని ప్రకటించడమే అనవసరం. అందువల్ల రచయితలు వ్యాసం రచించే టప్పుడు దృష్టిలో ఉంచుకోవలసినవారు పాఠకులు. పాఠక హృదయరంజనం కావించని, పాఠక హృదయాన్ని ఆకర్షించని వ్యాసం ఎంత గొప్పదయినా అది నిరర్థక మయినదే. అందువల్లనే ఎంతటి సాంకేతిక విద్యావిషయక వ్యాసాలయినా, విజ్ఞాన పరిశోధక వ్యాసాలయినా వాటిని జనరంజకంగా సాంకేతికత ఏమీ లేకుండా వ్రాయగలిగి నప్పుడే అవి అనంత ప్రయోజనకారు లవుతాయి. అందువల్ల వ్యాసం రంజకంగా ఉన్నదా లేదా అంటే పాఠకహృదయమే దానికి ఒరిపిడిరాయి. వ్యాసం వారిహృదయాని కక్కేటట్టు, వారిమనస్సు నాకర్షించే టట్టు వ్రాయగలిగితేనే దానికి సార్థకత ఈ కాలంలో.

మన జీవితమూ, మన నిత్యకృత్యములూ బహుముఖాలైనవి. వీటిలో ఏ విషయమూ విమర్శకూ, చర్చకూ రానిదీ, సంస్కారాన్ని అపేక్షించనిదీ లేదు. అందువల్ల వ్రాయడానికి విషయం లేకపోలేదు; అధ్యయనం కావాలి; ఉపజ్ఞ కావాలి; నిపుణత కావాలి. మన జీవితసమస్యలూ, అభివృద్ధి సాధకములుగా వాటిని పరిష్కరించుకొనే మార్గాలూ వ్యాసాలలో వ్యక్తం కావాలి. ఇంతెందుకు, సర్వతోముఖమైన మనజీవితం మన వ్యాసాలలో ప్రతిఫలించాలి.

నేటి జీవితం ఒక మహాసంగ్రామం. పాతకూ కొత్తకూ, సిద్ధాంతానికీ ఆచరణకూ, అధికారానికీ దాస్యానికీ, సంఘానికీ వ్యక్తికీ, పెట్టుబడిదారుకీ కార్మికునికీ — ఈ విధంగా అనేకవిషయాలలో సంఘర్షణ అవిరతంగా, అనంతంగా జరుగుతోంది. ప్రతీ రంగములోనూ, ప్రతీశాఖలోనూ అరాజకమే. అందులోనూ పాశ్చాత్య దేశాలలోని కొత్తభావాలు, కొత్తప్రయోగాలు వచ్చి మన్ని ముంచెత్తివేస్తున్నాయి. ఈ మహాసంగ్రామంలో, మహాసంఘర్షణలో మన రచయితలు ఎవరికివారే ఏదో ఒకప్రత్యేక విషయాన్ని చేపట్టి వ్రాయాలి. ఆంధ్రలోకంలో సర్వతోముఖంగా ప్రబోధం కలిగించాలి. వ్యాసాలలో ఆఖరుకు మన సమస్యలనైనా ప్రదర్శించి చూపగలగాలి. మనజీవితం మీద మనకు అభిమానమూ, అభిరుచీ, మనభావిమీద గొప్ప ఆశా, లక్ష్యమూ, మన ప్రస్తుతస్థితిని గురించి జిజ్ఞాసా, సంస్కారప్రియతా గలిగించాలి. వ్యాసాలు గ్రాంథికంలో ఉన్నా సరే; వ్యావహారికంలో ఉన్నా సరే; రచయితలు వ్యాసరచనలో ఆరితేరిన ప్రసిద్ధులే కానక్కరలేదు, ఆరంభికులయినా సరే — వ్యాసం గుణవిశిష్టంగా ఉంటే చాలు.

రచయితలబాధ్యత చాలా గొప్పది. ఏ సంస్కారమయినా ఏ పరిష్కారమయినా ముందు భావపరివర్తనంరానిదే కలగదు. ఆ పరివర్తనం పత్రికలద్వారా, పుస్తకాల ద్వారా వాఙ్మయరూపకంగానే జరగాలి.

అట్టి పరివర్తనం కలిగించగలిగే ఉత్తమ వ్యాసాలు కావాలి ; ఉత్తమ రచయితలు కావాలి. అటువంటి రచయితలకూ, వ్యాసాలకూ భారతి ఎప్పుడూ స్వాగత మియ్యడానికి సంసిద్ధముగా ఉంటుంది. భారతిని పాఠక జనరంజకంగా తీర్చి దిద్దవలసిన గొప్ప బాధ్యత ప్రధానంగా రచయితలది.

పాఠకలోకానికి కూడా కొంత బాధ్యత లేకపోలేదు. పాఠక జనసామాన్యం కేవలము వినోదమూ, ఉల్లాసమూ కలిగించే తేలిక వ్యాసాల కలవాటుపడినట్లు కొంచెం బరువయినవ్యాసాల కలవాటుపడలేదు. జనరంజకంగా ఉండాలని కొంచెం తేలికవ్యాసాలు ప్రకటిస్తే మరీ నీరసంగా ఉంటోంది పత్రిక అంటారు పెద్దలు; కొంచెం బరువైనవ్యాసాలు ప్రకటిస్తే వాటిని మూచూడనైనా చూడరు సామాన్యపాఠకజనం. అందువల్ల కేవలం బరువైనవీ కాకుండా, కేవలం తేలికైనవీ కాకుండా ఉభయులకూ ఆమోదం కలిగేటట్టు వ్రాయవలసిన చేయవలసిన బాధ్యత రచయితలమీదా, పత్రికానిర్వాహకులమీదాకూడా ఉంది. కేవలం గుల్ల,పొల్లు పదార్థాలిచ్చినందువల్ల తాత్కాలికంగా వినోదం కలిగినా ఆకలి తీరదు; ప్రయోజనమూ ఉండదు. పాఠకులు కొంచెం బరువైన వ్యాసాలు చదవడానికి కొంచెం అలవాటుపడాలి; ఓపిక తెచ్చుకోవాలి. రచయితలు అట్టివి పాఠకలోకాన్ని ఆకర్షించేటట్టు వ్రాయాలి. రచయితలా, పాఠకులా, పత్రికానిర్వాహకులా పరస్పర సహకారంవల్లగాని పత్రికలకు సార్థకత, కృతకృత్యత కలగదు. అందువల్ల పైని చెప్పినవిషయాలు మనసులో వుంచుకొని, ఇదివరకువలెనే రచయితలు తమ యమూల్యరచనలను ప్రసాదించి మాకు ఇకముందుకూడా తోడ్పడాలని సవినయముగా ప్రార్థిస్తున్నాము. ఆంధ్రపాఠక లోకం కూడా మాకు తగిన ఆదరాభిమానాలు చూపి తోడ్పడాలని కోరుతున్నాము.

పాఠకులు భారతిలోపడే వ్యాసాలు ఏవి తమకు రుచిస్తున్నవో, ఏవి రుచించడం లేదో, ఏవిధమైన వ్యాసాలు అవసరమో— ఈ విషయాలను గురించి మాకు వ్రాస్తూ మాకు తోడ్పడుతూఉంటే వారి విమర్శనూ, వారిదృష్టినీ ఊతగా తీసుకొని భారతి నిక ముందు జనరంజకంగా సవరించి, నిజంగా దేశాని కుపకరించేటట్టు చేయడాని కవకాశం ఉంటుంది. పత్రికను అభివృద్ధి చేయడానికిచ్చే సూచనలను కృతజ్ఞతతో అందుకోగలము. కళాభిరుచీ, విజ్ఞానమూ కలిగించడమూ, సాహిత్యసేవ చేయడమూ భారతీ పత్రికాధిపతుల పరమాశయం. ఈ పరమాశయ సిద్ధికి తోడ్పడే మహాశయుల కెప్పుడూ కృతజ్ఞతా బద్ధులమై వుండగలము.

—శర్మ.

---*---

# కొండపల్లి ఖిల్లా

వట్టికొండ రంగయ్య

[మిత్రవర్గముతో కొండపల్లి ఖిల్లా చూచిన తరువాత]

ఒకనాడు రెడ్డిరాణ్ణికర మిచ్చోటనే సర్వాంధ్ర దేశరక్షణ మొనర్చె
ఒకనాడు కృష్ణరాయోర్వీశు డిచటనే చవిజూపె తనకత్తి శాత్రవులకు
ఒకనాడు యావనప్రకర మిచ్చోటనే యిస్లాముకేతనం బెగురవైచె
ఒకనాడు తెల్గుదేశోత్కర్ష మిచటనే దీప్తిరింఛోళి గేంద్రీకరించె

ఆమహోన్నతి నాడు హృదంతరమున
దలచినంతనె యొడలెల్ల పులకరించు;
కరుడుగట్టిన నెత్తురు కదలబారి
నింగి ముట్టగ పోర్లి యుప్పొంగ దకట!

ఇచటనే కాబోలు సిద్ధతేజుడు వేమధరణీశు రాణి యంతఃపురమ్ము
ఇచటనే కాబోలు నిబ్రహీంపాదుషాఫౌజు కాలికోలంది పారిపోయె
ఇచటనే కాబోలు కృష్ణరాయవిభుండు చిన్నమాదేవితో జేసె విడిది
ఇచటనే కాబోలు సచివుడౌ అప్పాజి పెద్దకూపమ్ము త్రవ్వించినాడు

కనుల పండువుగా నేడు గాంచినాడ
ఆంధ్రవీరుల భవ్యదివ్యస్థలాలు
వింటి వీనుల విందుగా వీరచరిత
హర్ష బాష్పాలు వర్షించు నక్షియుగళి.

వీరవరేణ్యహుంకారమ్ములకు మారు కంఠీరవకఠోరగర్జనములు
పరిమళసాంద్రోపవనవాటికకు మారు కంటకాకీర్ణవృక్షవ్రజంబు
వీణాదివాద్యనిక్వాణమ్ములకు మారు కర్ణకర్కశఝిల్లికారవమ్ము
రమణీయులగు ననూర్యంపశ్యలకు మారు కొమ్మలపై నూగుకోతిగుంపు

అతిభయావహమై పరీత్యమ్ము గలిగె
పుష్పవిక్రయవిఖ్యాతభూమియందె
అమ్మిన ట్లామె సుష్కేంధనమ్ము లౌర
సమయచక్రము నాప నసాధ్యముకద!

---

# కథలు వ్రాయుట ఎందుకు?

ఎస్. నాగేశ్వరరావు

కథాసాహిత్యప్రగతిని జూచి పాఠకులు అడుగవచ్చు 'కథలు వ్రాయుట ఎందుకు? ఎవరికి? శ్రీమంతుల మనోరంజనకా, గర్భదరిద్రులగు కిసాను కార్మికులకా' అని. ఇట్లు ప్రశ్నించుట స్వాభావికం గూడాను. వాద వివాదాలు జరుగుతున్నాయి గూడాను.

జీవనంయొక్క సుసంస్కృతరూపాన్నే 'కళ' అంటారు. కళాకారుడు ప్రాపంచిక విషయాల్ని అనుభూతివల్ల గ్రహించి, తన హృదయంలో వాటిని శుద్ధిచేసి 'కళ'గా మారుస్తాడు. మన అనుభూతిజ్ఞానాన్ని పెంపొందించుట కళోద్దేశం; కాని, కళ ఎందుకు అనే ప్రశ్న తీసుకొని విద్వాంసు లనేకులు అనేకవాదాల్లో ('isms') తమవిచారాల్ని ప్రకటించారు. "కళ కళ కొరకే (Art for art sake) అనే వాదులు కళను జీవనబంధనాలనుండి వేరుగా, నిర్లిప్తంగా వుంచగోరుతారు. వారికి వస్తుసౌందర్యమే చాలు; జీవన తత్వంతో పనిలేదు. జీవనానికి సౌందర్యానికి ఏం సంబంధం వుందో ఆలోచించరు. కళ కళే; జీవనం జీవనమే. రెంటికి సంబంధమే లేదట. ఇవి వేరుఅస్తిత్వాల్ని కలిగివున్నాయి. కళకు నైతికతకు సంబంధమేలేదు —

"All art is non-moral. No artist has ethical sympathies. An ethical symathy in an artist is an un-pardonable mannerism of style"[1]

ఈకళావాదులు అంటారు ''స్వాంతః సుఖాయ' అని ఆనందస్ఫూర్తిలో మేము రచనల్ని (కళను) రచిస్తున్నాము. సంఘం మేలుకొరకు గాదు. జీవనానికి కళకు సంబంధం లేదు'అని. వీరు రచన పాఠకసంఘంమీద ఎట్టిప్రభావం కలుగజేస్తుందో ఆలోచించరు. వీరికళావాదంలో శృంగారరసానికి ఎక్కువస్థానం వుంది. స్త్రీపురుష సంబంధంలోనే లలితకళను వెదుకుతారు. ఈవాదం (ism) 'నిరాబేవకూఫీ'గా (భ్రాంతిగా మూర్ఖత్వంగా) వుంది. ఇందులో తథ్యమే లేదు. 'స్వాంతః సుఖాయ' అని వ్రాస్తుంటే ప్రచురించుట ఎందుకు? కళాగ్రంథాల్ని నిర్మించి బీరువాల్లో వుంచుకోరాదు? ప్రజాసమక్షాన గ్రంథాల్ని వుంచాలనుకున్నప్పుడు మంచిచెడుగులను విచారించాలి. ప్రజకు లాభం కలిగించే గ్రంథాన్నే ప్రచురించాలి. 'స్వాంతః సుఖాయ' అని వ్రాసిన అశ్లీలసాహిత్యాన్ని ప్రచురించుట ఎందుకు?

మానవహృదయం రేడియోస్టేషనువంటిది. భావతరంగాలు ఎప్పుడూ వస్తూ పోతూ వుంటవి. మానవుడు తనహృద్గతభావాల్ని ఇతరుల హృదయంలో వ్యాపింపజేయటానికి ఉత్కంఠితు డగుతూవుంటాడు; మానవహృదయం ఇతరుల హృదయభావాల్ని తెలుసుకోవటానికికూడ ఉవ్విళ్లూరుతుంటుంది. అందు

1. ఆక్స్వారల్డ్.

చేతనే సాహిత్యంలో ఆకర్షణ వుంది. ఎన్ని మార్లు చదివినా తనివితీరదు. క్రొత్తగానే కనిపిస్తుంటుంది. మానవునకు తనభావాల్ని ఇతరులకు తెలియచెప్పనంతవరకు శాంతి కలుగదు. అతడు ఆనందం పొందలేడు. దుఃఖంలో మనుజుడు తన కష్టాల్ని యితరులకు వినిపించి కొంతవరకు దుఃఖాన్ని తగ్గించుకుంటాడు. ఈ అంతశ్శక్తిచే ప్రేరేపింపబడి కళాకారుడు కళను సృష్టిస్తాడు. కళద్వారా తన భావాలను ప్రకటిస్తాడు: అందుకనే 'కళ' మీద కళాకారుని వ్యక్తిత్వం పడుతుం దన్నారు. రవీంద్రబాబువంటి కవిపుంగవులు 'స్వాంతః సుఖాయ' అని కవితను సృష్టిస్తారు; కాని వారి 'స్వాంతః సుఖాయ' వల్ల ప్రజకు హాని కలుగదు. వారు ప్రజాప్రతినిధులు. ప్రతిభావంతులు. ఒక్కొక్కప్పుడు సంపూర్ణజాతివ్యక్తిత్వం ఒకే వ్యక్తిలో కేంద్రీభూత మవుతుంది. అట్టి వారి భావాలు పవిత్రంగా వుంటాయి. వారి కృతులు మనకు శిరోధార్యాలు. ఆదికవి కూడ "స్వాంతః సుఖాయ" అని, ఆత్మప్రేరేపణవలన కవితను సృష్టించాడు. అట్టివారి కృతులవల్ల మనకు హాని ఏం కలుగుతుంది? కాని ఇది ప్రతినిధి సంత(?)కవులకే చెల్లుతుంది. కథాకారులకు చెల్లదు. రవిబాబు కూడ 'స్వాంతః సుఖాయ' అని కథల్ని రచించలేదు. మానవజీవనాన్ని ఆదర్శంగా తీసుకొని, తన సందేశాన్ని, మనోగత భావాల్ని మానవహృదయమందిరంలోకి పంపించటానికి రచించాడు.

కళాకారుడు ఆత్మప్రేరేపణవల్లనే 'కళ'ను సృష్టిస్తాడు. ఇది సర్వసమ్మతం. ఆత్మప్రేరేపణ లేనిదే ఏపనీ సాధించలేము. కార్యసాధనకు ఆత్మప్రేరేపణ (అంతఃప్రేరణ) మూలబీజం వంటిది. ఆత్మప్రేరణకు కూడ హద్దున్నది. ఆత్మప్రేరణవల్ల పరులకు హాని కలుగకూడదు. ఆత్మప్రేరణ సంఘానికి అనుకూలంగా వుండాలి. హద్దు మీరిన ఆత్మప్రేరణాన్ని బలవాద మనవలసినదే. త్రాగుబోతుకూడ ఆత్మప్రేరణవలననే తాగుతుంటాడు. అది సంఘానికి గ్రాహ్యమా?

కళను జీవనాన్ని వేరుచేయలేము. కళ జీవనానికి చాల నికటస్థంగా వుంటుంది. జీవనం కళ అవినాసంబంధం కలిగివున్నాయి. జీవనం లేని కళ, కళ లేని మానవజీవనం వ్యర్థం, నిస్సారం.

"Art is the nearest thing to life. It is mode of amplifying experience and extending our contact with our fellow-men beyond the bounds of cur personal lct."[2]

కళ జీవనానికి రెండడుగులు ముందు నడుస్తుంటుంది. కావ్యేతరకళలకన్న కథా సాహిత్యం అత్యంత నికటంగా వుంటుంది. జీవనంతో కలిసిమెలసివున్నట్లే కనిపిస్తుంది.

కళాకారుడు (కళాస్రష్ట) యుగధర్మాన్ని అతిక్రమించగలడా? లోకరుచికి విపరీతంగా కళాసృష్టి చేస్తాడా? లోకరుచికీ యుగధర్మానికీ చాలసామ్యం వుంది. లోకరుచే యుగధర్మంగా మారుతుంది. మానవీయ విచారభావాల్ని 'లోకరుచి' అంటారు. లోకరుచి ననుసరించి లోకంలో 'కర్మ' జరుగును. నవ్యపరిస్థితులు ఏర్పడుతూ పోతూ వుంటాయి. పరిస్థితుల కోలాహలంలో ప్రాపంచిక బాహ్యరూపం మారుతూవుంటుంది. పరి

2. జార్జి ఇలియట్.

స్థితి బాహ్యరూపప్రభావం కళాకారునిహృదయంమీద పడుతుంది. దీన్నే సామయిక ప్రభావ మంటారు. ఈ సామయికప్రభావంలోకూడ ఒకస్థాయి వుంది. కథాకారుడు కూడ సంఘంలో వుంటున్నాడు. సంఘంలో యితర వ్యక్తులతోబాటు కష్ట సుఖాల్ని అనుభవిస్తున్నాడు. వాని హృదయం సంఘానిది. అతడు సంఘంనుండి వేరైపోలేడు. వాని హృదయం సంఘ(దేశ)హృదయంతో కలియనప్పుడు వాని అస్తిత్వమే వుండదు. "వర్షర్తువులోవలె మనుష్య సంఘంలో గూడ భావాల పొగఆవిరి విరివిగా విహరిస్తూ వుంటుంది. (—రవిబాబు)" ఆంధ్రుల్లో ఏ భావమేఘాలు విహరిస్తున్నాయి? ఇది సంఘర్షణయుగము. భారతహృదయం స్వాతంత్ర్యం కావాలని పరితపిస్తున్నది. కిసాను, కార్మికులు తమ వ్యక్తిత్వాన్ని గుర్తించారు. తమ హక్కుల్ని రక్షించుకోవటానికి సంఘర్షణ చేస్తున్నారు. ఏమూల చూచినా స్వాతంత్ర్యభావమే. ఈ భావమే మన కథాసాహిత్యంలో ప్రతిబింబించాలి.

"నీవు మానవజాతి యెడ సానుభూతి చూపుతూ, మానవజాతి సుఖదుఃఖాలతో మేళనం పొంది నీహృదయవీణ మ్రోగుతున్నట్లయితే, నీవు నిజమైన సత్కవిలా జీవన సంగీతాన్ని వింటూవుంటే, నాలుగువైపుల కెరటాలతో పొంగుతున్న లోకసాగరాన్ని, ఆకటిబాధకు తాళజాలక నీఎదుటనే చస్తున్న అసంఖ్యప్రజల్ని, గనుల్లో దిక్కులేక చచ్చే కూలీల శవాల్ని, సామ్రాజ్య పిపాసువగు రణచండికి బలియై ఛిన్నభిన్నంగా పడివున్న మనుష్య దేహరాసుల్ని, అండమానుదీవుల్లో జీవితాల్ని బలిపెట్టుటకై పోతున్న నిర్వాసిత సోదరుల్ని కండ్లార గాంచుతూ, విజేతల ఆనందదోత్సవాలు, నల్లరాతిబండల్ని కరిగించు విజితుల ఆర్తనాదాలు వినవస్తున్న యీ నిరాశాజనితాలైన యుద్ధాల్ని, యీ తుచ్ఛమైన మోసపుదృశ్యాల్ని చూస్తూ ధైర్యసాహసాలకు తిలాంజలి వదిలి నీవు ఉదాసీనుడవై వుండజాలవు. తప్పక ముందుకు వచ్చి నీవు పీడితప్రజలపక్షాన్నే గ్రహిస్తావు. ప్రకాశ మనుష్యత్వ న్యాయాలకై 'మట్టిలో' కలుస్తున్న ప్రజాపక్షంలోనే "సత్యం శివం సుందరం" వుందని నీవు ఎరిగివున్నావు."

'క్రోపాటికిన్' రష్యనులేఖకుని పైవాక్యాలు సత్కళాకారుడికి అమృతబిందువులు. కాముకశృంగార రసప్రియులకో —ఇనుప గుగ్గిళ్లు.

కళాకారుడు నేటివరకు శ్రీమంతుల విలాసత్వంలోనే కళను, సౌందర్యాన్ని వెతుకుతూవచ్చాడు. శ్రీమంతుల ఆశ్రితుడు, శ్రీమంతులకొరకే కళను నిర్మించేవాడు. వారికామలిప్సను చల్లార్చేవాడు. కళాకారునిదృష్టి అంతఃపురాలవైపుకే పరువెత్తేది. పుష్పవాటికల్లో నాయికా నాయకుల్ని చూచి ఆనందించి వుబ్బిపొయ్యేవాడు కళాకారుడు. ఇప్పుడు కళాకారుడు వ్యక్తివిశేషాశ్రితుడు గాడు; పూర్తిగా స్వతంత్రుడు. సంఘంలో ఒకవ్యక్తి. కాని పూర్వభావసంస్కారాన్ని త్యజించలేకపోతున్నాడు. పుష్పవాటికల్లోనినాయికానాయకులు'అప్-టు-డేట్' యువతీ యువకులుగా (కథలలో) మారినారు. నేడు కథాకారుడుకూడ అందమైన స్త్రీలోనే సౌందర్యాన్ని చూస్తున్నాడు. ఉపవాసాలు చేస్తూ అర్ధనగ్నంగా వుండే గర్భదరిద్రులలోకూడ సౌందర్యం వుందని తెలుసు

కొనుట లేదు. 'లిప్‌స్టిక్' వ్రాసిన అధరాల్లో, కనుబొమలలో, 'ఓటీ క్రీమ్' అద్దిన లేతకపోలాల్లో, మడమమెత్తు 'షూశ్'తో చేతులు చేతులు పెనవేసుకొని మృగీశిల్లా బజారులలో తిరుగాడు 'అప్-టు-డేట్ యువతుల్లోనే సౌందర్యాన్ని చూచి ముగ్ధు డవుతున్నాడు. కాని "ఇది బహుసంకీర్ణదృష్టి. విశాలదృష్టితో సూక్ష్మంగా సౌందర్యాన్ని పరిశీలిస్తే ఆ అధరాల్లో, కపోలాల్లో రూపగర్వం, నిష్ఠురత, అకర్మణ్యత దాగివుందని, వాడిపోయిన అధరాల్లో, జారిపోయిన కపోలాల్లో, ఎండుబొగ్గులమీదగా కారుతున్న కన్నీటిలో జబ్బితలలో, పీక్కు-పోయిన కండ్లలో త్యాగం, శ్రద్ధ, భక్తి, సహిష్ణుతలు దాగివున్నా యని బోధపడుతుంది." — (స్వర్గీయ ప్రేమచందు.)

ఆంతరిక భావసౌందర్యంలో ఎక్కువ ప్రభావ ముంది. బాహ్యసౌందర్యవర్ణన భావ సౌందర్యాన్ని పుష్టిచేయటానికిమాత్రమే రావాలి. వర్ణనాత్మకశైలికన్న భావాత్మక శైలిలో ఎక్కువ సౌందర్యం యిమిడి వుంటుంది. భావాత్మకశైలి చాల ప్రభావం గలది. అస్తు. ఒక కురూపి వ్యక్తిలో అత్యుత్తమభావా లుండవచ్చు. వాని ఆత్మ ఉజ్జ్వలంగా వుండొచ్చు. శారీరకసౌందర్యానికి ఆత్మసౌందర్యానికి సంబంధం లేదు. అందమైన వ్యక్తిలో కలుషితభావా లుంటాయి. వాని భావాలకీ సౌందర్యానికీ సంబంధం లేదు. ఈ భావ(ఆత్మ)సౌందర్యాన్ని కథల్లోకి తీసుకురావాలి. కథలు భావప్రధానాలుగా వుండాలి.

ప్రాచీనభారతీయ సాహిత్యంలో దివ్యోత్తమ పురుషుడు ప్రధానపాత్రగా వస్తూండేవాడు. రాజు ప్రధానపాత్రగా ఉండేవాడు. ధీరోదాత్త, ధీరోద్ధత, ధీరలలిత, ధీరప్రశాంత నాయకులే గ్రాహ్యులని భరతముని వ్రాశాడు. ఇది పరిస్థితుల ప్రభావం, ప్రతిబింబం. అప్పుడు ప్రజాసభ్యతకు రాజు కేంద్రంగా ఉండేవాడు. ప్రజాభావాలు రాజులో కేంద్రీకరింపబడి వుండేవి. రాజు భగవదంశాసంభూతు డని ప్రజలు తలంచేవారు. నేటి యుగం సామ్యయుగం. ప్రజాదృష్టి రాజు నుండి మరలింది. ప్రజలు దేశానికి జీవగర్రలు. అప్పటి రాజు 'సంఘటన' గా మారాడు. ప్రజల ఐక్యతవల్ల సంఘటన ఏర్పడుతుంది. నేడు ప్రజల భావాలు దేశంలోను జాతిలోను కేంద్రీకృతము లైనాయి. ఏమూల చూచినా 'సామ్య' వాతావరణం కనిపిస్తుంది. ఈపరివర్తనవల్ల సాహిత్యంలో కృతిపాత్ర కూడ తారుమారయాడు. పీడితగర్భదరిద్రుడు 'కృతిపాత్ర' అయ్యాడు. ఎక్కువగా కథా(నవల)సాహిత్యం పీడితప్రజాపక్షాన్ని తీసుకొంటుంది. కాని తెలుగు కథాసాహిత్యం యింకను దానికి దూరంగానే వుంది. అది ఇప్పుడిప్పుడే ప్రజాపక్షాన్ని గ్రహిస్తున్నది.

**కథలకు రాజనీతికి సంబంధం :**

సాహిత్యం సృష్ట్యారంభంనుండీ మానవసంఘంలో ఆదరించబడుతూ వస్తున్నది. కనుకనే లలితకళల్ని 'శక్తిసాహిత్య' మన్నారు. ఈసాహిత్యం మానవసంఘంలో హమేషా ఒకేతీరున గౌరవించబడుతుంది. మనుష్యసంఘంలో మొదట సంఘనీతి పుట్టింది. రాజనీతి చాల వెనుక పుట్టింది. పశుపక్ష్యాదుల్లోకూడ సంఘనీతి అవికసితరూపంలో నేడు కానవస్తుంది. ఈసంఘనీతి సభ్యతానుక్రమంగా వృద్ధిపొంది రాజనీతిగా మారింది.

నేడు సాహిత్యం[3] రాజనీతికి దూరంగా వుండాలని కొందరు, రాజనీతిప్రచారానికి సాహిత్యం వ్రాయబడాలని కొందరు వాదిస్తున్నారు. ఈ వాదాలు భ్రామకాలు. సాహిత్యంవల్ల లాభం పొందాలని రాజనీతిజ్ఞులు అభిలషించుట స్వాభావికమే. కాని నేడు ఫాసిస్టులు, కొన్ని అంశాల్లో సామ్యవాదులు తమ రాజనీతి కనుకూలంగా వున్న సాహిత్యాన్నే పోషిస్తున్నారు; అనుకూలంగా లేని సాహిత్యాన్ని పుటిటిలోనే పొట్టబెట్టుకుంటున్నారు. ఇది చాల అన్యాయం. ఆంధ్రదేశంలోకూడ ఈ అభిప్రాయాలు గల సామ్యవాది యువకు లున్నారు!

సాహిత్యం హృదయ ప్రధానమైంది. హృద్గతభావాల ప్రకటీకరణరూపాన్ని సాహిత్య మంటారు. సాహిత్యం రసపరిపూర్ణమైంది. శుష్కోపదేశానికి తావులేదు. సాహిత్యకారుడు దేశదుస్థితిని జూచి ద్రవీభూతచేతస్కుడై దుఃఖిస్తాడు; కాని రాజనీతిజ్ఞుని శుష్కవుపన్యాసాలవలె వానిభావాలు మూర్తరూపం పొందవు. సాహిత్యకారుడు హృదయసంవేదనాన్ని కల్పనసహాయంతో సాహిత్యంగా మారుస్తాడు. ఈ భావప్రకటీకరణాన్ని చదివినప్పుడు, రచయిత హృదయంలో పుట్టిన సంవేదన పాఠకునిహృదయంలో కూడ పుట్టుతుంది. సాహిత్యకారుని హృదయ సంవేదనకల్పనలో ఒక మాధుర్యం వుంటుంది. మాధుర్యాన్ని సాహిత్యకారుడు త్యజించలేడు. ఈమాధుర్యంవల్ల కృతి ప్రభావం హృదయంమీద అతి త్వరితంగా పడుతుంది.

మొదట 'సంవేదన' రూపంతో రాజనీతికూడ హృదయంలో వుంటుంది. ఒక్కొక్కప్పుడు ద్వేషభావంవల్లకూడ వుంటుంది. అందుకనే రాజనీతి ద్వేషపూర్ణంగా వుంటుంది. ఈ సంవేదనభావం జన్మస్థానంలో ఎక్కువకాలం వుండజాలదు. ప్రకృతిరూపు మారిపోతూంటుంది. బాల్యావస్థలోనే మస్తిష్కంలోకి దత్తు వెళ్లుతుంది. భావరూపంగా రాజనీతి 'విచారం'గా మారిపోతుంది; — "అనగా హృదయంలో సంవేదన కలుగుతుంది. ఈ సంవేదనవికారంవల్ల భావంగా మారి కొంచెంసేపు విచారాధీన మయ్యేటప్పటికి శుష్కరాజనీతిగా మారిపోతుంది."— (శుక్లజీ.)

సాహిత్యానికి రాజనీతికి సంబంధం లేదనుట, రాజనీతిప్రచారానికై సాహిత్యాన్ని నిర్మించాలనుట మూర్ఖత్వం. సాహిత్యానికి జీవనానికి గాఢసంబంధ ముంది. ఈ అన్యోన్య సంబంధంవల్ల సాహిత్యంలో ఒక అలౌకికబలం వస్తుంది. సాహిత్యం జీవన సంఘర్షణ నుండి వచ్చిన నిష్కర్షణం. లోకజీవనానికి రాజనీతికి దగ్గరచుట్టరికం. తరచుగా రాజనీతివల్ల లోకజీవనంలో సంఘర్షణ కలుగుతుంది. ఈ సంఘర్షణప్రభావానుకూలంగా సాహిత్యం జన్మిస్తుంది. కాని సాహిత్యానికి రాజనీతికి స్థూల దైహిక సంబంధం లేదు. ఒకటి మధురభావప్రధానం; మరొకటి శుష్కవిచారప్రధానం. సాహిత్యకారుడు దేశదుస్థితిని జూచి హృదయంలో కలిగిన 'ఆత్మసంవేదన'నుమాత్రం వెల్లడిస్తాడు. ఆత్మసంవేదన కలిగినప్పటికి రాజనీతిజ్ఞుడు

---

3. ఈవ్యాసంలో 'సాహిత్యం' 'లిటరేచర్' అనే అర్థంలో వుపయోగించలేదు; 'కావ్యకళ' అనే అర్థంలో వుపయోగించాను. ఎక్కువగా ఇది కథాసాహిత్యానికే అన్వయిస్తుంది.

విచారపూర్ణమగు రసహీన శుష్కప్రచారం (propaganda) చేస్తారు. రాజనీతిలో ద్వేషాలకి, పార్టీలకు స్థాన ముంది; సాహిత్యంలో లేదు. రాజనీతి తుగాతుగానికి సమయానుకూలంగా మారుతుంది; సాహిత్యం సామయికంగా కనిపించినా దానిలో స్థాయిత్వ ముంది. దాని బాహ్యరూపాంగాలు మారుతున్నప్పటికీ 'ఆత్మ' (రసం) ఒకటిగానే వుంటుంది. రెంటిలో ఇన్ని భేదా లున్నప్పటికీ ఆత్మికసంబంధం వుంది. రూపకాలంకారంగా చెప్పాలంటే, సాహిత్యం 'స్త్రీ'; రాజనీతి 'పురుషుడు.' ఇద్దరు ఒకే ఆదర్శమార్గంలో నడవాలి. ఇద్దరిఆత్మలు ఒకేలక్ష్యకేంద్రాన్ని చేరుకోవాలి. రెండు ఆత్మలు కలిసినప్పుడు దేదీప్యమానమైన ఒకజ్యోతి పుట్టుతుంది. ఆజ్యోతిప్రకాశంలో, పరాధీనాంధకారంలో పడి కొట్టుకొంటున్న విజితజాతి మార్గంలో వున్న ముండ్లు ముతకలను బాగుచేసుకొంటూ పోయి స్వాతంత్ర్యవేదికపై ఎక్కగలదు.

కాబట్టి కథలు ప్రచారం (propaganda) కొరకు వ్రాయగూడదు. వ్రాస్తే 'కళ' నష్టమైపోతుంది; కథలు 'కళ' హీనమైపోతాయి. రాజనైతిక కక్షల(వాదాల)తో కథాకారునికి ఏమీ సంబంధం వుండగూడదు. ఈ వాదాల'isms'వల్ల 'కళ' నష్టమైపోతుంది; కాని ఒకవైపున రోమునగరం కాలిపోతున్నప్పటికీ విలాసత్వంలో మునిగితేలుతున్న రోమను చక్రవర్తి 'నీరో' వలె కథాకారుడు రాజనీతి వేపు వుదాసీనుడై తనమానసికవిలాసత్వంలో మునిగితేలగూడదు. భారత రాజనైతిక వాదాల్లో 'రోటీ'వాదం ముఖ్యమైంది; తరువాత స్వాతంత్ర్యవాదం. ఈ రెండువాదాల ప్రభావం సాహిత్యానికి గ్రాహ్యం. పీడిత మానవత్వాన్ని కథావస్తువుగా తీసుకోవాలి.

రాజనీతికీ సాహిత్యానికీ పరస్పరసంబంధం వుంది. ఒకదాన్ని విడిచిపెట్టి మరొకటి వుండజాలదు. రాజనీతిప్రభావం సాహిత్యంమీద పడినందువల్ల సాహిత్యం నవీనరూపం దాలుస్తుంది; ప్రగతిశీలసాహిత్యంవల్ల రాజనీతికి(దేశానికి) లాభం కలుగుతుంది. రెండు అవినాసంబంధం కలిగి వస్తూంటాయి. కాని కథాకారుడు 'వాదం' లో పడి ప్రచారకుడు (propagandist)గా మారగూడదు. తనభావాల్ని విచారరూపంగా ప్రకటించగూడదు; భావరూపంగానే వ్యక్తపరచాలి. అట్లా కాకపోతే కథాకారుడు కళాక్షేత్రం నుండి చ్యుతు డవుతాడు. ఒక ఉదాహరణ:

"కాశీ పుణ్యక్షేత్రం కావచ్చు. కాని అందరూ తమపాపాలు దానినెత్తిన అంటగట్టి తమ మానాన్న తాము తప్పుకోదలచడంచేత దానికి అన్నిటినీ భరించడం దుర్భర మైపోయింది. అంచేత కాశీ, జనులపాపాల్ని తీర్థపురోహితులుగానూ, సన్యాసులనుగానూ తయారుచేస్తున్నది. వాళ్ల చేతుల్లో పడ్డవాళ్లకి ముక్తి లేదు. అందులో సన్యాసుల సంగతి మరీ ఘోరం........."

ఇక్కడ రచయిత తనకళాక్షేత్రాన్నుండి చ్యుతుడై, ప్రచారకుడుగా తనభావాల్ని విచారరూపంగా ప్రకటించాడు. కథల్లో ఇది పనికిరాదు. కథలోని ఘటనాశృంఖల, భావం తెగిపోయి ముడిపడతాయి. అందువల్ల రచయితలు దేశపరిస్థితులను గమనించి కళాదృష్టితో ఉద్ధతులచే పీడితులయిన జనుల నిమిత్తం కథలు రచించాలి.

# ప్రాతిశాఖ్యలు; పాణినీయము[1]

వ్యాకరణ విద్యాప్రవీణ, న. చ. వేంకటచక్రవర్తులు

ప్రాచీనభారతీయవిజ్ఞాన మంతయు వేదముల యందు నిబిడీకృతమైయున్నది. అట్టివేదముల నర్థము చేసికొనుటకు వేదాంగము లుద్భవించినవి. ఆవేదాంగముల యందు వ్యాకరణము ముఖ్యమైనది. సాయణాచార్యులు వ్రాసిన వేదభాష్యమునుబట్టి మన కీవిషయము తెలియగలదు. ఒక్కొక్క మంత్రమున కర్థమును నిర్ణయించుట యందును, సాధుత్వప్రతిపాదనమందును ప్రమాణముగా వ్యాకరణసూత్రము లనువదింపబడియున్నవి. ఏ భాష యొక్కయు యథార్థస్వరూపమునుగాని, అర్థమునుగాని నిర్ణయించునది వ్యాకరణముగదా! ఒక్కొక్క వేదమున కనేకశాఖలు గలవు. ఆశాఖల ననుసరించి యనేకపాఠభేదములు గలవు. ఏశాఖలో పాఠము లెట్లుండవలయునో ప్రాతిశాఖ్యలు నిర్ణయించును. అనుస్వార ముచ్చరించునపుడు దానివెనుకనున్న యచ్చునుమాత్ర మనునాసికగా నుచ్చరించవలయు నని యథర్వవేదప్రాతిశాఖ్య చెప్పుచుండగా అనునాసిక గకారముగ నుచ్చరించవలయునని తైత్తిరీయప్రాతిశాఖ్య చెప్పుచున్నది. ఇట్టిపాఠభేదములు ప్రాతిశాఖ్యల యందు విశేషముగా గలవు.

'ప్రతిశాఖం భవాః ప్రాతిశాఖ్యాః' -- ప్రతివేదశాఖను సంబంధించిన వని యర్థము. ఆప్రాతిశాఖ్యలు ఆవేదశాఖలయొక్కయుచ్చారణనుగూర్చియు, సంధివిశేషములనుగూర్చియు, అర్థములనుగూర్చియు, స్వరమునుగూర్చియు, ఆవేదసాంప్రదాయమునుగూర్చియు, వివరముగా జెప్పును. ఇవి కేవల మాయాశాఖలకు సంబంధించిన వగుటచే ఒకప్రాతిశాఖ్యచే మరియొకశాఖ యొక్క అర్థనిర్ణయాదులు వివరింపబడవు. ఈకారణముచేతనే లౌకికపదసాధుత్వముగూడ ప్రాతిశాఖ్యలచే నిర్వహింపబడదు. అది పాణినీయ వ్యాకరణముచే జరుగును.

" పాణినినా ప్రోక్తం " పాణినీయం - పాణినిచే రచింపబడినగ్రంథ మని యర్థము. పాణిని సూత్రములను వ్రాసెను. అందుగల లుప్తభాగములను పూరించుచు కాత్యాయనుడు వార్త్తికములను వ్రాసెను. ఈ రెండింటికి పతంజలి వ్యాఖ్యానరూపముగ భాష్యమును వ్రాసెను. వీటి నాధారముగా గొని వ్యాకరణశాస్త్రమంతయు బయలుదేరినది. పాణినికిపూర్వము ౬,౮ గురు వైయాకరణు లున్నట్లు చరిత్రవలన తెలియుచున్నది. కాని వారివ్యాకరణములు లౌకికసంస్కృతమునకు మాత్రము సంబంధించిన వగుటచేతను, ప్రాతిశాఖ్యలు వైదిక సంస్కృతమునకు మాత్రము సంబంధించిన వగుటచేతను, వైదిక లౌకికసంస్కృతముల రెండింటికిని సంబంధించినట్లు వ్రాయబడిన పాణినీయము లోకమున విశేషవ్యాప్తి చెందినది. ఇందు లౌకికసంస్కృతపదములకంటె భిన్నములగు వైదికపదములకు "ఛందసి" "వేదే" అనియు, వైదికభిన్నములగు లౌకికసంస్కృతపదములకు "లోకే" "భాషాయాం" అనియు ప్రత్యేకముగా సాధుత్వము చెప్పబడియున్నది.

ప్రాతిశాఖ్య లన్నియు క్రీస్తుపూర్వము, ౫,౬, శతాబ్దములలో పుట్టియుండును. పాణిని క్రీస్తుపూర్వము ౪-వ శతాబ్దమువా డనియు, కాత్యాయనుడు ౩-వ శతాబ్దమువా డనియు, పతంజలి ౨-వ శతాబ్దమువా డనియు చరిత్రకారు లూహించియున్నారు. క్రీస్తుపూర్వము ౩, ౪ శతాబ్దములమధ్య సంస్కృతభాష వ్యవహారమునుండి తొలగియుండుటచే భాషలో క్రొత్తపదములు ప్రవేశించుట కవకాశము లేకపోయెను. కావున భాషకు స్థిరత్వ మేర్పడి పాణినీయవ్యాకరణమునకుగూడ స్థిరత్వమును, సమగ్రతయును సంభవించినవి. ఈ కారణముచేత గూడ తక్కినవాటికంటె పాణినీయ మాధిక్యమును పొందియున్నది.

---

1. ౨౮-౬-౩౮ తేదీని విజయనగరములో జరిగినఆంధ్రభారతీతీర్థసమావేశమున చదువబడినది.

మరియు ఈశ్వరుడు తన ఢక్కను వాయించి యాన్యములను పాణిని కుపదేశించె ననియు, అదియే అతని వ్యాకరణమునకు మూలభూతము అనియు "నంది కేశ్వరకాశిక" యను గ్రంథమున గలదు.

"నృత్తావసానే నటరాజరాజో
ననాద ఢక్కాం నవపంచవారమ్
ఉద్ధర్తుకామః సనకాదిసిద్ధా
నేత ద్విమర్శే శివసూత్రజాలమ్".

ఈశ్వరప్రోక్తము కావున దీని కీప్రాశస్త్యము వచ్చియుండవచ్చును. ఈవిషయము విశ్వసనీయ మైనను కాకపోయినను మాహేశ్వరసూత్రముల నబడు నీ గద సూత్రములును వర్ణసమామ్నాయమును బోధించుటయందు విచిత్రరీతి నవలంబించుచున్నవి. ఇందు మాతృకాపాఠము, ప్రాతిశాఖ్యాదులయం దుండు క్రమముగూడ మార్చబడి మరియొకవిధముగా అక్షరములు కూర్చబడినవి.

మాతృకాపాఠమందును, ప్రాతిశాఖ్యలయందు నున్న క్రమము — మొదట స్వరములు (అచ్చులు), తదు పరివ్యంజనములు (హల్లులు), ఆవ్యంజనములయందుగూడ మొదట స్పర్శలు (క — మవరకు), తర్వాత అంతస్థలు (య, ర, ల, వ లు) తర్వాత, ఊష్మలు (శ, ష, స, హాలు) అని యీవరుసగా నుండును.

స్పర్శలు

| శ్వాస | | నాద | | |
|---|---|---|---|---|
| అల్ప ప్రాణ | మహా ప్రాణ | అల్ప ప్రాణ | మహా ప్రాణ | అను నాసిక |
| క | ఖ | గ | ఘ | ఙ |
| చ | ఛ | జ | ఝ | ఞ |
| ట | ఠ | డ | ఢ | ణ |
| త | థ | ద | ధ | న |
| ప | ఫ | బ | భ | మ |

స్పర్శవర్ణములలోగూడ మొదట శ్వాసవర్ణములు (అల్పప్రాణ, మహాప్రాణభేదములతో), తర్వాత నాద వర్ణములు (అల్పప్రాణ, మహాప్రాణ, అనునాసికభేదము లతో) ఉండును.

ఈయక్షరముల నిట్లు చేర్చుటయం దీయుక్తి గన్పడుచున్నది — మొదట స్వతంత్రవర్ణములు — స్వరములు (అచ్చులు), తర్వాత అస్వతంత్రవర్ణములు — వ్యంజనములు (హల్లులు). వ్యంజనములలో మొదట పూర్తిగా స్పర్శగలవి స్పర్శలు (క-మవరకు); కొంచెము స్పర్శగలవి అంతస్థలు (య, ర, ల, వ) స్పర్శ లేనివి ఊష్మలు (శ, ష, స, హాలు).

క మొదలుగల వర్ణములను పంచవర్గ లందురు. ఈపంచవర్గముల నిట్లు చేర్చుటయందు వర్ణోత్పత్తిస్థానముల యొక్క క్రమము గ్రహింపబడినట్లు తోచుచున్నది. నాలుక ఆయా వర్ణోత్పత్తిస్థానములను తాకినయెడల ఆయా వర్ణములు పుట్టును. 'నాలుక మొదటిభాగము హనుమ (దవడ)మూలమును స్పృశించిన కవర్గ[1]యును; నాలుక మధ్యభాగము తాలువు (నోటియందు మీదిభాగము-roof of the mouth, palate)ను తాకిన చవర్గ[2]యును, నాలుక వెనుకకు త్రిప్పి కొనతో మూర్ధ (తాలువునకు ముందుభాగము)ను మట్టిన టవర్గ[3]యును, నాలుక కొనతో దంతమూలములను సంబంధించిన తవర్గ[4]యును, క్రిందపెదవి మీదిపెదవిని తగిలిన పవర్గ[5]యును పుట్టును. ఈ స్థానములు మన నోటియందు వెనుకనుండి ముందునకు వరుసగా నున్నవి గావున వర్గములకుగూడ నీ క్రమము వచ్చియుండవచ్చును.

పాణిని నేర్పరచిన క్రమము:— మొదట అచ్చులు, తదుపరి య, ర, ల, వలు, ఆపిమ్మట క్రమముగా వర్గలయొక్క పంచమవర్ణములు, చతుర్థవర్ణములు, తృ

1. హనుమూలే జిహ్వామూలేన కవర్గే స్పర్శయతి — ౨-౩౫, తై ప్రా.
2. తాలౌ జిహ్వామధ్యేన చవర్గే — ౨-౩౬.
3. జిహ్వాగ్రేణ ప్రతివేష్ట్య మూర్ధని టవర్గే — ౨-౩౭.
4. జిహ్వాగ్రేణ దంతమూలేషు తవర్గే — ౨-౩౮.
5. ఓష్ఠాభ్యాం పవర్గే — ౨-౩౯.

తీయవర్ణములు, ద్వితీయవర్ణములు, ప్రథమవర్ణములును- తర్వాత శ, ష, స, హలను ఉంచెను. ఈతను మొదటి అక్షరమును, కొసఅక్షరమును కలిపి పేరుపెట్టి, ఆ పేరుతో నామస్థమున్న వర్ణములను వ్యవహరించుచుండెను. ఆ పేరుతోనే ఆవర్ణములకు కార్యములు విధించుచుండెను. అప్పుడా కార్యములు యిష్టమగువర్ణములకే తప్ప అనిష్టములగు వర్ణములకు రాగూడదుగనుక మొదట అక్షరముల కూర్చునపుడే జాగ్రత్తగా కూర్చెను; ఉదా:—

అ, ఇ, ఉ, ణ్, ఋ, ఌక్, ఏ ఓఙ్, ఐ ఔచ్.

ఇందు మొదటి అకారమును కొసచకారమును కలుపగా అచ్ అయినది. ఇట్లే హలాదిసంజ్ఞలు తెలియగలవు. ఈరీతిగానే పేరుపెట్టి వర్గతృతీయ వర్ణములను జస్‌లనియు వ్యవహరింతురు. ఇట్టి సౌలభ్యమును గ్రహించకపోవుటచేతనే తెలుగువైయాకరణులు క, చ, ట, త, పలు పరుషంబు లనియు, గ, జ, డ, ద, బలు సరళంబు లనియు గురుసంజ్ఞను (నామాంతరమును) పెట్ట వలసివచ్చినది.

ఇట్లు క్రమముమాత్రమేగాక స్వరాదిసంజ్ఞలు కూడ పాణినిచే గ్రహించబడలేదు. ప్రాతిశాఖ్యకర్తలు స్వరాదిసంజ్ఞతో బోధించువర్ణములను పాణినిస్వరములకు అచ్చు లనియు, వ్యంజనములకు హల్లు లనియు, స్పర్శలకు ఝయ్ లనియు, అంతస్థలకు యణ్ లనియు, ఊష్మలకు శల్ లనియు వేరుపేర్లతో వ్యవహరించిరి. ఈపేరులు మొదటిపేరులకంటె చిన్నవి. ప్రతిచోటను ఆ ఆ వర్ణముల కాయాకార్యములను విధించునపుడు మాత్రములయందు చిన్నపేరు లుండవలెనని పాణినితలంపు. అందుచేతనే పతంజలి పాణిన్యభిప్రాయమును వ్యక్తీకరించుచు "లఘ్వర్థం హి సంజ్ఞాకరణం" - తక్కువ పేరుతో చాలావర్ణములను బోధించుటకుగదా పేరు పెట్టుట అని చెప్పినాడు. "అర్ధమాత్రాలాఘవేన పుత్రోత్సవం మన్యంతే వైయాకరణాః"—అర్ధమాత్ర తగ్గినను వైయాకరణులు పుత్రులు కల్గినట్లు సంతోషింతు రని కలదు. పైని పేర్కొనిన ౫ సంజ్ఞలలోను మొదటి అచ్, హల్ అనురెండుసంజ్ఞలు వ్యవహారమునందు గలవు. తక్కినవిమాత్రము ఆశాస్త్రజ్ఞుల వ్యవహారమునందే గలవు.

పాణిని పెట్టిన అచ్ మొదలుగాగల సంజ్ఞలు వర్ణములను బోధించునవిమాత్రమేకాని ఆపేరుకు సరియగు నర్థ ముండదు. ప్రాతిశాఖ్యకర్తలు పెట్టినసంజ్ఞలకు కొంత యర్థము గలదు.

స్వరములు:—స్వరము లనగా అచ్చులు. ఏప్రాతిశాఖ్యకర్తగాని స్వర మనుపదమున కర్థమును వివరింపలేదు. వ్యాఖ్యాతలుమాత్రము ఎవరికి తోచినరీతిని వా రర్థనిర్ణయమును గావించిరి. ఋగ్వేదప్రాతిశాఖ్యవ్యాఖ్యాత ఉవ్వటుడు "ఉదాత్తానుదాత్తస్వరితప్రచయాః యేష్వక్షరేషు స్థితాః శబ్ద్యంత ఇతి స్వరాః" అని చెప్పినాడు, అనగా ఉదాత్తానుదాత్తస్వరితప్రచయములగు స్వరములు కలవని యర్థము. తైత్తిరీయ ప్రాతిశాఖ్యవ్యాఖ్యాత గోపాలుడు "స్వయం రాజంతే నాన్యేన వ్యజ్యంత ఇతి స్వరాః" అని చెప్పినాడు; అనగా ఇతరసహాయములేక తమంతట తా ముచ్చరించబడున వని యర్థము. "యః స్వయం రాజతే తం తు స్వర మాహ పతంజలిః" అని పతంజలిని తనకు ప్రమాణముగా గ్రహించినాడు.

ఇం దుదాత్తాదిస్వరములు కలవి స్వరము లని చెప్పిన మొదటివివరణమే రెండవదానికంటె సరిగా నున్నది. అచ్చుగాని హల్లుగాని స్వతంత్రముగ నుచ్చరించుట కవకాశము గలదు. అచ్చుసహాయములేకుండా హల్లు నుచ్చరించుటకంటె కేవలము అచ్చు నుచ్చరించుట సులభము. నాదకభావలోమాత్రము నుండుగాని నెను కనుగాని అచ్చులేకుండా హల్లుండదు. స్వరము కేవలము అచ్చులయందేగాని హల్లులయం దుండదుగావున అచ్చులకిదియే యసాధారణధర్మ మని చెప్పట తగును.

వ్యంజనములు:— వ్యంజనము లనగా హల్లులు. ఏప్రాతిశాఖ్యకర్తగాని వ్యంజన మనుపదమున కర్థమును వివరించలేదు. వ్యాఖ్యాతలుమాత్రము ఎవరికి తోచినరీతిని వా రర్థమును వ్రాసిరి. ఋగ్వేద ప్రాతిశాఖ్యవ్యాఖ్యాత ఉవ్వటుడు "వ్యంజయం త్యర్థా న్ప్రకటీకుర్వంతీతి వ్యంజనాని" అని చెప్పినాడు, అనగా అర్థబోధకములు వ్యంజనములని యర్థము. తైత్తిరీయ ప్రాతిశాఖ్యవ్యాఖ్యాత గోపాలుడు

"పరేణ స్వరేణ వ్యజ్యత ఇతి వ్యంజనమ్" అని చెప్పినాడు; అనగా తర్వాతనుండు అచ్చు సహాయముచే నుచ్చరించబడునదని యర్థము. ఈపై రెండుఅర్థములలో మొదటి యర్థమే బాగున్నట్లు తోచుచున్నది; ఏలననగా భాషయందు వ్యంజనములుమాత్రమే అర్థమును బోధించునవి. మనుష్యులును, మృగములును అచ్చు లుచ్చరించుటయందు సమానము. హల్లు లుచ్చరించుటయందుమాత్రము మృగములకంటె మనుష్యుడే అధికుడు. ఈహల్లు లుచ్చరించుటచేతనే మనుష్యుడు మృగముల నతిక్రమించి మానవత్వమును సంపాదించుచున్నాడని పాశ్చాత్య భాషాశాస్త్రవిమర్శకుడు "ఆండ్రూ లీఫెవర్" (Andrew Lefevre) వ్రాసినాడు

ఇంగ్లీషుభాషలోగల హల్లును బోధించు 'కాన్సొనెంట్' (Consouant) అనుపదమునకు స్వరముతో గూడిన దని యర్థము. ఈయర్థము తైత్తిరీయ ప్రాతిశాఖ్యవ్యాఖ్యాత గోపాలునియర్థము ననుసరించుచున్నది.

స్పర్శలు:— స్పర్శ లనగా క మొదలు, మ వరకుగల అక్షరములు. ఇవి యుచ్చరించబడినపుడు నాలుకకు ఆయావర్ణోత్పత్తిస్థానములతో పూర్తియగు స్పర్శ కలుగును. తక్కినవర్ణము లుచ్చరింపబడినపుడు మాత్ర మింత గాఢస్పర్శ యుండదుగాన నీవర్ణములకు స్పర్శలని పేరువచ్చినది.

అంతస్థలు:— అంతస్థ లనగా య, ర, ల, వ యనువక్షరములు. "స్పర్శోష్మణా మంతర్మధ్యే తిష్ఠంతీ త్యంతస్థాః ఇ త్యుచ్యంతే" అని సామాన్యముగా వ్యాఖ్యాతలు చెప్పియున్నారు. మాతృకాపాఠములో అక్షరములవరుసయందు స్పర్శలకును, ఊష్మలకును మధ్య నున్న వని యర్థము. తైత్తిరీయప్రాతిశాఖ్యవ్యాఖ్యాత మాత్రము "జిహ్వామధ్యప్రభృతీనాం కరణానా మంతైర్జన్యత్వా దంతస్థా ఇ త్యాఖ్యాయంతే" అని చెప్పినాడు. నాలుక ఆయావర్ణోత్పత్తిస్థానములను స్పృశించినపుడు వర్ణములు పుట్టు నని చెప్పబడినదిగదా! అప్పుడా నాలుకయొక్క అంచులు ఆస్థానములను కొంచెము స్పృశించినయెడల యీయంతస్థలు పుట్టునని యర్థము. ఈయభిప్రాయము రేఫలకారములవిషయములో మాత్రము సరిగా నున్నది. పాశ్చాత్యవిమర్శకులుగూడ రేఫ, లకారము లుచ్చరించబడినపుడు నాలుక కొంచెము కంపించు నని వ్రాసియున్నారు.

మరియు నీయక్షరములను అంతస్థ లనుటకు మరియొకకారణముగూడ గన్పట్టుచున్నది. అచ్చులను, ఊష్మలను, ఉచ్చరించునపుడు జిహ్వాద్యవయవములు మిక్కిలి దూరముగా నుండును. స్పర్శ లుచ్చరించినపుడు మిక్కిలి దగ్గరగా నొకదాని నొకటి స్పృశించును. అంతస్థ లుచ్చరించునపుడుమాత్రము మొదటివానివలె మిక్కిలి దూరముగాగాక, రెండవవానివలె మిక్కిలి దగ్గరగాగాక, జిహ్వాద్యవయవములు కలిసీకలియన ట్లుండును. ఈకారణమునగూడ య, ర, ల, వ లకు అంతస్థ లని పేరు వచ్చియుండును. అంతస్థ లనగా వర్ణోచ్చారణమునందు జిహ్వాద్యవయవములు మధ్యగా నున్నవని భావము.

ఊష్మలు:— ఊష్మ లనగా శ, ష, స, హ లు. "ఊష్మా వాయుః తత్ప్రధానా ఇత్యర్థః"; అనగా, వాయుపూరితములగు నక్షరము లని యర్థము. అని ప్రాతిశాఖ్యకర్తలు వ్యాఖ్యానము చేసియున్నారు. ఈ యర్థము అనుభవమునకుగూడ సరిగా నున్నది.

ఈవిధముగా ప్రాతిశాఖ్యకర్తలు తాము పెట్టిన పేర్లను అర్థవంతములుగా పెట్టినారు. పాణినిమాత్ర మట్లుగాక సులభముగా సూత్రములయందు వ్యవహరించుటకై చిన్నచిన్న పేర్లను సృష్టించినాడు. ఈ పాణినీయ సూత్రములయొక్కయు, ప్రాతిశాఖ్య యొక్కయు సహాయమున వేదార్థనిర్ణయము జరిగి జ్ఞానోపదేశము చేయబడుచున్నది.

---

# నరకమును తొంగిచూచుటకైన నాక మియ్యకొనునా?

జొన్నలగడ్డ సత్యనారాయణమూర్తి

అనంతవిశ్వమున నెందో యుదయించిన ఆలోకము — చంద్రికాసముద్భవ మనుడు, రవిహృదయ సంజనిత మనుడు — సర్వ దిక్కులందు ప్రసరించి, తన మహత్త్వమును ప్రకటించుకొన నువ్విళ్లూరునట్లు కళోపాసకునియెడఁదను ఉదయాద్రి గావించుకొని, అందుండి మరీచిగుచ్ఛమును దశదిశల బ్రసరింపజేయ బ్రతిభ బహుధా ప్రయత్నించును. చలనము దీనికి నైసర్గికమైనది. ప్రాణముయొక్క ప్రధానగుణము చలనమే! చలనము క్రమపరివర్తనమునకు, తేజఃపూరితమైన పరిణామమునకు దగ్గఱిచుట్టము. ఈ గానముల నెఱుగనిది కళయే కానేరదు. ఈ గానముల నెఱుగనిసాహితి కాటికి కాళ్లు చాపుకొనవలసినదే! మహితసంప్రదాయము నారాధించుట దొడ్డపనియేకాని, యీ వ్రతమందే అశ్రాంతము నిమగ్నుడై ముంకంజవేయనిలువని ఉపాసకుడు ప్రస్తుత కాలమున పనికిమాలినవాడై, భావికాలమున కొఱగానివాడై యుండును. ఈతని రచనలు కళావైచిత్రికి దూరస్థములై, శిల్ప వైభవమునకు శత్రువులై త్రుప్పుపట్టిన ప్రయోగములను తలదాల్చి కర్కశశిలలకు సహపాఠులైన శబ్దములను మూపునగొని జిజ్ఞాసువులకు అడలును, అసహ్యమును గొలుపును.

వడిగల నడకయే మానసమునకు నైసర్గికము కావున సత్వరపఠనమందే శీఘ్రపరిశీలనమందే అవలీలగ నిది విషయమును గ్రహించును. నిలిచి నిలిచి ప్రత్యక్షరమును పరీక్షించుటకుగాని, బరువైన శబ్దపరంపరపై విడియుటకుగాని ఇది సమ్మతింపదు. స్వతస్సిద్ధగుణమునకు ప్రతికూలమైనక్రియ జేయుతఱి చిత్త మెంతేని బాధపడును. "అయ్యో!" అనుకొనుమానసము, ఆయాసపడుమానసము గ్రహింపగలుగున దెద్ది? జవోపేతముగ నడచునది కావున, దీనిదృష్టి నపేక్షించు జటిలవిషయ మెదుట నిలిచినను, దీనిని సరకుగొనక చరచర నది సాగిపోవుచునేయుండును. కావున దీనికిని, దానికిని ఎట్టిసంబంధము కలుగనేరదు. అవమానితుడైన అతిథివలె, మగనిమానసము, నాకర్షింపజాలని అభాగినివలె అది దూరమున బడియుండవలెను. మోటుమాటలు ప్రయోగించు అతిథియును, సమయోచితప్రవర్తన మెఱుగనిసతియును ఇట్టినిరాదరణమునకు తలయొగ్గవలెను. మనస్తత్త్వ మెఱుగక రచనము సాగించుకవి వీరికి సైదోడు. ఈతని వ్రాతలను చదువుట కీతడే యర్హుడుకాని ఒరులు కారు.

కాని శాస్త్రపరిజ్ఞానమున కెంతేని యోపికయును, నిలుకడయైన పఠనమును ఆవశ్య

కములని చెప్పకతప్పదు. మానసికవ్యాయామమున కలవడినవాడే శాస్త్రాంశములను హృదయంగమ మొనరించుకొనగలడు. కళ వ్యాయామమును సహింపదు. సాహిత్యము లలితకళలలోనిదే కదా! మానసికవ్యాయామమునుగాని మానసగతిని నిముసనిముసము నిరోధించు అధికాక్షరసముదాయమును గాని జటిలసమాసస్పష్టినిగాని చూచి సాహిత్యము సహింపదు.

చక్కనైన తలంపు చంచలచందమున మానసదిశావలయమున తళ్కొత్తును. తటిత్తు నెవరైన నిముషపెట్టెయందు కట్టియుంచగలరా? భావవిద్యుత్తును కఠినశబ్దమున బంధింపగలవా డెవడు? సాహితి నుండవలసిన వ్యంగ్యము సౌందర్యమందును, చలనమందును, సౌదామినిబోలి యుండవలెనని వచింతును. భావవిద్యుతమును తళుకొత్తించుటే ఈతనికర్జము కాని దానిని గుణించి దీర్ఘోపన్యాసమును, పెట్టీవ్యాఖ్యానమును గావించుట కాదు. విద్యుత్తువెనుక వందిమాగధు లుందురా? పొంత వినబడు పొగడ్త కెట్టిమూల్యమైన గలదని నమ్మువారు మతిమాలినవారేసుడీ! మిలిమిలా ఊస ధోరణి సంతబజారునకు సరిపడునదికాని సాహిత్యసృష్టికి కాదు. పఠితకు వినోదమును గాక విసుగును దెచ్చు రచయిత కళాసామ్రాజ్యమున నిరూనమైన నిలువరాదు.

భావనాశక్తిని పురస్కరించుకొని స్వతంత్రదృష్టితో చివాలున దా నవలోకించుదృశ్యములనే పఠితమనశ్చక్షుస్స మక్షమున తళ్కొత్తించుట రచయితకర్తవ్యము. భావమున కనుకూలమైన అల్పాక్షరపదపంక్తియందే ఈతడు తనకర్తవ్యమును నెఱపుకొనును. ఇట్టియక్షరసముదాయమందే అలంకారప్రయోగ ముండును. ఇందే కవిచంద్రుని ప్రతిభ స్వీయచరితార్థత నవలోకించును. భావనాశక్తి నెఱుగని భక్తుడు పలుమాఱు రామనామము నుచ్చరించుటందును, వ్రాసిన అక్కరములనే వ్రాయుచు రామకోటిని వ్రాయుటందును సంతృప్తినందును. రాముని తలచినంతన నాంతరంగిక నేత్రము మోల వివిధదృశ్యములు తళ్కొత్తుట చూచిన కవికోకిల "ముముక్షుపాథేయం రామనామమ్" అనియు, "ధర్మద్రుమబీజం రామనామమ్" అనియు గీర్తించుచు శ్రోతలమానసములందు వానిని దళ్కొత్తించునుగదా!

కోయిల కెంత స్వాతంత్ర్యము లేదు? గట్టులుగాని పుట్టలుగాని దీనిరెక్కలకుగాని, పాటకుగాని అవరోధమును, అభ్యంతరమును గలిగింపజాలునా? ఛాందసులైన వైయాకరణులును, శ్రోత్రియులైన ఆలంకారికులును నిలువంబెట్టు జటిలనిరోధములు ప్రతిభావంతుల మనోగతిని నిలుపజాలునా?

బహుభాషావైచిత్ర్యములను స్వీయసాహిత్యాంగణమున బ్రవేశింపనిచ్చిన యాంగ్ల రచయితలు సమధికసాహితీవిశేషముల నెఱిగి దినదినము తమవాఙ్మయమునకు నూతన విధమును చేకూర్చుచుండిరి. పెక్కు దిక్కులనుండి బహుళవాఙ్మయములనుండి తా మందిన సంచితపరిజ్ఞానమును పురస్కరించుకొనియు, తమభాషాయోషకు గల పటుత్వమహత్త్వములను సంపూర్ణముగ గ్రహించియు, ఆత్మప్రతిభపైనవిచలితవిశ్వాసముంచియు, కాలస్రవంతి నోలలాడి చిత్తము వచ్చినతీఱున నపూర్వభావ పూరమును మనసార గ్రోలియు, సహజ స్వాతంత్ర్యము

కతన నిరుపమాన ధైర్యసాహసములను ప్రకటించియు, వీరు చిత్రవిచిత్రములైన రచనావిధానములను, శైలిభంగిమములను, శయ్యావిభవములను శతాబ్దులనుండి సృష్టించుచున్నారు. విశేషముగ వీరు రూపకమును వలచిరి. మోహినివలె నిముసమున కొక్రొత్త రూపు నందుచు, నొకవింత ఠక్కిని నడచుచు రూపకము వీరిరచనములందు స్వర్గసౌందర్యమును ప్రకాశింపజేయుచుండును. ఒక్కొక వాక్కులోని భావవిద్యుల్లతను విలోకించి "ఆహా!" అని ఆశ్చర్యాన్వితుల మయ్యెదము; అణువుంబోలు అక్షరమందే భాసమాన భావబ్రహ్మాండము తళ్కొత్తుట గాంచి ఆంతరంగికముగ సాగిలపడెదము.

ఆంగ్లరచయితలు దృష్టాంతముల నాదరించిరి కావున వంగరచయితలు అల్పసమయమున తమ వాఙ్మయమునకు అనల్పమైన ప్రాభవము నొనగూర్చిరి. ఈ యంశమును రూఢిచేయుట కాంగ్లవంగ సాహిత్యములనుండి బహుళ దృష్టాంతములను పేర్కొనగలను.

పదప్రయోగమందును, అలంకారసృష్టియందును కవీంద్రుడు రవీంద్రు డెట్టి స్వాతంత్ర్యమును గైకొనునో (ఆంగ్ల)పఠితలు గ్రహించియేయుందురు. జటిలములైన నిబంధనములనుతాను తునిమి తూటాడిన యుదంతమును రవీంద్రుడే తెలుపుకొనుచుండును. క్లిష్టచ్ఛందోనియమములనే కాదు కటువైన వచనరచనావిధులను గూడ ఛేదించి, కొంతకాలము తోడిదేశీయుల కిన్కకు గుఱియైనను, ఉజ్జ్వలమైన తన ప్రతిభ నిర్దేశించిన చొప్పున నీతడు లేఖని నడపినాడు. ఈతని మానస మనంత భువనములందు విహరింప నేర్చినది.

రూపుచూపని తలపునకు సాహితిలో తావు లేదుకదా! ఇట్టి తలపు అవలీలగ నవగాహము కాదుకదా! కవి ప్రేమికుబోలువాడు. ఎదుటియెడంద జొచ్చి, అందు చిరపీతము నవలోకించుట వీని యాశయము. అవగాహనమార్గమందే ఈ పయనము సుసాధమగును. కావున పాఠకునకు తాను పరిచితు డగుటకును తనవాక్కును వానిమనసున సునాయాసముగ బ్రవేశపెట్టుటకును ఈతడు శతధా యత్నించును. రూపరహిత భావమునకు రూపునిచ్చుట వీని యత్నములలో ప్రధానమైనది. వీనిసృష్టిశక్తి వీని భావనయందే కలదు. దీనిని పురస్కరించుకొని ఈతడు సుందరమూర్తులను సృజించి చదువరుల మానసనేత్రములమ్రోల నిలుపును. ఇట్టి శిల్పమున విశేషముగ భేదోడగునది ఉపమసుడీ! రూపరహిత భావమును రూపసహితవస్తువుతో పోల్చిన ముహూర్తమున నిట్టిశిల్పవైచిత్రి నివ్వటిలును. ఈ కౌశలమున అధునాతన వసుంధరలో రవీంద్రు డద్వితీయుడు. ఈ యంశమును రూఢిపఱచు దృష్టాంతము లెన్నో పూర్వోక్తము లైన రవివచనములందు గాననగును. స్వప్నావస్థనుండి జాగ్రదవస్థ జొచ్చుమానసమును కాసారగర్భమునుండి సలిలముగుండా అల్లన నవ్వల దలసూపు పంకజమునకు రవీంద్రుడు పోల్చినాడు. ఈ యుపమ నుపలక్షించినంతన మనోనేత్రముమ్రోల నెట్టిమనోహరదృశ్యము వెలయునో చదువరులే యెఱుంగుదురు.

నవయుగసాహిత్యాచార్యులలో నగ్ర గణ్యుడైన రవీంద్రుడు మహత్తరప్రాచీ ఋషి. సంప్రదాయమును మన్నించిన కవీంద్రుడై, ప్రాచీన ప్రస్తుత భావతరంగిణులను స్వీయ హృదంతరాళమున గలయనిచ్చి తన రచన ములందు వాని సంయుక్తపూరమును ప్రవింప జేయుటచే నవి యపూర్వసౌందర్య ప్రాభ వము నంది, అఖిలదిశలదృష్టి నాకర్షించినవి. ఋషి. యనినంతన ధ్యానము, తపము, తన్మ యత్వము, అంతర్దృష్టి, మహిమోపేతచరిత్ర మున్నగు నంశములు మనసున దోచును. ఋషి. కవి పరమహంస. వీనిమానసము భావో ద్వేగమునకు వశమైనపుడే ఈత డాత్మ విస్మృతు డగును. ఈతనిరసన యపు డీశ్వర ప్రేరితమై గంభీరవచనముల నుచ్చరించును. ఇవి ఈశ్వరవాక్కు లనిన నను. తన్మ యత్వము తరలినంతన తనమాటల నెఱిగి ఈత డాశ్చర్యాన్వితు డగుచుండును; తనను నిమిత్తమాత్రుని జేసికొనిన జగదీశునకు జోహారనును. ఈశ్వరవాక్కును తన కట్టు బాట్లచే నెదరొ్కనదలపడు దుండగీ డెవడు?

శతాబ్దులనాటి కట్టుబాట్ల నిలువేలుపు లొనరించుకొనిన రచయిత లెందువసింతురో, అం దెన్నడైన దివ్యవాణి శ్రుతిగోచరము కాజాలునా ?

విజ్ఞానమందును, స్వాతంత్ర్యమందును, సహజసామర్థ్యమందును, ధృతిసాహసము లందును దరిద్రులై యుండువారే బానిసదన మునకును, అలసభావమునకును, అడలు నకును, వడకునకును నిధానములై యుందు రు. వీరు వసించుతావునకు బహుయోజన ముల దూరమందే సాహిత్యలక్ష్మి విడియును. నరకమును తొంగిచూచుటకైన నాక మియ్య కొనునా ?



# 'షాజీ'[1]

కపిస్థలం శ్రీరంగాచారి

'పూవు పూచినయది; క్రొత్తితావి
దిశల నల్లుకొన్నది.'

౧

ఇది 'పదములపసందు మధురభావములపొందు పందెములు వైచుకొని కూడబారినట్టి' శైలిలో, 'తలపు నలిపెట్టు చాపల్యములను వదలి, జీవమయమైన రస ముపానించినట్టి' నవ్యఖండకావ్యము; పద్యకథానిక.

౨

'పూవులు విడిల్చు మల్లెలపొదలనీడ'లో 'జిలుగు చెక్కులు ప్రతిఫలించిన మనోజ్ఞ చంద్రకాంతశిలావేది' మీద 'ఏకాంతవివశయగుచు' విశ్రమించినది 'మొగలు బిబ్బీలరాణి' — నూర్జహాను. ఆమె దయనేయు ఒక్క వాక్యమే జహాంగీరుపాలిటి మంత్రదండము. ఆమెకు

'తల దిరుగఁజేయు రాజ్యతంత్రములయందు
ఇంత నిట్టూర్పుగాని రేకెత్తలేదు;
శత్రువులు హుంకరించిన సమయమందు
ఎదను దిగులన్నయది జనియింపలేదు'.

'ఉల్లిపొరలకు మేల్మిదైయున్న సన్నమాలి వాజారు నగిషీల మేలిముసుగు'ను 'అలకలపైకి నొత్తుకొనుచు', 'అప్పుడప్పుడు మేఘాల కప్పగనుచు', 'క్రీగంటనేమొ యోచించుచున్న' దామె.

'ఆమె చూచుటలేదు సంధ్యాకుమారి
యూరబరచిన చెంగావిచీరసొబగు;
ప్రక్కలో బుల్కు ఎలనవ్వపసలిరంపి
తప్పరముగాని కర్ణరంధ్రముల చొరదు'.

ఏమో !—

'అధికవిభవాకరమ్మౌ సింహాసనంబు
తనకు లోబడ్డ దనెడుసంతసమెగాని—
కోరచూపుల రాజ్యలక్ష్ములు ప్రచండ
షాజహానుకు కైసేసె స్వాగతమ్ము'.

కాబట్టి రాణి

'ఇంట పెనిమిటిపై చలాయించుస్వాధి
కారముద్రయె సాహాయ్యకంబుగాగ
తలచుచున్నది యువరాజుతలను వెలుగు
కెమలిపురిమ తైములను చిందించుకొరకు'.

ఆకలపులా లీనమయిపోయి, బహ్యాలోకమును మరచి, జీవకళలు స్రవించు చెక్కుటద్దములమీద చేయి జేర్చి, కనుబొమలలో భావాలు గూర్చి, అట్లే నిలిచిపోయినది.

ఆతోటలో ఆపూలదారిలో, కనులు మిరుమిట్లు గొలుపు నఖండరోచియొకటి మలగిపోయినది.

కారణము ?—

"అదిగదిగో వచ్చుచున్నవాడాలకింపు
డానవనికాపచమకితోద్యానభూమి
మదిని సదిగొన్నదప్పికి మందులేక
సగభసంబుగ నొక్కగోసాయిబిడ్డ'.—

షాజీతపస్వి చూచినాడొకసారి 'మాత్న సుధలు పొంగి పైకి పారు మహారాజ్ఞి వదనబింబము'; చూచి, కన్నులట్లే మూసి, కరాలు జోడించినాడు. అప్పుడతనికి తానెవరో, చూచుచున్న దెవరినో, వసించు పట్టు లెట్టిదో యనెడువివక్ష లేదు; తలచుచున్నవి రెండే — జీవితమయుడు, సౌందర్యసృష్టి.

1. కవి : పుట్టపర్తి నారాయణాచార్యులు —కవితాపోషకసమితి.

'తరుణ చరణోద్భవమైన తానరవ'మో, 'చంద్రికామయవిభు పరిస్పర్శన'మో ఏదియో మేలుకొల్పిన దామెను. 'చురుకు కెగిలిన క్రోల్పులి'వలె లేచి, ఆమె రాలుపడుమాట నేమో పల్కబోయి — మనసులో పాడుకొన్న భావతీవ్రతచేతనో, చునిరుచులు తనయెడ దను వచ్చినందుచేతనో — పరవశాత్మతతో అంగములు మరచి నిలిచినది. మరల ఏమి తోచినదోకాని — ఆమెనోటినుండి 'పట్టుకు, పట్టుకు' అను 'వేడిపలుకులు' వెడలుటయేతడవుగా పారాజవానులు పట్టుకొన్నారు సాకీని.

'కలతబడి, క్రొత్తక్రొత్త వికారములకు
తావలంబగు తాను డెందంబుతోడ,
మారువలుకక, ఆవేశమాంద్య యగుచు
వంతిపురి చేరుకొని మార్గహీనురాణి.

'అధిక తేజస్సుతోడ, బ్రహ్మాండనులకు
కనులు వెలిగించు పడమటికావిరంగు
నా వినూతన విభవ గర్వాంధకార
కటికరాయి మ్రింగి తేల్చెను కాళరాత్రి'......

తెలతెలవారుచున్నది:
'రాచవారింట బలువగారాలమోత
ప్రతినదంబిచ్చె ప్రకృతిగర్భంబునందు
ఉలికిపడి లేచె కన్నులు నలిమికొనుచు
పూలతో పాటిదిక్కు పూబోండ్లగములు'.

'ప్రేమకళ లంతరించిన బీళ్లయందు చల్లగా పారు సెలయేటిచాలువోలె, పాపములు రేగియూకు ప్రపంచమందు'

'నడచుచున్నాడు నల్ల జెండాలనీడ
సృష్టిసౌందర్యశీవి సాకీతపస్వి'.

వారు లీదృశ్యమును చూడలేకున్నారు. ఏమి యీ అత్యాచారము! ఖైదు! సామాన్యుడా? —

'రండు రండోయి సోదరులార! మనము
పాడుకొందము భావనాపథములందు:
రాలు చెమరింప, విన్నజీవాలు వసక,
బుల్బులులు వీటి, రసబంధములను కూర్చి.

'నేలపై క్రుళ్లిపడెడు మేవాలకన్న,
తలను విసిగించు శాస్త్రవాదములకన్న,
అధిక సుఖదంబు రమ్యకళార్చనంబు;
కవులపండువు చూతురుగాక రండు.

'కత్తిరింపులులేని వికాసగరిమ
తీరియున్నట్టి పూలపందిళ్లలోను
అతిమనోహరవేదకన్యకలు గలరు.
రండు రండోయి ప్రకృతిసామ్రాజ్యమునకు.

'శాంతి గురిసెడు మాదు ఆశ్రమములందు
దైవమే తాండవించు నిత్యంబుసుమ్ము;
అస్ఖలితమైన జ్యోతిర్మయస్వరూపి
మాతృదేవత కడగంట మనుమ్మ జూచు.

'చెలువచేనవ్వు ప్రతిఫలించిన మనోజ్ఞ
నవ్యమధుర 'జంషీదు'పానములకన్న
ప్రకృతిదేవత మాయింటిపడుచు పాడు
పరసగీతాలె సొగయింపజాలు మిమ్ము.

'పులకరించిన తంగేడుపొదలనడుమ
ప్రణయభావ్యము ల్దోసిట బట్టి, భక్తి
పరవశంబగు తనువుతో ప్రకృతిదేవి
పాదముల కుప్పగూర్తు మవ్యాజరీతి.

'వెచ్చటూరు పెరుంగనివెలది, మిగుల
జాణ పలుకుల, చిలుకసంసారి పడుచు,
చివురుతలుపుల నోరగా చిలుకరించు
స్వాగతసువర్ణశీకరచయము తలల.

'ప్రకృతి గమనించి, అపరాత్పరుని జూచి,
భావముగ్ధులై, ఆవేశభావ్యములను
మోదుప్పగనుల 'హాఫీజు' వాపోయినట్టి
గీతముల పాడుకొను విహంగీగణంబు.

'తత్త్వమూహించి, నిస్సారతను దలంచి,
'సాకి' కన్నులలో ప్రపంచంబు నెంచి,
ఆలపించు 'ఖయామ్ము' ఖయాలుమాట
లింకిపోలేదు నేను మాయింటికడప.

'ఆనిరాదరణంపు 'గక్నీని' నమ్మి,
జీవములనెల్ల నొలకబోసిన అభాగ్య

'తపసి 'ఫిరదౌసి'తక్క వా తటములందు
కనులలో చెమ్మనిడు జీవకణిక లేదు '

అన్న అమృతవాక్కులను అలత సుంతైనను లేక భయము లేక, వినెడువా రెల్లరును వీవగించినను పోక, వీథివీథులను స్వాతంత్ర్యవీణె మీటి, దివము రాత్రియు ఏకరీతిగ పలించుచుండిన శాశ్వత సౌందర్యోపాసకుడు, పరిణత ప్రణయతత్త్వ వేదికదా అతడు! అతనికా జరుగనున్న శిరచ్ఛేదనము ? — అవును ; వారు లేమి చేయుగలరు పాపము !

'ఉదికి వచ్చెదు వేడినిట్టూర్పుతోడ
బాష్పజలముల నందించువా రెగాని,
యమునికైనను గుండియ లవియజేయు
మొగలురాజాజ్ఞ కెదురాడుమగ డెవండు ?'

విషము పూసిన రంపులవిషనక్ర – రాజ్యమే లెడు పారశీరాణిగారు ముందుగా కూర్చున్నారు తెర వెనుక-లేని యాజ్ఞల నరయుటకు కవులు పండితులు శాస్త్ర కర్తలు సచివులు విమర్శకులు గాయకులు 'ఖురాను' వల్లెవేసిన మౌల్వీలు — అందరును బారులు దీరి కూర్చున్నారు పాదుషాకొలువులో. 'రాజపుత్త్రులు మగరాలు దాపి, కుంచెవిప్పిన బంగారు గొడుగునీడ'లో 'పూవుబోడులు వాలుచూపులను జూడ, హాయి తోలంకాడ కూరుచున్నాడు' జహంగీరు.

అతడు 'రాజ్యలక్ష్మినించిన తల్ప్రాలమిసిమి వెలిసిపోవని మొగలాయి పెండ్లికొడుకు.' 'తనవలపులెల్ల సౌఖ్య వితానమయిన రమ్యసౌందర్యపూజ కర్పణముచేసిన' భక్తుడు. 'ఈదినము నీవు త్రావినదే నిజము: పాత్ర గొను'మన్న బోధనయే జీవితపరమార్థమని నమ్మిన రసైకజీవి. అతడు 'అమృతమయమైన నూర్జహాను మోగమును, జీవరసమైన నవ్య 'జంషీదు' పాత్రను, ఆ 'అబుల్బు' లద్భుతానందగీతిని కలలలోనైనను మరచినది లేదు. అతడు 'వాఙ్మయపింఛపింఛికలు త్రిప్పి భావవీథుల'లో 'వేయిభంగులు'గా 'మాయములు పన్ను కవులపై మణులు గుప్పి'యు, 'తనవలపు రాణి క్రొత్తముత్యాలు గూర్చి, జిలుగుచేసిన పైడి' గంటములతో ఎన్నో 'అస్ఫుటప్రణయగీతికలను వ్రాసి'యు 'విశ్వసాహిత్య సేవ గావించినాడు'; 'దివ్యకళార్చన'మే 'ఈశ్వరోపాసన'యని యెంచి 'ప్రార్థనామందిరముల'లో, 'సభాస్థలాల'లో, 'అంతిపురముల'లో 'కనులు గోరగించెడు శిల్పము'లు గూర్చినాడు'; 'తత్త్వచింతకు మనసును తార్చి తార్చి, యెండిపోయిన తనచేరడేసికనుల'లో 'కాలువలుగట్టు లేతముత్యాలతో' 'తరుణగాయక మస్తము'లను 'తడిపినాడు'; 'అక్బరుమహామహుని పండుటాయు' వంతియు 'పణముగా గొన్న [యత్నంబు పట్టువిడక, విశ్వ మానవసౌభ్రాత్ర విజయధ్వజ్ఞ ఏడువారాశులందు మ్రోయించినాడు.'

అట్టి తనకు 'ఎన్నడులేని వృథావమాన'మును కలిగించిన సన్యాసిమొగము చూచినాడో లేదో — రసైకజీవికదా — కొలదియిడరాని కోపముతో ఒడలు మరచినాడు. 'తను పండకెంపు గాసినది; 'కనుల చీకటులు క్రమ్మినవి; మొగము 'జల్లసైపోయినది — తలపు కందని రూపమును దాల్చినాడు......'కరమునను బట్టియున్న హుక్కాను ద్రోసి, నోటి కందిన 'జంషీదు' పీటబుచ్చి, ఎర్రసెరలంటి పారుకన్నీటితోడ, తనదు హస్తంబు నోరపైపు దార్చినాడు. దానిలోనికత్తి తాను నూర్జహానును సాధించినప్పుడు కత్తులు బల్లెములు చేసినపనిని తలపించినది. అదే తడవుగా అతనికన్నుల ముందు ఒకరక్తార్ద్రశిరము — నూర్జహాను మొదటి పెనిమిటియైన షేర్ అఫ్ఘనుది — తనఘోరకథను చెప్పినది......రాజుమనసు మారిపోయినది. అత డాడదలచిన చటులవాక్యములుకూడ 'కలకళాభాసితాన'ముగా మారిపోయినవి :

'అనితరోపాధియై, జ్ఞానమునకు మూల
కందమై, పరమైన ఆనందమహిమ
ఒక్కకడగంటిచూపున కొక్కవెకలి
లేతనవ్వుకు కొల్లవెట్టితివి నీవు.

'ఎట్లు నడచెదవోయి, యోగీంద్ర! కఠిన
సాధ్యమైనట్టి మోక్షసంసారమందు?—
ఇంతలింతలు వలపుల కల్ల లోగి,
అడుగు గడుపని చపలచిత్తుడవు నీవు'

అన్న మాటలు సాజీతపస్వి మోమెత్తి 'అల్లనల్లన తులుకుచూపుల శాంతంబు తొలుకజార' 'జ్ఞానసర్వస్వ

మైనహాస్యముతో 'కొలువును కలయజూచి' తాంత ముగ తాను చేసినది నేరముకాదని వివరించి :

'పొదలచాటుపూవుల జూచి మురిసిపొమ్ము
కోసి తలలోన చెరివెదు కుమతిగాకు—
కోమలతమసౌందర్యార్చకుడవు గమ్ము,
సిగ్గుచెడి నా కటంచు నాసింపబోకు'

అని యతనికి నిష్కామమార్గమును బోధించి, పరిణత మైన ప్రణయానుభూతి యెట్టిదో తెలిపి, జ్ఞానభూము లను దిరుగు తనవంటివారిని 'డీలుపడజేయు వినుప చేడీలు లేవ'ని

'పోయివత్తును; జ్ఞాపక ముంచుకొమ్ము;
కలసికొందము ముక్తిభూములను మరల
పూలగుత్తులతో తల్పశాలు వోసి,
తలపు లిగురించు నవవసంతములయందు !'

అని పలికి సంకెళ్లవైపు చూడగా అవి పూవురేకులుగ మారెను.

'కొదమవవ్వులు రాజుకు కుత్తె కిచ్చి,
తనతెరువుబట్టి పోయె సదా శ్రేయోగి.'

'కళలు విడిచిన శూన్యముఖాలతోడ
కూరుచున్నారు జనములు కొలువునందు :
కార్చుచున్నాడు రాజు గద్గదికతోడ
కనులనిండుగ బాష్పముక్తాఫలాలు'.

3

'...చూచెనో లేదో సన్యాసిమొగము
ఎదురుగాలికి పడగెత్తి, ఎదిరి నిలిచి,
అట్టె బుసకొట్టు లేతమిన్నాగువోలె,
నాడి తలనెత్తి చెలరేగినాడు రాజు.

'ఎన్నియో వత్సరాలు సహించి, యుదుకు
బయల జెలిగ్రక్కు నగ్నిపర్వతమువోలె,
కోరమాపులతో, విషపారుకొన్న
నిప్పుకలతోడ కొలువు నిండించినాడు.

'పొంగివచ్చెడు నిట్టూర్పు పుటముపెట్టి
హృదయసారంబు నేల బారించినట్లు,
నిండి జోరబారు వేడి కన్నీటితోడ
తనదు సింహాసనమ్మును దడిపినాడు.

'తనకు నెన్నడులేని వృథావమాన
జనితకోపాగ్నిలో భటచ్ఛటలువోలె,
కటము లదరంగ కండలు కదలిపోవ
ఘోరమూర్తియై రదములు నూరికినాడు.

'తారస్థాయి జేర్చి, కరముపై జారవేయ,
తల్లడిలిపోవు వల్లకీతంత్రికోలె,
ఘనతరావేశనిహతిచే వణకిపోవు
అంగములతోడ నల్లతూగాడినాడు.

'కేరుకోపాన తను వెండకెంపు గాను,
కవిదయు వగపున కనులచీకటులు క్రమ్మ,
పాడము నెఱుగున జిల్లనై పోవ మొగము
తలపుకందని రూపంబు దాల్చినాడు......

'కరమునను బట్టియున్న హుక్కాను ద్రోసి
నోటి కందిన 'జంషీదు' వీటబుచ్చి,
ఎర్రసిర లంటి పారుకన్నీటితోడ,
తనదుహస్తంబు నోరవైపు దార్చినాడు'.

వీనిలో రౌద్రరసమును, దానిపరిణామమును ఎంత నేర్పుతో, ఎంత హృద్యముగా వర్ణింపబడియున్నవి చూడుడు. ఈకావ్యమున నాకు మరువరాని గొప్ప ఘట్టములు రెంటిలో ఇది యొకటి.

రెండవది: షాజహానుకు రాజ్యము రానీయ కుండుటకు చేయవలసిన కుట్రలనుగూర్చి, ఒంటరిగా తనతోటలో తలపోయుచున్నది నూర్జహాను. అదే లోక మైపోయినందువలన రాణికి మొగలుసామ్రాజ్య మందలి రాజ్యము లన్నియు కన్నులయెదుట వెలుగు చున్నవి. చీకటి పడుచున్నది. కాని, ఆమె కదలుట లేదు......కుట్రలు పన్నువారికిని, పన్నదలచినవారి కిని కారణమేలేక ఏమో భయమును, ఏమో దిగులును పుట్టును. నూర్జహాను కాస్థితి వచ్చినది: హృదయము లోని రక్తమంతయు — పిచికారుతో కొట్టినట్లు — గొప్పఒత్తిడితో, గొప్పవేగముతో ఆమె మెదడునకు పారినదో లేదో చెవులు గింగురు మనజొచ్చినవి. దానికితోడు కీచురాళ్ల కిచకిచలు చూపులలో

చీకటులు క్రమ్మసాగినవి. తల తిరుగుచున్నది. కన్నులయెదుట వెలుగుచుండిన రాజ్యములు — ఒక్కటొక్కటిగా బయటపడుచున్న చుక్కలతో కలిసి — స్పష్టమై, తిరుగదొడగినవి. ఈదృశ్యము కవి యెంత చక్కగా వర్ణించినాడు, చూడుడు:

'శ్రవణవీథుల నొక్క నీరంధ్రరవము
మ్రోగుచున్నది గజ్జెలమ్రోతవోలె:
సకలరాజ్యంబు లారహో జగతియందు
తిరుగుచున్నవి చుక్కలతీరు దోప'.

ఇట్టిపట్టులు తలపెట్టుటలో ఆమెధైర్యమును, సాహసమును క్రిందిగీతమున వర్ణింపబడినవి:

'ఎగసి పైబడు కాలంపు టేరులందు
ఆత్మనిశ్చయమే సహాయంబుగాగ
దుమికి, తలదన్ను తుంపురు ద్రోసికొంచు
బోవుచున్న దజ్ఞాతదీవులకు నామె'.

ఏరులా ఎగసి పైబడునట్టివి. తుంపురులలా తల దన్నునట్టివి. అట్టి ఏరులయందు దుమికి అట్టితుంపురులను త్రోసికొనుచు పోవుచున్న దని ఆమెసాహసమును సూచించినాడు. ఆత్మనిశ్చయమే తోడుగా పోవుచున్నదని ఆమెధైర్యమును సూచించినాడు. ఇంతకును, ఆపోవుట యెక్కడికి? తెలిసినచోటులకా? కాదు— అజ్ఞాతదీవులకు! ఇంక ఆమెధైర్యసాహసములను పాఠకుల యూహకు వదలి,

'ఈబుకుపరమాత్మనిశ్చయ మెక్కడైపు
మెక్కవోని మానవయత్న మెక్కడ్రక్క
ఎవ్వ రోడిన నేమి? శ్లాఘింపదగిన
దా మనోహరధీర దృశ్యంబె సుమ్మ'

అనుచున్నాడు కవి.

ఈ కావ్యములో మర్మమర్మమును అవ్యక్తమధురమును అయిన ధ్వన్యనుప్రాణితము లగు గీతములు అక్కడక్కడ కొన్నియున్నవి. అవి తమకు ముందు వెనకటి పట్టులమీద ఒకక్రొత్త వెలుగును చిలుకుచు ట్లుండును.

"ఈనభోవీథిపై నటియింతు రాణి
పై" యనుచు నెంచు చుక్కకన్నియకు దోచు
నా గభీరదిశాతరంగములయందు
పొంచియున్నట్టి కాలపు టంచువాడి".

వెండికళశాలు మెల్ల చుంబించు సూర్య
కరములను క్రొత్తవలపులు పరిమళించె
ఆ మహామ్మదుగోరిపై నల్లుకొనియె
ముసరుచీకటిలో నొక్క మొలకనవ్వు.'

'విషము నమృతంబు గలియ నావేశయంగు
గిరువురికి మధ్యగా తాండవించిపోయె
మోహనంబైన యొకసన్న మురళిపాట,
అతివమది తీల్చు నొక్క చిన్నారినవ్వు.

వెన్నెలలశేల పచ్చికబీళ్ల కెక్కి,
పాడిదికొనివచ్చు సంద్రపుపోటువోలె
ఎదిరివచ్చిన శక్తు లన్నిటిని మ్రింగి
ఆ పరాత్పరుతలపునాట్యంబు సాగె."

ఈ గీతములు చదివినప్పుడు నాభావములు కల తయేలేని కొలనినీటిలో ఒకచిన్న గులకరాతిని వేసి నప్పుడు, అది పడినచోటనే ఒకచిన్నయల స్పష్టముగా లేచి, పెద్దది కానుకాను అస్పష్టమై నీటిలోనే కలిసి పోవునట్లును, గుడిలో సంజచీకటిలో పెద్ద కంచు గంటను వాయించి యూపగా, ఆ ధ్వని సన్నగిల్లి,సన్నగిల్లి అవ్యక్తమై తుదకు వాయుతరంగములలో మరుగుపడు నట్లును ఉండును. కవిసృష్టికి అనుసృష్టి చేసికొనగల సహృదయులును, అనుభవరసికులును అనుపతికలకు ఇవి కవి యిచ్చు కానుకలు.

వేకువజామున, సముద్రతీరమున, అరుణోదయమునకు ముందు, తూర్పుదిక్కున తలుగు మార్పులను చూచువాడుకగలవా రీక్రిందిగీతపు సౌందర్యము ననుభవింపగలరు.

'అదిగదిగో కారుకొన్న మాయాంధకార
జలధిపై తేలె తూరుపుకులుకునవ్వు:
కాలగర్భంబు తీల్చి, యుద్గాథమహిమ
అరుణు డుదయించు మేటిచాయలును దోచె'.

ఎండకాలములో, సంజచీకటిలో, వేడిగాలులు మెల్లమెల్లగా వీచునప్పుడు:

'పొగరు హృదయంబు విడనాడి పోవ బోవ
ప్రేమయును శాంతమును మది పెరుగునట్లు,
ముదురు కెండలు గళితమై పోవ బోవ,
మెల్లనీడలు భువి నాక్రమించుచుండె.'

'ఒకగడియ తీరుబాటః నోచుకొననట్టి
సమయపురుషుని దీర్ఘనిశ్వాసమట్లు,
పిల్లవాయువు లల్లన వీచుచుండె
క్రాగిపోయిన జగతీయురంబునందు'

అని వాసు తెలియకయే నేను పాడుకోగలను.

ఈ క్రింది పద్యభాగములలో భావముల తీవ్రతకు దగిన రచనయొక్క నవ్యత యున్నది:

'ఆమొగలురాణి మానసోద్యానమందు
ఎట్టిమారుత మొలయునో ఎవ్వ డెఱుగు?'
'కానలుసాగెడు మాపుటంతఃపురమందు
పాడుపాటీవ భాగ్యపువ్వులు గలవు'
'చెలువ లేనవ్వు ప్రతిఫలించినమనోజ్ఞ
నవ్యమధుర 'జంషీదు' పానములు'
'సాకి' కన్నులలో ప్రపంచంబు నెంచి'
'గండునిప్పుల చెరలాడు సెండలు'
'ప్రాతగోరీల బండిన ప్రభుల తలల
గజ్జెకట్టిన కటికచీకటులు'
'నేలపై త్రుళ్లి పడెడు మేఘాలు'
'సివముగొని యాడు కాలంపుపీనులు'
'రాజ్యలక్ష్మి నించిన తల్ప్రాల మిసిమి
బలిసిపోవని మొగలాయి పెండ్లికొడుకు'
'వాఙ్మయపింఛపింఛకలు త్రిప్పి
భావవీథులలో వేయిథంగులు గను
మాయములు పన్ను కవులు'
'ఆక్బరుమహామహుని పండుటాయు వెల్ల
పణముగా గొన్న యత్నంబు'
'గళమునందలి నల్లపూసలవిధాన
కనులకు న్గట్టు సకలలోకాలు'
'యువరాజుతలను వెలుగు
సెమలిపురిము త్తెములను చిందించుకొరకు'
'తళతళలు చిందు క్రీగంటితారలంగు
పరుగిడెడు వేదమయపాదపంక్తి'
'కంటిపాపల దోచు లోకాలు దప్ప
పలుకుతో దెవ్వ రచట గన్పట్టలేదు'
'ప్రాతయింటికి పెండ్లితోరణము గట్టు'.

౪

'నెమలిసింహాసనం బెక్కి, నేల వాల్గు
చెరగులేలెడి ప్రణయోపశీవికొడుకు;
ఆ మనోహరజ్యోతిర్మయస్వరూపి
కూర్చు చెలి: ఇంక భూమి నేకొరువ పలికె?'

---

ఈ గీతమును చారిత్రదృష్టితో చదువువారికి అడుగున గీతగీచియున్న వాక్యము విపరీతముగా తోచగలదు. నూర్జహానును పెండ్లాడుటకుముందు షాజహాను నన్న జహాంగీరునకు ప్రాణ మన్నమాట నిజమే. కాని, క్రీ. శ. ౧౬౧౧ మొదలు నూర్జహానుమీది ప్రేమకును షాజహానుమీది ప్రేమకును మధ్య జిక్కి, మనోవ్యథ నను భవించినాడు జహాంగీరు. యథార్థ మిట్టిదై యుండ, "ఇంక భూమి నేకొరువ పలికె?" అన్నవాక్యము విపరీతముగ నుండదా?

నూర్జహానుచరిత్ర చదివినవారికి కవి యామెను 'ప్రజలపాలిటి పెరటిలోపల గులాబి; అవని, సర్వస్వ నిధి'; 'మహాతల్లి' అనుట ఆశ్చర్యము కలిగించవచ్చును. క్రిందిగీతమున సంబంధశుద్ధి చెడినది:

'ప్రణయతేజస్సు దిక్కుల పంచిపెట్టు
కనుల కనుపట్టు చెప్పడు కావిరంగు—
ఉబుసుపోకకు దక్క తా నోరను విడిచి,
కాలు గదుపనితల్లి యాఖడ్గవల్లి?

'జంషీదు'పాత్రను కలలలోకూడ మరువని జహాంగీరుకండ్లలో ఎర్రరంగే కనపడదా? షాజీని చూచి నప్పుడు రౌద్రరసమూర్తియైన జహాంగీరుకు కోపమేరా దనుట నమ్మదగినమాటయా? అతనిని చూచినదే 'తనదు హస్తంబు నోరపై పు దార్చిన జహాంగీరు ఉబుసుపోకకు దక్క ఒరనుండి కత్తి తీయకుండువాడా?

అడుగున గీతగీచిన ఈ క్రిందిపదములు సందర్భమునకు తగినట్లు అర్థముతో వాడబడలేదని తోచినది:

'ప్రణయబాష్పముల్......కుప్పగూర్తము'
'సముజ్జ్వల దగాధభావనావీథి'
'జాలు గొనియున్న శేగులాబీలనడుమ'
'పూవు పూచినయది, క్రొత్తతావి దిశల
నల్లుకొన్నది — చూచి యానందపడుదను
'ప్రేమ దాకినయంత పుష్పించి, ప్రణయ
రాగములు దీయు లే సితారాలు'
'జానబంగారులోలకు శ్లాఘలింప'
'చదురు లుమియెడు తీక్ష్ణ తేజస్సు'
'నిండి జారబారువేసి కన్నీటితోడ'

౫

కవిదృష్టిలో కాలము 'నివముగాని యాడు' మన్నది. దానిలోనున్న ప్రపంచములో 'పాపములు లేగి యాడు'చున్నవి. ఎక్కడ చూచినను 'విషమ భేదము'లే. ఈ వైషమ్యముల కారణమున లోకమున 'ప్రేమకళ లంతరించిన'వి. కాబట్టి, ప్రణయోజ్జీవన మవశ్యము. ఈకావ్యమున మూడు ప్రణయములు వర్ణించినాడు కవి.

నూర్జహానుది సాధారణమైన భౌతికప్రేమ; 'ఆగులాబీల పొదలలో, ఆసితారుపాటలలో, ఆరసార్ద్ర చుంబనములందు కలసిపోయెడు తనజీవకళికయని తల' పింపచేసినది.

జహాంగీరుదియు భౌతికప్రేమయే కాని ఉత్తమమైనది — 'లేగులాబీలనడుమ, చెలియ చెక్కిటిపై చెక్కు చేర్చి, కూర్చి, కలసి, విడిపోవు మేఘుంపు గముల జూచి పరవశేశాక పారవశ్యతను చెందు'చుండినను అతడు మెలసిపోయెడు ఒయ్యారిమెఱపునందు, జలదరించెడు వికల గర్జనములందు ఒక్కసౌందర్యమునే గొల్చియున్నవాడు. విశ్వసాహిత్యసేవ చేసినాడు; విశ్వమానవసౌభ్రాత్రము చాటినాడు. కాని అతనిప్రేమ 'స్వర్గపాంథుల హేమసోపాన'మును చూపలేదు.

షాజీది పరిణతమైన ప్రణయము.

'కఠినహృదయంబు గన్నీరు గార్చజేయ
విషములందు వెన్నెలతీవ విత్తిపోవు;
ప్రాతయింటికి పెండ్లితోరణముగట్టు
అతిమహత్తర మీప్రణయానుభూతి.

'తరళ మొకసారి తొలకరిమెఱుపుకన్న;
వాడి యొకసారి చిచ్చరపిడుగుకన్న
భార మొకసారి మేటిపర్వతముకన్న;
అతిమహత్తర మీప్రణయానుభూతి.

'కత్తిగట్టినవారికే కంట జూచు;
తన్నరుమువారికొరకె కైదండ యొసగు
తన్ను జంపెడువారికే తరిసి బ్రోచు
అతిమహత్తర మీప్రణయానుభూతి'

అని అనుభవమువలన తెలిసికొనిచ్చినది; 'ఆనంద రూపమై మోద మొసగు సాత్త్వికవ్యక్తి'ని కొలువ నిచ్చినది. జహాంగీరువంటి స్వర్గపాంథులకు హేమసోపానమును జూపుమార్గదర్శకుడు షాజీ.

నూర్జహానువంటి ప్రణయముతో ఆరంభించి, జహాంగీరువంటి స్వర్గపాంథుడై, షాజీవంటి మార్గదర్శకుని అనుగ్రహమువలన 'మనుజు డార్జించు ప్రణయ సమాధి' అని కవియభిప్రాయము.

లోకమున ప్రణయోజ్జీవనము చేయు నెల్లరకును కవి యాదేశ మిది:

'పొదలచాటుపూవుల జూచి మురిసిపొమ్ము
కోసి తలలోన జెరివెడుకుమతి గాకు—
కోమలతమసౌందర్యార్చకుడవు గమ్ము;
సిగ్గుచెడి, నా కటంచు నాసింపబోకు.'

౬

'షాజీ' ఉద్దేశము ఉన్నతము; వస్తువు గంభీరము; భావన నిశితము; రచన నవ్యము — రసవంతములగు ఉత్తరాంధ్ర పద్యకథానికలలో ఇది యొకటి.

ఇంత యుండియు, ఈకావ్యము రుచింపని సహృదయులకు కవిసమాధాన మిది:

'నవ్యతరమైన యొక్క గానస్రవంతి
కొకడు తలయూచు, మరియొక డోసరించు:
పిలచే దోషమా? లేక వినెడివారి
తప్పిదమ? కాదు — భావభేదము లెరుమ్ము'.

# సంక్రాంతి

కొండేపూడి సుబ్బారావు

ఎన్నియుగముల కోర్కె పండించుకొన్న
దీయపూర్వకళాలక్ష్మి! తెలుగుసిరులు
విరిసికొని నటించెడు సుధావీథిలోన
గలయజిమ్మెను మకరసంక్రాంతిమధువు.

నేటికిని భారతావని నిలిచి వెలిగి
జగతినంతట దివ్యతేజములు గురియ
నీకళాతపస్సులు తెల్గునేలలందె
పండఁబారిన వీనాటి పర్వవేళ.

మృదులసంక్రాంతి రంగవల్లీమనోజ్ఞ
రేఖలే పూయు వెన్నెలరేకులందు
పరిమళించుచున్నవి ప్రేమబంధురములు;
ఉదితసౌందర్య పుష్యమాసోత్సవములు.

కవికలమ్మున కావ్యముగా కరంగు
ప్రకృతిచిరునవ్వుతళుకులో, పసిడికలల
మురువులో అందచందాల విరియు నేమొ
జగతి నెల్లెడ సంక్రాంతి సౌరభముగ.

ఈమధూదయమున కుసుమించి దెసల
తీగసాగిన తొలిసంజతీపిపాట
హృదయమున మ్రోయుచున్నది హృద్యమైన
తరుణహేమంతమధురగీతమ్ము లెత్తి.

ఇట నటించుకొన్నవి, ఎద నిముడలేని
తేనెరాగాల వలపులెన్నేని; మంచు
జాలున మెఱయు లేగులాబీలరేకు
కొనలమలయు చల్లని గాలిగుసగుస లెవో.

మబ్బుతునకైన లేని హేమంతగగన
తలమునందలి తెలిసీలిహారల జీల్చి,
దూసికొనువచ్చు సాంధ్యసిందూరలతిక
వసుధ సంక్రాంతి కొకవింత వన్నెలీను.

ముక్కుపచ్చలారని పసిముద్దియలును,
తలపులెఱుగని లేకన్నియలును నలుపు
కలికినునుసిగ్గు గొబ్బిసింగారములను
పచ్చివలపువాసనలు పైపైకి పొంగు.

ఇన్నిసౌందర్యముల హసియించుచున్న
కాంతివైభవాక్రాంత సంక్రాంతి కాంత
నీకళాలక్ష్మి నిచట వర్ణింతునేని
చాల విప్పడు కోటిపద్యాలుకూడ.

పుడమిపై తీయదనముల పూతబెట్టు
నింతనంతన మెద గదియింపలేను;
క్రమకళ్యాణవార్ధి పొంగెత్తి వచ్చు
నీసుఖస్వప్నభరము వహింపలేను.

ఈయపూర్వ చిత్రమును వీక్షించుకొలది
ఏయనూహ్య మాధురియొ స్ఫురించుగాని
అసలె సాగదు కలము పద్యమ్ము వ్రాయ
భావములనె తెలుపలేని భయమువలన.

— "కావ్యాంజలి"నుండి.

# ప్రమద్వర



ఆచంట జానకిరామ్

[ శ్రీమదాంధ్రమహాభారతంలోని ప్రమద్వరవృత్తాంతాన్ని అనుసరించిన యీ నాటికను ఇటీవల ఆల్ యిండియా రేడియో మద్రాస్ కేంద్రమువారు ప్రదర్శించారు.—భా సం.]

పాత్రలు

రురువు — మునికుమారుడు.

ప్రమద్వర — మేనకకూతురు; రురుని ప్రియురాలు.

కుముదిని — మునికన్య ; రురుని ప్రేమించినది.

మొదటి రంగము

(మునిపల్లె. రురువు పువ్వులు సేకరించడానికి వెళుతూ వుంటాడు. వెనకనే కుముదిని పరుగెత్తుకుంటూ వస్తుంది.)

కుముదిని — (దూరాన్నుంచి) రురూ !... ...రురూ!......రురూ! చూడు పిలచినా పలకడు.........ఓయి! రురూ ! (ప్రవేశము)

రురు — ఎవరది ... నువ్వా ... కుముదూ ! ...ఏం యింత రొజుకుంటూ వచ్చావేం ?

కుముదిని — (ఆయాసంతో) అబ్బ ! ఎల్లా పరిగెత్తించావోయి. ఏం, ఎంత పిలచినా వినబడలేదూ ?

రురు — కుముదినీ! క్షమించు. నీ పిలుపు వినిపించలేదు.

కుముదిని — వినిపించలేదు. పాపము! ఎందుకు వినిపిస్తుందీ ? నే నేమి సాక్షాత్తు మేనకకూతుర్నా, గంధర్వుని గాదిలి బిడ్డనా? నా పిలుపు యెందుకు వినబడుతుందీ ?

రురు — నిజంగా వినబడలే, కుముదూ! నేను యేదో ఆలోచిస్తూ పువ్వులు కోస్తున్నాను.

కుముదిని — ఏం ఆలోచిస్తూ ?— అన్నట్టు — ఎవర్ని గురించి ఆలోచిస్తూ ?—

రురు — సరేకాని, ఏం అంత తొందరగా వచ్చావు?—

కుముదిని — అదుగో - ఆమాలతీ పొదదగ్గర కూచుందాము రా— చెపుతాను.

రురు — ఇక్కడ చెప్పరాదూ ?

కుము — ఏం ? అక్కడకు రారాదూ? ఇంతట్లోకి నిన్నెవరూ చూడరులే.

రురు — అందుకు కాదు; ఎవరు చూస్తే నేంకాని, పూజకు వేళైంది. వెళ్లాలి.

కుము — పోనీ, అంత తొందరైతే - మరో మారూ...

రురు — ఇంతలోకే కోపమా!...సరే పద.

(ఇద్దరూ పొదరిల్లు చేరుతారు.)

రురు — ఆఁ. యిప్పుడు చెప్పు.

కుము — రురూ! చెప్పనా ... చెప్పనా మరేఁ— ప్రమద్వర నేనూ ఈ ఉదయాన్నే తామరకొలనులో స్నానం చేస్తున్నాము. హంసలు మాచుట్టూ మూగాయి. నేను పట్టుకోబోతే దొరకలేదు. కాని వాటి అంతట అవే ప్రమద్వర చేతుల్లోకి వచ్చాయి ... ప్రమద్వరంటే హంసలకుకూడా అంత యిష్టమా? ......అప్పుడు నేను ప్రమద్వరతో అన్నాను: "ప్రమద్వరా! నీ అందం యెక్కువా నా అందం యెక్కువా" అని. ... ఇంకా లోతుకు వెళ్లి నీళ్లలో చూచుకున్నాము మా ప్రతిబింబాల్ని. ప్రమద్వర అందీ "కుముదినీ! నీవే అందంగా వున్నావో" అని. "నిజమే? మేనకకూతురికంటె నేనే అందంగా వున్నానా. గంధర్వుల అమ్మాయి యెక్కడ! నే నెక్కడ!" అనుకున్నాను నేను. ఇంతట్లోకి మా యిద్దరివెనుక నువ్వు నుంచుని నవ్వుతూవున్నట్టు అనిపించింది నాకు. తిరిగి చూస్తినికదా: ఉదయిస్తూవున్న సూర్యునిముందటకూడా కాంతి తగ్గని చంద్రబింబము — నువ్వని భ్రమించాను!

అప్పుడు తోచింది నాకు నిన్ను కలుసుకుకనుక్కోవాలని. "నేను అందంగా వున్నానా? ఆ...ఆ...ప్రమద్వర అందంగా వుందా"అని. — కొలను విడచి, దబ్బున బట్టలు మార్చుకొని వొక్కపరుగున వచ్చాను.—

రురు — ప్రమద్వర?

కుము — ప్రమద్వరా? ఆమె స్నానం చేస్తూనేవుంది...ఏం? ఆ విడను యెవరైనా యెత్తుకుపోతారా?

రురు — అది కాదు - మీ రిద్దరూ కలసి వెళ్లా రన్నావు—

కుము — కాబట్టి కలసి రావాలి. నిజమే... కాని, నేను ఆగలేకపోయాను...నిన్ను కలసికొని, యిల్లా నా చేతిలో నీచేయి వుంచుకొని — నీవల్ల తెలుసుకోవాలని తొందర ఆపుకోలేకపోయాను!

రురు — కుముదినీ! ఇంతట్లోకి యేం మునిగిపోయింది! ఇం కొకఅడుగైతే అందరము యెల్లాగా కలుసుకుని వుందుముగా.—

కుము — ఇప్పుడుమాత్ర మేమి? చెప్పరాదూ?

రురు — ఏం చెప్పను?

కుము — రురూ!

రురు — అన్ని హంసలతో ఆడుకొన్నామన్నావుకదా - కుముదూ! అందులో ఏహంస నడకతీరు యెక్కువ బాగున్నదో చెప్పగలవూ?...ఈ పొదరింట యిన్ని పువ్వు లున్నాయి. ఇందులో వొక్కపువ్వు తీసి తతిమ్మావాటికంటె యిది బాగుంది అనగలవూ?

కుము — ఆఁ! ఈ వేదాంతాల కేం...... మనుష్యులలో అల్లా కాదు. ఆఖరుకు అప్సరసలలోకూడా ఎక్కువ తక్కువలున్నాయి.

రురు — ఆభేదాలు బాహ్యేంద్రియాలకు మాత్రమే.

కుము — అబ్బబ్బ! ఎప్పుడూ వేదాంతమే. బాహ్యేంద్రియాలూ, పంచేంద్రియాలూ. —అసలు సంగతి చెపుదూ.

రురు — కుముదూ! చెప్పనా, సాధారణపు కళ్ళకు నీ అంగం గొప్ప అందము. నీదేహకాంతి కళ్ళను మిరుమిట్లుగొలుపుతుంది. విశాలమైన నీఫాలభాగాన్ని చూస్తే ఆ మెదడులో యెన్నెన్నో వింత ప్రవాహాలు వున్నాయి అనిపిస్తుంది. తీర్చి దిద్దిన ఆ కనుబొమలు చూస్తూవుంటే బ్రహ్మ చిత్రకారుడేసుమా అనిపిస్తుంది. ... మెరసిపోతూవున్న నీకళ్లు ఉత్సాహం, ఉద్రేకం, క్రొత్తక్రొత్త అనుభవాలు ఆతురత యిల్లాంటి వెయ్యి భావాలతో నిమిష నిమిషం మారిపోతూ వుంటాయి. నిన్ను చూస్తే యీ జీవితం లోనూ, యీ ప్రపంచకం లోనూ ఉత్సాహం వెయ్యింత లవుతుంది.

కుము — నిజంగా! నిజంగానా రురూ? నీకళ్లకి నేను అందకత్తెనేనా?...నా అందం నీలో చలనం కలుగజేస్తుందా? ప్రమద్వర కంటెనా?

రురు — కుముదినీ! యేమన్నావు? చలనమా! ప్రమద్వరకంటెనా? ఎందుకీ ప్రశ్నలు?......ఇదుగో చూడు. మన పనిమీద మనం వెళ్లాలి. — ప్రొద్దెక్కుతోంది.

కుము — చెప్పవు? చెప్పవూ? నేను ప్రమద్వరకంటె యెక్కువ అందకత్తెనా?

రురు — ఇందాకే అన్నాను — బాహ్యేంద్రియాలకు అని.—

కుము!— అబ్బ! మళ్లా వేదాంతం. నిజం చెప్పరాదూ?

రురు — చెపుతా. కుముదూ! చెపుతా. నీవు అందకత్తెవు - అవును ప్రమద్వర కంటె రూపసివి కాని—

(పిలుపు: మునికుమారులు — రురూ! రురూ!)

అదిగో—మునిబాలురు పిలుస్తున్నారు.

కుము — ప్రమద్వరకంటెరూపసిని. కాని -

రురు — కాని, ఆమెలో వొక అలౌకికమైన అసాధారణమైన అందం వుంది. అది మిక్కిలి సాత్వికమైన సౌందర్యం...మన శ్శాంతి నిచ్చేమార్దవము ... ఆమెలో వెన్నెలలు వెద చల్లే విలాసము ... చేతులు జోడింపజేసే వొకవింతశక్తి వున్నాయి...

కుము — ఇంకా...ఇంకా...

రురు — ఇంకా యేమిటి? ... (ఆశ్చర్యంతో) కుముదినీ — ఏం అల్లా అయిపోయావు? — ఆఁ!

కుము — ఎల్లా అయిపోయాను?

రురు — ఇందాకటి ఉత్సాహ మంతా... ఆమెకంటె నీవే రూపసివి అన్నానుగా.—

కుము — రూపసినే. — పాడురూపసిని.

రురు — ఎందుకీ కోపం?

కుము — రురూ! చేతులు జోడింపజేసే వింతశక్తి వున్నదా- ఆ ఆ ప్రమద్వరలో?

(దూరాన ప్రమద్వరపాట)

"ఏమఁ జనిన మనోహరజాడ లరసి
కలసు హృదయంబు, నెమ్మది చలన మొందు
కనులు మూసిన, లోకమోహన మనోజ్ఞ
మూర్తి చిరునవ్వుఁ జిలుకుచు ముందు నిలుచు."

కుము — అదుగో వస్తోంది. ఆ ఆ ప్రమ ద్వర! నే వెడతా.

రురు — ఉండు. అందరం కలసి వెళదాము. తొందరేం?

కుము — నీకు ఆలస్యం కాలే?

రురు — అయిన ఆలస్యం యెల్లాగా అయింది.

కుము — పాపము, యెంత కాలము వృథా చేశానూ...వృథా...... నే వెళ్లాలి. వెళుతున్నా, రురూ!

(ప్రమద్వర పాడుతూ ప్రవేశించును)

"జలనిధులు దాటి యున్నతాచలము లెక్కి
హృదయ మదిరేమెం క్రిందు మీా జరుగకుండ
పక్షివలె రెక్కలం దాల్చి పరువు లిడను
మాటిమాటికి వలపుల పేటికవకు!"...

ప్రమద్వర — రురూ! రురూ! యిక్కడున్నావా!

రురు — ప్రమదా! ఎంతతీయని గొంతుక నీది!

(తెర)

## రెండవ రంగము

(పొదరిల్లు — ప్రమద్వర పాడుతూ ప్రవేశము.)

"ఏమ నిద్దుర వోదునో, యేమొ కరుణ
సెలవు గైకొన లేగ గావలదు; ఇన్ని
నాళ్ల రొమలేని రొడబాటు నా నిరీక్ష.
గమ్మ బరువులు బరువులై నయనయుగళ
మరెుౢ, దిగలాగు నిద్దురమరపులకును,"

"ప్రియతమా, యిక నిదురింతు పిలువరోయి
దాటిపోను దౌర్భాగ్యపు బ్రతుకు దాటి!
ప్రియతమా, పొరలి పొరలి నెయిమెగ లేప
మేలుకొన నీవు రెప్పల వాలి యుండుము!"

"ప్రియతమా, నిను వదలిపోలేను, నిదుర
కడలిరాయి కాటుకై కనుగవ నణచు!
ప్రియతమా, విడిపోలేనోయి విడలేని
నా మమతచిప్ప కనుకునా నిన్నుబోలి!"

రురు — ప్రమదా! యేమిపాట యిది. ఎందుకింత జాలి?

ప్రమ — (పాట ఆపి) రురూ! వచ్చావా? ఇల్లా రా.— నీవు అసలు రావేమో అనుకున్నాను...ఈ వెన్నెల నన్నెంతో బెంగపెటుతోంది. క్రిందటి పున్నమరాత్రి కదా మనం మొట్టమొదట కలుసుకొన్నది. ఈ నెలరోజులలో యెన్ని విషయాలు జరిగాయి ... రురూ! మొదట నిన్ను చూస్తే భయం వేసింది — ఏదో పరమ శ్రోత్రియుడవులా కనబడ్డావు...నీ హృదయంలో యెంత మెత్తదనము వుంది!

రురు — నీవుమాత్రము నన్ను కరగించి వేయలే? ప్రమదా! చర్విత చర్వణమైన యీ జీవితంలో బండిచక్రంలా తిరిగిపోతూవున్న నా బ్రతుకులోకి నీవు వొక క్రొత్త అందాన్ని, వొక క్రొత్త ఆశను, వొక క్రొత్త ఆశయాన్ని కలిపించావు...ప్రమదా! ఎంత ప్రేమమయుణ్ని చేసేశావు నన్ను...ప్రమదా! — అగ్నిహోత్రాల పొగకు అలవాటుపడ్డ నా

కళ్లు – నీవినీల కుంతలాల్లో దాక్కొని నిద్ర పోవాలని కోరుతున్నాయి...ప్రమదా! ప్రమదా! నీవు నాదగ్గర వొక్క నిమిషం లేకపోతే యేదో పారవేసుకున్న వాడ నులా అయిపోతాను ... చెప్పవూ, చెప్ప వూ నీవు నన్ను యెప్పుడూ వదలి వుండ నని...

ప్రమ — నేనుమాత్రం నువ్వు లేనిదే వుండ గలనా? రురూ! నీతోనే వుంది నాకు సర్వస్వమూను. నీ నీడలో నడుస్తూవున్న ప్పుడే నా జీవితానికి కాంతి వస్తుంది. నీ చూపులలోనే నాకు లోకం కనుబడు తుంది.

రురు — (ఆమెను చేరి చూచి, ఆశ్చర్యంతో) ప్రమదా! ప్రమదా!... ఏమిటి నీకళ్లు తడిసివున్నాయి ... ప్రమదా! నాకను పాపా! ఎందు కీ బెంగ?

ప్రమద — (గద్గదికగా) రురూ! ఏమో చెప్ప లేకుండా వున్నాను. ఈ సాయంత్రం నుంచీ ఏమో భరింపలేని బెంగ నన్ను ఆవ రిస్తోంది...రురూ! యేదీ ఇంకా దగ్గరగా రా. ఇంకా, ఇంకా-నన్ను వదలకేం ... నాకు భయమేస్తోంది. అగాధమైన మన అన్యోన్యాన్ని చూచి విధికే యీర్ష్య కలుగుతుంది అనిపిస్తోంది.

రురు — వైరిభయం! మనని విడదీయఃగల శక్తి యెవరి కుంది? నాప్రతి రక్తనాళంలో ప్రవహిస్తూవున్న నాప్రమద్వరను నన్ను విడదీయడానికి యెవరికి సాహసము!

ప్రమద — రురూ! నాప్రాణమా! యేమి ధైర్యం నీది! ప్రేమ అంతటిధైర్యాన్ని యిస్తుందికాబోలు ... కాని, రురూ! నేనే చనిపోతే ...

రురు — అబ్బ! యేమిమాటలు యివి! ఈ పండు వెన్నెలలో, యీదివ్యసమయం లో అనవలసిన మాటలా యివి...అబ్బ ఏమి ప్రస్తావన యిది! ప్రమదా! ప్రమదా! నన్నెందుకు భయపెడతావు?

ప్రమ — భయపెట్టడంకాదు ... పండు వెన్నెలన్నావు. యీపున్నమచంద్రునకు కూడ ఒకనాడు అమావాస్యే కదా!

(నేపథ్యమున: ఆకాశవాణి — నిజము నిజము. పున్నమవెన్నెల శాశ్వతముకాదు. ఐహికసుఖభోగము లనిత్యములు. దేహిని మృత్యువు అనుసరించుచునే యుండును.)

రురు — అబ్బ! ఎవరి మాటలు అవి...ఎవ రక్కడ! (చూచి వచ్చి) ఎవరూ లేరు. ప్రమదా! విన్నావా? యేమిభ్రాంతి యిది!

ప్రమ — భ్రాంతి కాదు. నిజం! రురూ! రురూ! నారురూ!

రురు — ప్రమద్వరా! నాప్రాణమా! ప్రమ ద్వరా!

(తెర)

## మూడవ రంగము

(మునిపల్లెలో తోటలో — తోటమాలికిల్ల పాట పాడుతూ వుంటుంది.)

" నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేను తండ్రి!

చీకటిలోన నీశరకు తొక్కేము
కసిదీర మమ్మల్ని కాటేయబోకు
కోనపుట్టలోని కోడెనాగన్న!
పగలు సాధించి మాప్రాణాలు దీకు

నాగులచవితికి నాగేంద్ర! నీకు
పొట్టనిండా పాలు పోసేను తండ్రి!"

కుముదిని — (ప్రవేశించి) నాగీ!- ఏం చాలా కులాసాగా వున్నావు? — మీకుకూడా నాగులచవితేనా?...మీ అమ్మేది?

నాగి — అదుగో వస్తోంది.

వెంకి — (వచ్చి) కుముదమ్మగారూ! — పుట్టలో పాలు పొయ్యడానికి బయలుదేరారా? అమ్మగారూ — ఆవిడే రండీ- ప్రమదమ్మగారు?

కుము — ఆవిడా — ఆవిడొస్తున్నారు.— ఇంకా తెమలలేదు ఆవిడకు. ఇంకా పూజ...అదుగో వస్తోంది.

ప్రమద్వర — కుముదినీ! ఆలస్యమైంది. రురువుకూడా వస్తానంటే ఆగాను.

(రురువుతో ప్రవేశించి)

కుము — ఊం—

రురు — కుముదూ! — పళ్లెంలో పళ్లూ, పాలూ, చలిమిడీ, పువ్వులూ, పూజా ద్రవ్యాలూ నువ్వూ, చూస్తే అచ్చంగా నాగకన్యకలా వున్నావు!

కుము — అవును. నేను నిజంగా నాగకన్యకనే...కరవగలనుకూడాను! (నవ్వును.)

(వెంకిని చూచి) ఏమ్మా్రా మీరుకూడా వస్తారా పుట్టలో పాలు పొయ్యడానికి? తాత యేడీ?

రురు — తాత యెవరు?

కుముదిని — దీనిమొగుడు... మరేం తోట మాలికీ దీనికీ యిరవైయేళ్లు తేడావుంది!- అసలు యిది మూడో పెళ్లామట అతనికి. కాదుటేం?

వెంకి — అయితేయేమండి అమ్మా! ఆయన కడుపుచల్లగా నా కేమిలోటండీ మహారాజు ఆయన!

కుము — ఏం మహారాజూ? ముసలాడు!

రురు — ఎందు కల్లా అంటావు కుముదూ! ముసలివానికిమాత్రం ప్రేమ ఉండదూ?

కుము — వుండ కేమి వుంటుంది. కాని, కాకి ముక్కుకి దొండపండులాగ ఆతాతకి యీపడుచుపిల్లా మేమిటి?

వెంకి — అమ్మగారండీ, అల్లా అనకండీ తప్పు.

ప్రమద్వర — వెళదామా? ఆలస్యమైంది. నాగులు మేత కెళ్లిపోతాయి.

(తోటలో కొంత నడచి)

కుము — ఇదుగో ఈపుట్ట బాగుంది. కాని యిక్కడ అప్పుడే యెవరో పాలు పోశారు. ఈనాగుకి అప్పుడే ఆరగింపు అయింది.

ప్రమద్వర — పైపుట్టదగ్గరకు వెళదాము.

రురు — అదుగో ఆకాశీరత్నాల పొదవెనుక వుండే ఆపెద్దపుట్ట అక్కడికి వెళదాము.

వెంకి — అమ్మగారు! అమ్మగారు! అతోవన వొద్దండీ. — అగడ్డి మెత్తైంది. మోకాలి లోతు అగడ్డిలో మీరు వెళ్ల లేరు.

ప్రమద్వర — ఆఁ ఏమి భయం!

కుము — నాకే అనుకున్నాను భయం లేనిది. ప్రమద్వరకూ భయం లేదు.

(ప్రమద్వర పుట్టమీద కాలు పెడుతుంది. బుస్సు మంటూ లేచి నాగుపాము ప్రమద్వరను కాటు వేస్తుంది).

ప్రమ — అయ్యో! రురూ! రురూ! పాము! పాము! కరచింది.

రురు — ఆఁ! ఆఁ! ఏమిటీ? — ఎక్కడ?

ప్రమద్వర — (బాధతో) రురూ! — రురూ! — అయిపోయింది... పున్నమ చంద్రుడు... అమావాస్య... అయ్యో! బాధ! — రురూ!

రురు — ప్రమదా!

(తెర.)

## నాల్గవ రంగము

(మునుపటిరంగమే. రురువు దుఃఖిస్తూవుంటాడు నిర్జీవియైన ప్రమద్వరను వొడిలో పెట్టుకొని. చుట్టూ ఋషులూ, ఆశ్రమవాసులూ కూర్చొని వుంటారు.)

"చ. అలయక రేఁవ దేవయజ
నాధ్యయనవ్రతపుణ్యకర్మముల్
సలుపుదునేని నేన సురు
సద్ద్విజభక్తునేని నేన యు
త్యలఘుతపస్వినేని దివి
జాధిపభూసురులార మన్మనో
నిలయకు నీప్రమద్వరకు
నిర్విషమయ్యెడు నేడు మీవయన్."

రురు — ప్రమదా! ప్రమదా! ఎంతనిద్రలో వున్నావు. నామాట వినుటలేదా? నేను రురువును. రురువును. నీప్రియుడను ... ప్రమదా! ఏమి మరపిది!...జ్ఞప్తి లేదూ ఆనాటి రాత్రి ఏది యెల్లాగైనా నన్ను వదలనని నీవు చేసిన వాగ్దానము! ఎల్లా మరవగలవు?

గౌతముడు — కుమారా! భ్రాంతిపడుతు న్నావు. ప్రమద్వరకు యింక నీప్రియో క్తులు వినబడవు...నీ వూరడిల్లవలెను... విధీ! విధీ!

రురు — మహాత్మా! గౌతమా! మీకును కరుణలేదా! అయ్యో! ఇంకేమిగతి?...

"చ. అపరిమితాజ్ఞ జేసియు మ
హాపురుషుల్ విమతత్త్వసంహితా
నిపుణులు మంత్రతంత్రముల
చేర్చి విధించియు దీనికిన్ విష
వ్యపగతమైనజీవ మిది
వచ్చుమపాయము సేయరొక్క నా
తపముఫలంబు నధ్యయన
దానఫలంబులు నిత్తు వారికిన్.

(నేపథ్యమున: ఉరుములు. ఆకాశవాణి గంభీరంగా:— అయ్యా! 'కాలవశంబయిన నెవ్వరికిం దీర్ప దరంబు గాదు. ఒక్కయుపాయంబు గలదు. చేయ నోపుదేని జెప్పెద వినుము. నీ యాయుష్యంబునం దర్ధం బిక్కన్య కిచ్చిన ఇకొక్కమలి విషనిర్ముక్తయై తొల్లింటి కంటె అధికశృంగారసమన్విత గాగలదు'. ఇది దక్షిణాశాధీశుండగు దండపాణి యనుమతంబు.)

గౌత — ఆహా! కౌశికవర్యా! ఏమి యీ యముని కరుణ!

కౌశికుడు — గౌతమమహర్షీ ! ... కాని యేమి నియమ మిది! వత్స రురువు ముదుసలి కావలెనా?

(పరుగెత్తుకుంటూ వచ్చి)

కుముదిని — ఆఁ ! రురువు ముసలివాడా ! ఎంతమాట! రురూ! చూడు, నువ్వు వొప్పుకోకు యీ నియమానికి. నువ్వే మిటి, ముసలివాడ వవడమేమిటి? ఇల్లా చూడు, రురూ! నువ్వు యిక్కడ వుండ వద్దు. నీమతి చలిస్తుంది. ఇల్లారా - నాతో రా. - రురూ! వెళదాముర్రా.

రురు — ప్రమద్వరా! — ప్రమద్వరా!...

కుముది — ఇం కెక్కడి ప్రమద్వరం!...రా, వెళదాము.

(చైతన్యంలేని గురువును బలవంతాన్ని తీసుకుపోతుంది.)

(తెర)

ఐదవ రంగము

(తోటలో మరొక భాగాన - కుముదిని రురువుకు బోధిస్తూ వుంటుంది.)

కుము — రురూ! వినవూ...ఎంత చెప్పినా వినవూ?

రురు — వినుట కేముంది? — అయ్యో! ప్రమద్వరా! ప్రమద్వర లేందే నేను బ్రతుకగలనా?

కుము — ప్రమద్వర! ప్రమద్వర! ధీరుడవు-నువ్వు యింత పిచ్చివాడ వనుకోలేదు... చూడు ... చూడు ... రురూ! నన్ను చూస్తే నీకు జీవితంలో వొక వుత్సాహం వస్తుంది అన్నావు......నా కళ్లలో ఒక ఉద్రేకం వుందన్నావుగా — చూడు చూడు — నా ప్రేమ యీ నాటిదికాదు. నీకు నాకు జ్ఞానము వచ్చినప్పటినుంచి నిన్ను నా వానిగా భావించుకున్నాను... ......జరిగినది జరిగింది — కాలప్రవాహానికి యెవరు యెదురీదగలరు?— ప్రమద్వర యింక నీకు రాదుకదా!

రురు — రాకేమి? ధర్మరాజునియమం వుందిగా!

కుము — యేమి నియమం! ఒకవేళ ఆమె బ్రతికి వచ్చినా ముసలి రురువును ఆమె చూస్తుందా! అబ్బ! నవయౌవనంలో వున్న నిన్ను చూచిన ఆమె నీవార్ధక్యం చూచి సహింపగలదా? జీవితంలో వున్న అందాన్ని ఆనందింపవలసిన నీకు - తెచ్చి పెట్టుకొన్న ముసలితనమేమిటి, రురూ! ఆమెమాత్రం ఎట్లా భరిస్తుంది? అందగత్తె యయిన ఆమెకు ముడుతలు పడ్డ నీశరీరము జాలి కలిగిస్తుందిగాని సంతోషం కలుగనియ్యదు. వణకుతూవున్న నీచేతులు ఆమెకు "అయ్యో పాపము!" అనిపిస్తా యేమో కాని నీ బిగికౌగిటిలో నలిగిపోవాలనే కాంక్ష కలిగింపవు. ఆమెకు నీమీద అసహ్యం కలుగకపోతే, ఏదో భక్తికొద్దీ నీకు పరిచర్య చేస్తుందేమోకాని నిన్ను యెప్పటికీ ప్రేమింపలేదు. రురూ!

రురు — (ఆలోచిస్తూ) కుముదినీ ... నువ్వు చెప్పే మాటలలో నిజం లేకపోలేదు. అవును! లావణ్యవతి అయిన ప్రమద్వరకు నాముసలితనపు ప్రేమను ఎల్లా అర్పించను?...అబ్బ!... కాని ప్రమద్వర

లేనిదే నాకు యీలోక మెందుకు? ఈ బ్రతు కెందుకు?

కుము — ఎందుకా! నాకొరకు...రురూ! నే నున్నాను నీకొరకు. చూడు! ఈతపోవ నం మెంత అందంగా వున్నదో! రాబో యే వసంతాన్ని యీ కొమ్మలు మెంత ఆతురతతో నిరీక్షిస్తున్నాయో...మన ము కలసివున్నచోట లావణ్యము వెల్లు వై పోదూ!... రురూ! నీప్రతిబింబాన్ని మోస్తూ, నీకు పాదపీఠమైయున్న యీ హృదయాన్ని చూడు. నీకోసమే ఎట్లా కొట్టుకుంటోందో! రురూ! రురూ! నీ పేరు చెప్పినంతమాత్రాన నాపెదవులకు ఎక్కడలేని తీపి వస్తుంది. ఆమాధుర్యం అంతా నీదేగా.

రురు — మాధుర్యం! ఏమి మాధుర్యం? - ప్రమద్వర లేనిదే ఈసృష్టిలో మాధుర్యం యేదీ! కుముదినీ! నీవు నీ అమూల్యమైన ప్రేమ ఆహ్వానముతో నన్ను గర్వితుణ్ణి చేశావు. కాని, నాకు ప్రమద్వర కావాలి. ఆమెలేని వసంతం నాకు శిశిరంకంటె భరింపరానిది. ఆమెలేని వెన్నెలలు నాకు భయంకరమైన కాళరాత్రులు.—

కుము — రురు! నీకోసమే చెపుతున్నా: ప్రమద్వర పడుచువాడైన రురువును ప్రే మించి వుండవచ్చుకాని పళ్లులేని, కీళ్లు సడలిన రురువు ఆమెకు కావాలా?

రురు — నేను యెల్లా వున్నా ఆమెకు తప్ప కుండా కావలసిన వాడనే — ఆ నమ్మకం నా కుంది.

కుము — వెర్రివాడా! అల్లా అనుకుంటు న్నావు. అయినా యింకొకమాట. నవ శిరీష కుసుమపేశలమైన ఆమె యవ్వ నానికి తోడుగ నీ ముసలితనాన్ని ఆమెకు అర్పించడం న్యాయమేనా?...ఆమె నీతో చెప్పకో లేకపోవచ్చును. కాని, ఎప్పుడో, వొక్క అరనిమిషమైన, ఆమెకు చింత కలుగదూ? "యీ ముసలివానితో యేమి కాపురము" అని. — అప్పుడు ఆమెకు కలిగిన అసహ్యాన్ని నీవు యెల్లా భరిస్తావు రురూ!......రురూ! నామాట విను...నాతోరా...మరోప్రపంచంలోకి వెళ్లిపోదాము...

రురు — పోనీ - ఆమెను బ్రతికించి...ఆమె నా వార్థక్యాన్ని చూచి — అబ్బ!— అబ్బ!— నాముసలితనం ఆమెకు రోత కలిగిస్తే అప్పుడే ఆమెపాదాలకడనే ప్రాణాలు వదులుతాను. - ప్రమద్వరా! ప్రమద్వరా! ఎంతకాలము యీయెడ బాటు! (తొందరగా లేచి) ఇదుగో వస్తున్నా.

కుముదిని — (అతనిని వారించి) వద్దు. వద్దు. రురూ! రురూ! ఆగు, ఆగు, రురూ! నీవు యేమి చేస్తున్నావో నీకే తెలియడం లేదు.

రురు — కుముదినీ! నన్ను ఆపకు...నాకు నా ప్రమద్వర కావాలి... నేను ఆమెను బ్రతి కించుకుంటాను.

కుము — వద్దు. వద్దు. నిన్ను వెళ్లనియ్యను.

(చెయ్యి పట్టుకుని వెనక్కి లాగుతుంది.)

రురు — తల్లీ! నమస్కరిస్తున్నాను. నన్ను వదలు.

(వదలించుకు వెళ్లిపోతాడు.)

కుము — (నిరాశతో) అబ్బ! ఎంత పిచ్చి వాడు.

(౩)

ఆరవ రంగము

(శాద్వలరంగ ప్రదేశము. రురువు ప్రమద్వరను వొడిలో పెట్టుకొని వుంటాడు. కొంచెం దూరంగా ఋషులు ఆశ్రమతాపసులు వుంటారు.)

రురు — ప్రమదా! ప్రమదా! ఎంత నిద్రలో వున్నావు? లోకపాలకా! శమనా! వినుము!

నీ నియమము ప్రకారము నన్నే ముసలి వానిని చేయుము. నా ఆయువు నిచ్చి నా ప్రమద్వరను బ్రతికింపుము.

ధర్మరాజా దయచూడుము!

(నేపథ్యమున: ఉరుములు — ఆకాశవాణి.)

మునివర్యా! అనుగ్రహించితిమి. భవదీయ త్యాగంబు ప్రశంసనీయంబు. సుశ్లోకుండవు భవదీయ త్యాగమహిమంబు ప్రమద్వరను పంచత్వంబువలనం బాపె; నిక శోకంబునుం దక్కుము. అత్యంతశోభా సమన్వితయగు నీ ప్రమద్వరం గూడి ఇష్టోపభోగంబు లనుభవింపుము నీకు మేలగుగాక!

రురు — మహాప్రసాదము! ... ప్రమద్వరా! ప్రమద్వరా! ... కదులుతోంది. కాని, యీమె నా ముసలిముఖం చూచి భయ పడదు గదా!...... అబ్బ! ఎంత పని చేశాను......కోరి తెచ్చిపెట్టుకున్నాను ఆమెకు నాకుకూడ యీ తీవ్రవ్యథను...

ప్రమద్వర — (మెలకువ వస్తూండగా) రురూ!... రురూ!

రురూ — ఈమెకు స్మృతి వస్తోంది. నా అందవికారమునకు యీ ఉత్తరీయాన్ని తెరచేసుకుంటా!

(ఉత్తరీయంతో ముఖం కప్పుకుంటాడు.)

ప్రమద్వర — (లేచి కూర్చుని) రురూ! రురూ!... ఇక్కడే వున్నావా?... నేను నీ వొళ్లోకి యెల్లా వచ్చాను! నన్ను వదల నని వొట్టు పెట్టు. ఎల్లా వెళ్లావు?... నేనే వెళ్లానా?......

అవును... ఎంత ప్రయాణం చేశాను అను కున్నావు...నాగలోకంలోకి వెళ్లాను... నాగకన్యక లందరూ నిన్ను గురించే అడి గారు......రురూ!...రురూ!... మాట్లా డవేం, రురూ... ఈముసు గేమిటి? ...

(ముసుగు తీసివేస్తుంది.)

ఓహో! ఏమి టిది. నువ్వు నారురువే? ఏమి టీ కాంతి! నీముఖంలో యెంత తేజస్సు! నీకళ్లు ఎంత మెరిసి పోతున్నాయి ... నీలో నవవసంతం తాండవమాడుతోంది. రురూ! నన్ను కౌగిలించుకో! గట్టిగా కౌగిలించుకో! ఏవీ నీలేతపెదిమలు......... అసలే సుందర మూర్తివి......మరింత సుందరుడ వెల్లా అయ్యావు? రురూ!

రురు — ప్రమద్వరా! ప్రమద్వరా!! అంతా నీ ప్రేమప్రభావమే... ప్రమదా! ప్రమదా! *

(తెర)

---

* ఆల్ ఇండియా రేడియోవారి అనుమతిని.

# నాజీ జర్మనీ — ఉన్నతవిద్య

కొచ్చెర్లకోట సత్యనారాయణ మూర్తి

"జ్యూ' జాతితో పోరాడటంలో నేను భగవదుద్దేశం నెరవేరుస్తున్నాను." — హిట్లరు.

పాశ్చాత్య ప్రజాప్రభుత్వాలు కడచిన రెండు వందలయేళ్లలో పూర్వ, పశ్చిమార్ధగోళాలు రెంటింటిలోను కావించిన దౌర్జన్యాలను కర్కశంగా కఠోరంగా వర్ణించే హిట్లరు, మహాభారతయుద్ధంలో, కుంగిపోతూవున్న కర్ణునిరథం చూసి హృదయ దౌర్బల్యం కలిగి చేయి వెనుకాడిన అర్జునుడికి ద్రౌపదీ వస్త్రాపహరణంవాటి పరాభవాన్ని జ్ఞాపకంచేసిన శ్రీ కృష్ణుణ్ని జ్ఞప్తికి తెస్తాడు.

'మీరు అశాశ్వతమని శాస్త్రజ్ఞులు చెప్పుకుంటున్నారు' అని మిణుగురుపురుగు నక్షత్రాన్ని చూసి నవ్విందట! మన జాతీయ ధర్మాన్ని సంప్రదాయాలను మరచిపోయి వ్యక్తిస్వాతంత్ర్యం పేర, ప్రజాప్రభుత్వం పేర, ఓట్ల పేర స్వార్థపరులైన పార్టీనాయకుల కక్షలలో కొట్లాటలలో చీలిపోయి మహాదరిద్రంలో మునిగి తేలుతూవున్న మనం, జర్మనీలోని హిట్లరుప్రభుత్వాన్ని నిరసించడంకన్న హాస్యాస్పదమైన విషయం వేరే వుండదు.

హిట్లరు నాయకత్వంక్రింద నాజీప్రభుత్వంవారు జర్మనీదేశపు ఉన్నత విద్యాసమస్యలను పరిష్కరించిన విధం వివరిస్తాను.

౧౯౩౧లో ఐరోపాఖండంలో వివిధదేశాల విశ్వవిద్యాలయాలలో నడపబడుతూవున్న పద్ధతులను గురించి ఒక రిపోర్టును తయారుచేయగా, అది ఆయాదేశాలప్రజల చిత్తవృత్తులను భావాలను ఆదర్శాలను వర్ణించే వేర్వేరు వ్యాసాలుగా పరిణమించిందట! అంతే కాని మానవకోటికంతకూ సర్వసామాన్యమైన విజ్ఞానాభివృద్ధికి సంబంధించిన సామాన్యలక్షణాలు అందు అంతగా అగపడనే లేదట! ఆవిద్యావిధానాలు ఆ దేశాల అభివృద్ధికోసం జరిగే ప్రయత్నాలతో అంత గాఢంగా మిళితమై పోయినాయి.

యుద్ధానంతరం, అనగా ౧౯౧౮ తర్వాత, జర్మను యూనివర్సిటీ ప్రొఫెసర్లకు తమ యూనివర్సిటీ చదువులపై మునుపటికన్న ఎక్కువ స్వేచ్ఛను ఇయ్యాలని అప్పటి జర్మనుప్రభుత్వం ప్రయత్నించిందిగాని ఇంతట్లోకే ఇంకో కొత్త ఉపద్రవం సంప్రాప్తమై జర్మను యూనివర్సిటీలస్వేచ్ఛ వెనుకటికన్న క్షీణించింది. అది యేమంటే, జర్మను విద్యార్థులలో జాతీయోద్యమం తీవ్రంగా విజృంభించి వారు అధికారులపై తిరగబడడం ప్రారంభించారు. జర్మను జాతీయగౌరవానికి భంగకరమైన వెర్సైల్సుసంధికి తమ ప్రభుత్వం తల ఒగ్గి మిత్రమండలివారి ఆజ్ఞలను శిరసావహించింది. జాతీయాభిమానపూరితులైన జర్మను విద్యార్థులకు ఈ యవమానం దుస్సహమనిపించింది. ఈ అయిష్టత ప్రభుత్వం యెడల ద్వేషంగా మారి ప్రత్యక్షవిరోధంలోకి దిగింది. బహిరంగంగా పోట్లాటలేర్పడ్డాయి. ౧౯౨౦, జనేవరిలో లీబరు అను పండితుడు సామ్యవాదులైన కొందరు విద్యార్థులను సమర్థించగా మిగిలిన విద్యార్థులు అతనిని యూనివర్సిటీ అధికారి యెదుటనే కొట్టారు. యూనివర్సిటీఅధికారి వారిని వారించలేదు, శిక్షించలేదు. ఇతర దేశాలలోవున్న జర్మను విద్యార్థులనుకూడా తమ విద్యార్థిసంఘాలలో సభ్యులుగా చేర్చుకోవాలని విద్యార్థులు పట్టుపట్టారు. ఇది ముఖ్యంగా ఆస్ట్రియా దేశంలోను, జెకోస్లావోకియా దేశంలోను వున్న జర్మను విద్యార్థులను తమతో చేర్చుకోవడంకోసం బైలుదేరిన ఉద్యమం. జర్మనుజాతినంతనూ ఐక్యంచేయ్యాలని విద్యార్థులు పోట్లాడడం పూర్వంనుంచీ అనుశ్రుతంగా వస్తూనేవుంది. అంతేగాని అది నేడు కొత్తగా బైలుదేరినవిషయం కాదు. మునుపు, బిస్మార్కు ప్రధాని నాయకత్వంకింద జర్మనుజాతి యావత్తూ ఏకచ్ఛత్రాధిపత్యంకిందకు

రావడానికి ముఖ్యకారణం జర్మనువిద్యార్థులు కాదా? అటుపిమ్మట, కడచిన ఐరోపాయుద్ధానికి పూర్వమూ, యుద్ధకాలంలోనూ, యుద్ధానంతరమూ విడవకుండా జర్మనులకు జాత్యభిమానం పురికొల్పుతూ వచ్చింది జర్మనువిద్యార్థులు కాదా? "జాత్యభిమానం అభివృద్ధి చేయడం మావుద్దేశ"మని బిస్మార్కుప్రభువే తన విద్యార్థిదశనుగురించి వ్రాసుకొనివున్నాడు.

జర్మనీదేశచరిత్రలో అనుశ్రుతంగా వస్తూవున్న విద్యార్థులఉద్యమం తిరిగి నేడు యీవిధంగా బైట పడింది. వెర్సైల్సుసంధిని చించి ఛేదించాలి; నిఖిల జర్మనుజాతిని ఒక్క నాయకత్వంకింద ఐక్యంచెయ్యాలి; అంతే కాదు. జర్మనుజాతికి చెందని, పవిత్రమైన జర్మను రక్తం తమదేహాలలో ప్రవహించని విద్యార్థులను తమ సంఘాలనుండి తొలగించాలి. ఇవి జర్మను విద్యార్థుల ఆశయాలు.

కాని ప్రభుత్వంయొక్క దౌర్బల్యంవల్లా, అసమర్థతవల్లా తమఆశయాలు సఫలం కావటంలేదు. ప్రభుత్వం విద్యార్థులసంఘాలను అంగీకరించలేదు. ప్రభుత్వానికీ విద్యార్థులసంఘాలకూ మధ్య మనస్పర్థలు హెచ్చాయి. జర్మనుజాతీయతకు తాము వారసులమనీ, అప్పటి జర్మనుప్రభుత్వం తమన్నూ, తమజాతినీకూడా అవమాన పరుస్తోందనీ విద్యార్థులు భావించారు. "దేశద్రోహులైన దుర్మార్గులు" అని అధికారులను వారు నిందించారు. జాతీయవిప్లవంకోసం తీవ్రంగా పనిచేశారు.

౧౯౩౩ నాటికి విద్యార్థులలో కలిగిన యీ అశాంతీ అలజడీ అప్పటి ప్రభుత్వాన్ని గజగజలాడించాయి. ఆయేడు ప్రభుత్వం విద్యార్థుల సంఘాలను అంగీకరించింది కాని అప్పుడే నాజీపక్షానికి ప్రభుత్వాధికారం యేర్పడుతోంది. రాజకీయాకాశాన హిట్లరు భాసుడవుతున్నాడు. ఈమార్పులలో జర్మను జాతితోపాటు విద్యార్థులుకూడా ముందంజవేశారు. బెర్లిను యూనివర్సిటీ విద్యార్థులు తమయూనివర్సిటీలో వున్న అజాతీయతను నిందిస్తూ, తమ 'జ్యూ' ప్రొఫెసర్లను నిరసిస్తూ, యూనివర్సిటీ అధికారికి అంత్యసందేశం యిచ్చారు. అతడు ఆసందేశాన్ని ఉపసంహరించుకోవలసిందని విద్యార్థులను మందలించగా వారందు కంగీకరించక యీవిధంగా జవాబుచెప్పారు!

"మేము ఎట్టిభావంతో ఉత్సాహంతో జీవిస్తున్నామో పనిజేస్తున్నామో అట్టి భావంతో ఉత్సాహంతో బోధించే జర్మను ప్రొఫెసర్లనుమాత్రమే మేము గౌరవిస్తాము. శత్రుబలాన్ని ముట్టడించడానికి సిద్ధంగావున్న సైనికదళంయొక్క ఉత్సాహ మది. అటువంటి వారియెడలమాత్రమే మాకు విశ్వాసం కలదు. వారే మాతప్పులను యెంచగలవారు"— (లండన్ టైమ్సుపత్రిక, ౨౬-౪-౧౯౩౩.)

కీలునగరంలో విద్యార్థులు, తమ ప్రొఫెసర్లలో ౨౮ మందిని ఉద్యోగాలలోనుంచి తొలగించవలసిందని పట్టుపట్టారు. విద్యాధికారులు అందుకు అంగీకరించనప్పుడు "మేమే తీవ్రమైన చర్యను తీసుకుంటున్నాము" అని వారికి తెలియజేశారు.

ఈవిధంగా ధిక్కరింపబడ్డ ప్రొఫెసర్లలో హాస్పెల్, కాల్మ్, హోబరు అను పేరుపడ్డ పండితులున్నారు. వారిగ్రంథాలు యూరపులో ఒకడజనుభాషలలోకి భాషాంతరీకరింపబడి వున్నాయి. తుదకు ఆ ౨౮ మందిని బర్తరఫుచేయక తప్పిందికాదు. ౧౯౩౩ మేనెల ౧౦-వ తేదీని సాయంకాలం బెర్లినునగరంలో, యూనివర్సిటీ యెదురుగా, బహిరంగస్థలంలో, ౧౫ వరు విఖ్యాతులైన గ్రంథకర్తల గ్రంథాలను విద్యార్థులు తగల బెట్టారు.

విద్యార్థులలో ప్రబలిన యీఅరాజకాన్ని అనేక మంది ప్రొఫెసర్లు నిందించారు, కొంతమంది తమఉద్యోగాలకు రాజీనామాలు ఇచ్చారు. "పూర్తిగా జర్మను జాతివారు కారన్నమాత్రాన విఖ్యాతిచెందిన 'జ్యూ'జాతిపండితులను లేవగొట్టడంవల్ల జాతీయ విప్లవానికి అనుకూలంగావున్న జర్మనులుకూడా పెడముఖం అవుతున్నారు. 'నాకు సీజరు అంటే అభిమానం తక్కువ" అని కాదుగాని రోమునగరంయెడల అభిమానం యెక్కువ' అని విఖ్యాత మానసికశాస్త్రవేత్త యైన కోలరు పండితుడు పత్రికలలో వ్రాశాడు. అతడి ధైర్యాన్ని మెచ్చుకుంటూ, జర్మనీదేశానికి కలుగుతూ

వున్న అపకారాన్ని ఉగ్గడిస్తూ, మరెవరో వ్రాశారు. జర్మనుప్రజాభిప్రాయం నాజీపక్షంమీద తిరగబడుతోందని వెంటనే లండను టైమ్సుపత్రిక వ్రాసింది. జర్మను విద్యార్థులు మాత్రం 'జ్యూ'జాతి ప్రొఫెసర్లను, జాతీయ విప్లవానికి ప్రతికూలురైన జర్మను ప్రొఫెసర్లను నిందించడం, వారిక్లాసులను బహిష్కరించడం మానలేదు.

“విద్యార్థిసంఘాలు ప్రొఫెసర్లను వారి పనులలోనుంచి తొలగించడం యికముందు సాగనియ్యను. రాజకీయమైన కారణాలవల్ల వుద్యోగులను వారిపనులలోనుంచి తొలగించేఅధికారం నేనే వుంచుకొంటున్నాను” అని జర్మను విద్యాంగమంత్రి 3-౫-౧౯౩౩ తేదీని ప్రకటించాడు. ఆమర్నాడే, అనగా ౪-వ తేదీని, బెర్లిను నగరవిద్యార్థులు తమ 'జ్యూ'జాతి ప్రొఫెసర్లను ఆరునెలలకాలం బహిష్కరిస్తున్నామని ప్రకటించారు.

కాని క్రమంగా నాజీపక్షానికి బలం యేర్పడ్డకొద్దీ విద్యార్థులలో రాజకీయప్రచారం తగ్గి, నూతన ప్రభుత్వంయెడల వారు తమధర్మాలను గుర్తెరగాలన్న ప్రచారం ప్రారంభమైంది. నాజీప్రభుత్వానికి తాత్కాలికంగా అణగివున్నంతమాత్రాన తాము తమ దేశంయెడల అభిమానం వీడలేదని విద్యార్థులన్నారుగాని దుర్నిరీక్ష్య ప్రతాపుడైన నాజీసూర్యుడు ఆకాశంలో ప్రకాశించినంతకాలం యితరనక్షత్రాల కచ్చట తావే వుండదు. పరమసర్వంకషమైన యీతనిప్రతిభ జర్మనుజాతియొక్క జీవితాన్ని పూర్తిగా ఆక్రమించింది. జర్మనుజాతి యావత్తూ ఒక్క పతాకంక్రిందికి వచ్చినతర్వాత, ఒక్క దేవుణ్ణి ఆరాధిస్తూవున్న తర్వాత, ఇక చిన్నచిన్న పతాకాల, చిల్లరదేవుళ్ల ప్రశంస యేల?

జర్మనువిద్యార్థు లిప్పటికే నాజీపక్షంలోవున్న తీవ్రవాదులనే సమర్థిస్తున్నారు. తమరాజకీయఅభిప్రాయాలతో ఏకీభవించని ప్రొఫెసర్లను తిరస్కరిస్తున్నారు. కాని నాజీప్రభుత్వం యూనివర్సిటీలలో అల్లరులను అరాజకాన్ని నిర్దాక్షిణ్యంగా అణచివేస్తోంది. చదువు సంస్థలలో శ్రద్ధను చూపి జర్మను విజ్ఞానాన్ని అభివృద్ధి చేయవలసిందని విద్యార్థులను హెచ్చరిస్తోంది. పోస్టు, టెలిగ్రాంఆఫీసుల మోస్తరుగా యూనివర్సిటీలుకూడా నాజీగవర్న్మెంటుయొక్క శాఖ లయినాయి.

౧౮౪౦ నుంచీ జర్మను యూనివర్సిటీలలో విద్యార్థిజనసమ్మర్దం యెక్కువైంది. ప్రజలలో ఉన్నత విద్య సర్వసామాన్యమైంది. యువకులు ఉన్నతవిద్య కోసం యూనివర్సిటీలలో విరివిగా మూగడం ప్రారంభించారు. కడచిన నూరేళ్లలో జర్మనీదేశపు జనసంఖ్య రెండురెట్లుమాత్రం పెరిగినప్పటికీ యూనివర్సిటీవిద్యార్థులసంఖ్య పదిరెట్లు పెరిగింది!

| | జర్మనీజనసంఖ్య | యూనివర్సిటీ విద్యార్థులసంఖ్య |
|---|---|---|
| ౧౮౪౦ లో | 3,30,00,000 | ౧3,000 |
| ౧౯౩౧ | ౬,౪౦,౦౦,౦౦౦ | ౧,3౮,000 |

సామాన్య యూనివర్సిటీవిద్యార్థులసంఖ్య యీ విధంగా పెరిగిపోవడం క్షేమంకాదని నీష్కీ పండితుడు హెచ్చరించాడు.

ఎన్నియూనివర్సిటీలైనా ఎన్నికాలేజీలైనా విద్యార్థులమందకు సరిపోవటంలేదు. చదివినవారికి బైట ఉద్యోగాలు దొరకటంలేదు. నాజీప్రభుత్వానికి పూర్వపుఅధికారు లీసమస్యను పరిష్కరించలేకపోయారు. ఏమి చెయ్యాలో వారికి తెలిసిందికాదు.

సామాన్య ఉన్నతవిద్యాసంస్థలలో చేరే విద్యార్థుల సంఖ్యను తగ్గించడంకోసం నాజీప్రభుత్వం చేస్తూవున్న ప్రయత్నాలను క్రితంసంచికలో వర్ణించియున్నాను.

నాజీపక్షం ప్రభుత్వాధికారం వహించిన నాలుగోరోజున, అనగా ౪-౨-౧౯౩౩ తారీఖున, వారు ఒకనోటీసును ప్రకటించారు. సెకండరీస్కూలు విద్యార్థులు యూనివర్సిటీలలో చేరడానికిపూర్వం ఆరునెలలకాలం యేదైనా వకవృత్తిలోతర్ఫీదునుపొంది, చేతిపనిలో తమకు అభిరుచి కలదో లేదో చూసుకోవలసిందనీ, అట్టి అభిరుచిగలవిద్యార్థులు సాంకేతిక విద్యాసంస్థలలో చేరవలసిందనీ, యూనివర్సిటీవిద్యకు అర్హత లేనివిద్యార్థులను మామూలు యూనివర్సిటీలలో చేర్చుకోరాదనీ ఆనోటీసుయొక్క సారాంశం(౨౩౪౫)

౧౯౩౩ ఏప్రిలు ౮-వ తేదీ గల ప్రభుత్వాజ్ఞ ప్రకారం యూనివర్సిటీలో చేరగోరుప్రతివిద్యార్థి, అతని

క్లాసుచదువులనుబట్టి" తెలివితేటలనుబట్టి, ఇష్టాయిష్టాలను బట్టి, పనిపాటలనుబట్టి, " ఉన్నతవిద్యకు అర్హ్హుడునో కాడో నిర్ణయించడానికి ప రీ క్షా సం ఘ ము ల ను యేర్పాటుచేశారు. అర్హతలేని విద్యార్థులు వాటిలో చేరడానికి తహతహ లైనయెడల యూనివర్సిటీలలో వారి కేవిధమైన సహాయం లభించకపోవడమే కాకుండా యేడాదితర్వాత వారు తిరిగి ఒక పరీక్షకు లోబడాలి. వారివిద్యాభివృద్ధి ఆరెండో పరీక్షాఫలితం మీద ఆధారపడి వుంటుంది.

౨౫ ఏప్రిలు ౧౯౩౩-వ తేదీని " సెకండరీ స్కూళ్లలోను హైస్కూళ్లలోను విద్యార్థుల సమ్మర్దం తగ్గించడంకోసం" ఒకచట్టం చేశారు. ఆ చట్టం ప్రకారం ౧౯౩౪-౩౫ సంవత్సరములో జర్మనీదేశమంతటా కలిపి ౧౫,౦౦౦మంది విద్యార్థులను మాత్రమే సామాన్యపుయూనివర్సిటీలలో చేర్చుకోవచ్చునని ఆజ్ఞాపించారు. ఆ తరువాత యేడు ౨౦,౦౦౦ మందిని మాత్రమే చేర్చుకున్నారు. ౮-౪-౧౯౩౩ తేది చట్టంలో నిర్వచింపబడ్డ యితరలక్షణాలతో బాటు సత్ప్రవర్తనా, నమ్మకమైన జాతీయాభిమానమూ కల విద్యార్థులకు మాత్రమే" యూనివర్సిటీ విద్యకు అర్హతను" ఇయ్యవచ్చునని నిశ్చయించారు.

విద్యార్థినుల సంఖ్య విద్యార్థు సంఖ్యలో పదోవంతుకు మించరాదు

యూనివర్సిటీలలో చేరగోరే విద్యార్థులు విద్యార్థినులు అంతకుపూర్వం నాజీ యువజనసంఘాలలో గాని, హిట్లరు యువజనసంఘాలలో గాని, జర్మను బాలికా సంఘాలలో గాని, ఇతరనాజీ సంస్థలలో గాని కొంత కాలం పనిచేసివున్నట్లు రుజువుచేసుకోవాలి.

౧౯౩౪లో సుమారు పదివేలమంది జ ర్మ ను విద్యార్థులకు యూనివర్సిటీలలో ప్రవేశం దొరకలేదు.

ఈనిబంధనలను రానురాను ఇంకా బిగువు చేశారు. ౧౯౩౫ ఫిబ్రవరి ౯-వ తేదీ శాసనంప్రకారం యూనివర్సిటీలో చేరగోరే విద్యార్థి "ముందు ముందు జాతియొక్క ఆర్థిక సాంఘిక రాజకీయ జీవితంలో కలగబోయే మార్పులలో తనకర్తవ్యం తాను నెరవేర్చగలడా లేడా" అన్నది ముఖ్యమైన విషయం. అతడు హిట్లరు యువజనసంఘంవంటి నాజీసంస్థలలో ఏదొకదానిలో నైనా సభ్యుడా? ఎంతకాలం? సభ్యుడుగా వుండి అతడు చేసినకార్యాలు ఏమిటి? ఇటువంటి విషయాలకు తగినప్రాముఖ్యమును ఇచ్చారు. దేహారోగ్యంలేని విద్యార్థులను యూనివర్సిటీలలో చేర్చుకోరాదు (౧౬-౧౨-౧౯౩౫). జర్మను యూనివర్సిటీల ఉద్దేశం విద్యార్థులకు ఏదో వకశాస్త్రంలో సంకుచితమైన ప్రావీణ్యతను ఇవ్వడంకాదు. మానసికంగాను, దైహికంగాను జాతీయనాయకులుగా ఉండతగ్గ యువకులు మాత్రమే యూనివర్సిటీ పట్టభద్రులు కాతగినవారు (౧౬-౧౨-౧౯౩౫). "జర్మను విద్యార్థి వేట కుక్కవలె చురుకుగాను, తోలుముక్కవలె బలిష్ఠంగాను, క్రప్ ఫ్యాక్టోరీలోని ఉక్కుపేడువలె దృఢంగాను ఉండాలి" అని బెర్లిను యూనివర్సిటీ నోటీసు బల్లపై వ్రాయబడివుంది.

నాజీనాయకుల ఈక్రొత్తనియమాలు జర్మనులలో కొంతమందికి రుచించలేదు. దేహదారుఢ్యాన్ని బట్టీ, రాజకీయాభిప్రాయాలనుబట్టీ విద్యార్థులను కాలేజీలలో చేర్చడం భావ్యంకాదనీ, ఆరెండువిషయాలలోను అనుకూలంగా లేకపోయినప్పటికీ మేధావంతులకు ప్రోత్సాహమియ్యడం అవసరమనీ వారు వాదించారు కాని అది అరణ్యరోదన మైంది.

'అనార్య' లైన విద్యార్థులపై అనేకవిధాలైన నిర్బంధా లేర్పరిచి వారిని చదువులలోనుంచి వెళ్లగొట్టారు. వారు జర్మనీదేశంలో వుండకుండా లేచిపోయే పద్ధతిని యూనివర్సిటీ పరీక్షలకు హాజరుకావచ్చును. రాజకీయమైన కారణాలవల్ల కొంతమంది జర్మను విద్యార్థులపైకూడా ఇటువంటి నిర్బంధాలను విధించారు.

ఉదా: ఒక జర్మను విద్యార్థికి యీ విధంగా నోటీసువచ్చింది"హార్బర్టు బోనిన్ అనే విద్యార్థి; జననం స్పెల్టీ (రూరుప్రాంతం)లో ౬-౧౨-౧౯౦౪-వ తేదీని; ప్రస్తుతనివాసం బెర్లిను-ఫ్రాంక్ ఔండార్ఫ్ : ఏవిధమైన (జర్మను) ప్రభుత్వపు పరీక్షలలోను పాల్గొనకూడ దని యింకుమూలంగా ఆజ్ఞాపించడమైనది"(౧౫-౧౦-౩౫).

పెద్దపెద్దనగరాలలో విద్యార్థులసమ్మర్దమూ, వారిలో రాజకీయమైన అలజడీ తగ్గించడంకోసం వారిని చిన్నచిన్న పట్నాలకు పంపుతున్నారు.

ఇదివరకు యూనివర్సిటీ విద్యార్థులు చాలావరకు చిన్నచిన్న కుటుంబాలుగల ధనికుల బిడ్డలు. జర్మనీ దేశానికి జనసంఖ్య అధికంగా కావలసివుంది. ధనికులు దేశంయెడల తమధర్మం నిర్వర్తించటం లేదు. కాబట్టి వారు విద్యాపోత్సాహాలకు అనర్హులు. పెద్దపెద్ద కుటుంబాలుగల సామాన్య కర్షకులే, కార్మికులే అందుకు అర్హులు; కాబట్టి నాజీ ప్రభుత్వం అటువంటి కుటుంబాలకు ఎక్కువ అవకాశాలు ఇచ్చింది. పూర్వం యూనివర్సిటీలలోను, సాంకేతికసంస్థలలోను చదువుతూవుండిన మొత్తం విద్యార్థులలో

| | | | |
|---|---|---|---|
| నూటికి ౪౭.౬౦ మంది విద్యార్థులు | ౧, ౨ పిల్లలుగల | | కుటుంబాలనుంచి |
| ౨౨.౫౨ | ,, | ౩, ౪ ,, | ,, |
| ౨౯.౮౮ | ,, | ౪గురికన్న ఎక్కువ | ,, |

వచ్చినవారు.

ఇప్పుడు ఉన్నతోద్యోగుల, ధనికుల బిడ్డల సంఖ్య చాలావరకు తగ్గి, సామాన్యసంసారుల, కర్షకుల, కార్మికుల బిడ్డలసంఖ్య హెచ్చింది. ౧౯౩౩-౩౪ సంవత్సరపు జర్మనువిద్యార్థులలో ధనికులబిడ్డలకన్న సామాన్యకర్షకుల, కార్మికుల బిడ్డలసంఖ్య రెట్టింపుఅనీ, పుట్టుకతోటీ ఐశ్వర్యంతోటీ సంబంధంలేకుండా తెలివితేటలుగల ప్రతిజర్మనుయువకునికీ నాజీపార్టీనియమాలకు లోబడి, ఉన్నతవిద్యకు అవకాశాలు కల్పించడమే జర్మనుయూనివర్సిటీల ఉద్దేశమనీ, ౧౯౩౫ లో బెర్లిను యూనివర్సిటీవిద్యార్థులసంఘం ప్రకటించింది.

ఉపాధ్యాయవృత్తికి శిక్షణపొందే విద్యార్థులందరూ కలిసి కొంతకాలం క్యాంపులో గడపాలి. మోటుజీవనం, ఒళ్లు వంచి అందరూ కలిసి పనిచెయ్యడం, క్యాంపుజీవితానికి అలవాటుపడడం, — ఇవి ఈ శిక్షణయొక్క ఉద్దేశాలు. బెర్లిను యూనివర్సిటీ విద్యాధికారి ౧౯౩౫ లో యీవిషయమై యీవిధంగా ఉపన్యసించాడు.

"క్యాంపుజీవితంవల్ల విద్యార్థులలో ఐకమత్యం అభివృద్ధి అవుతుంది. వారిలో వారికి "మీరు" అన్న దూరదూరపుమర్యాదలు పోయి "నువ్వు" అన్న స్నేహభావం ఏర్పడుతుంది. మరీ, పుస్తకచదువులలో మునిగితేలే విద్యార్థులు సహజంగా తమచుట్టూ కల్పించుకునే దురభిమానాలూ, ఆటంకాలూ నశించి వారు సామాన్యపు మనుష్యులుగా మారతారు."

జర్మను ఉపాధ్యాయుల పరివృత్తియొక్క ఉద్దేశం విద్యార్థులదృష్టిని విశాలంచేయడమే గాని వారిని ఏదో ఒకవిషయంలో ప్రత్యేకంగా ప్రవీణులను చేయడం కాదు. "జర్మనీదేశం ఇంచుమించు ప్రతి విద్యాశాఖలోను మహోన్నతపదవిని ఆక్రమించి యున్నప్పటికీ విప్లవస్థితి ఆమెకు తప్పలేదు. ఆదేశం యింకా జీవించి వుండాలంటే జర్మనులు సాధించవలసిన మహత్కార్యాలు ఇంకా చాలా వున్నాయి" అని జర్మను విద్యాశాఖ కార్యదర్శి అన్నాడు. నేటి జర్మనుఉపాధ్యాయులకర్తవ్యం, విద్యార్థులకు చదువుచెప్పడం మాత్రమే కాదు; వారికి చిన్నప్పటినుంచీ నాజీ సిద్ధాంతాలను బోధించి క్రొత్తపద్ధతులలో జాతీయ నాయకులు కాగల యువకులనుగా వారిని తయారు చేయడంకూడాను. ముందుముందు ఈ రెండుపనులు, చదువు నేర్పడం, పార్టీనాయకుల్ని తయారుచేయడం వేరుకావచ్చును. ప్రస్తుతం మాత్రం వాటిని వేరుచేయడం సాధ్యంకాదు.

జర్మను విద్యావిధానంయొక్క స్వభావాన్ని ఇదివరలో కొంతవరకు వివరించివున్నాను. సిద్ధాంతమూ ఆచరణాఅని విద్యను ప్రతివిషయములోను రెండు శాఖలుగా విభజింపవచ్చును. ప్రత్యక్షానుభవపూర్వకమైన ఆచరణను విడిచిపెట్టి కేవలం సిద్ధాంత చర్చలమీద ఆధారపడివుండేచదువులు నేల విడిచి చేసిన సాములవలె నిరాధారమవుతాయి. దేశకాల పరిస్థితులనూ ప్రజల అవసరాలనూ గమనించకుండా కేవలం విద్యాభివృద్ధిమాత్రమే ప్రధానోద్దేశంగాగల శాస్త్రజ్ఞానం

'ఉత్పత్స్యతే మమతు కోపి సమానధర్మా
'కాలో హ్యయం నిరవధి ర్విపులా చ పృథ్వీ'

అన్నట్లు ఎక్కడనో ఎప్పటికో ఎవ్వరికో ఉపయోగపడవచ్చును గాని ప్రస్తుతం దేశానికిమాత్రం నిర

ర్థకమవుతుంది గిరాఫీజంతువు యొక్క తలమోస్తరుగా అటువంటివిద్య ప్రజాశరీరానికి దూరమవుతుంది. ఒక వంక విద్యార్థులు శాస్త్రచర్చలలో గగనసౌధాలను నిర్మిస్తూవుంటారు. మరొకవంక జనసామాన్యం ఆ విద్య వల్ల ఏప్రయోజనమూ పొందజాలకుండా మహాదరిద్రం లో, అజ్ఞానంలో మునిగి తేలుతూ వుంటుంది. ఇది సామాన్యంగా మన యూనివర్సిటీలలో మనం నిత్యమూ చూస్తూ వున్నతంతు. అనుభవపూర్వకమైన శాస్త్రానికి? ప్రత్యక్ష ప్రయోజనం ముఖ్యమైనదని యని నాజీవిద్యార్థుల నమ్మకం. ప్రతిపరిశోధనా శాస్త్రీయంగా యథార్థ మవునా కాదా అన్న చర్చతోబాటు దాని ప్రత్యక్ష ఉపయోగాన్ని గురించికూడా జర్మనుశాస్త్రజ్ఞులు ఆలోచిస్తూవుంటారు. సామాన్య జనానికికూడా ప్రత్యక్ష ప్రయోజనంలేని శాస్త్రచర్చలంటే విసుగు, నిర్లక్ష్యం, అశ్రద్ధ.

విద్యావిషయంలో నాజీనాయకులదృష్టి యెల్లప్పుడూ జాతీయభావంమీదా చదువుల ప్రత్యక్షప్రయోజనంమీదా వుంటుంది. "శాస్త్రీయపరిశోధనలను దేశము యొక్క అవసరాలతో సంయోగంచేయడమే యూనివర్సిటీలు చేయవలసినపని" అని జర్మను విద్యామంత్రి అన్నాడు. ఆపక్షంవారి ఉద్దేశంలో, శాస్త్రీయపరిశోధనలయితే అది జర్మనుజాతియొక్క అభివృద్ధి కేదో విధంగా సాయపడాలి. కేవలం సిద్ధాంత పూర్వకమైన విద్యలైతే నాజీసిద్ధాంతాలను బలపర్చాలి. అంతేగాని అజాగళస్తనాలవంటి నిరర్థకపు చదువులు వారికి గిట్టవు.

ఒకవిధంగా అది వారికి సహజమే. వారిలో చాలామంది ఇదివరలో విద్యాసంపర్క మంతగాలేని బీదకుటుంబాలలోనుంచి పైకి వచ్చినవారు. జనసామాన్యంతోపాటు వారికికూడా ప్రత్యక్షప్రయోజనంగల చదువులయెడల గౌరవమూ, అట్టిప్రయోజనంలేని చదువులయెడల విముఖతా గలవు. వారు ప్రత్యక్షానుభవంలో నిరర్థకమైన శాస్త్రాలను, నాజీప్రచారానికి అనుకూలంకాని శాస్త్రాలనూ, దుబారాఖర్చుక్రింద కొట్టివేస్తున్నారు. ఉదా: ప్రాచీన ఈజిప్టుచరిత్రకూ, అందుకు సంబంధించిన పరిశోధనలకూ లక్షలాద్రవ్యం కానీ. ప్రస్తుతం జర్మనీకి అది నిరర్థకమైనశాస్త్రం కాబట్టి దానికోసం ధనం వెచ్చించనక్కరలేదు. ఈవిధంగా వుంటాయి వారి ఆలోచనలు. "జాత్యభిమానం పెంపు చేయడానికి సైన్యను ఒక సాధనంగా జాతీయ ప్రభుత్వం పరిగణిస్తోంది" అని హిట్లరు అన్నాడు. "మేమే ముందు" అని జర్మనులు సంస్కృతంవంటి ప్రాచీనవిజ్ఞానాన్ని శాస్త్రాలను ప్రోత్సహించడంలో ముందంజవేసి వరోజులు గతించాయి. ఆర్థికంగా జర్మను లిప్పుడు బీదస్థితిలో వున్నారు. ప్రభుత్వం దుర్బలస్థితిలో వుంది. కడచిన యుద్ధంలో దేశం అన్నివిధాలా ధ్వంసమైంది. ఇక

"మానంబే నగ, మాటలే కవచముల్,
మర్యాదలే భాగ్యముల్"

అన్నట్లు ప్రజల దేశభక్తీ ఆత్మత్యాగమూ తప్ప మరేమీ మిగలలేదు. మహాదరిద్రంలో కొట్లాటలలో జర్మనుప్రజ యావన్మందీ నిష్కళంక దేశాభిమానంతో స్వార్థత్యాగంతో ఒక్కపతాకంక్రిందకు చేరారు. అట్టి పరిస్థితులలో వారిని నిందించి ప్రయోజనంలేదు. అంతకంటె వారేమీ చేయలేరు. మునిగిపోతూవున్న పడవను కాపాడడంకోసం అనవసరమైన సామానును బైట పారవెయ్యడం అనర్థంకాదు.

యూనివర్సిటీవిద్యార్థులచే ప్రారంభింపబడ్డ జ్యూ ప్రొఫెసర్ల బహిష్కారోద్యమాన్ని నాజీప్రభుత్వం కొనసాగించింది. సుమారు వేయికంటె ఎక్కువమంది ప్రొఫెసర్లను ఉద్యోగాలనుంచి తొలగించింది. అట్లా తొలగింపబడ్డవారిలో ఐదుగురు శాస్త్రపరిశోధనలలో "నోబెలు" బహుమతులను పొందిన మేర్హాఫ్, ఫ్రాంకు, ఈన్‌స్టీన్, హేబరు, హెర్ట్జు అను విఖ్యాతసైన్సుపండితులు (న్యూయార్కు టైమ్సు, ౫-౪-౧౯౩౪). రాజకీయ కారణాలచేత, పేరుపొందిన సైన్సుపండితులను వెళ్లగొట్టడం భావ్యం కాదనీ, దేశాభివృద్ధికి భౌతికశాస్త్రాలు అత్యవసరమనీ పూజ్యుడూ, కైజరు విల్హెల్ముసంఘానికి అధ్యక్షుడూ అయిన మాక్సు ప్లాంకు అను పండితుడు హిట్లరుతో స్వయంగా విన్నవింపగా

"సైన్సుపండితులకోసం మనరాజనీతిని రద్దు చేయడానికిగాని, మార్చడానికిగాని వీలు లేదు. 'జ్యూ' సైన్సుపండితులను వెడలగొట్టడంవల్ల జర్మను సైన్సు నశిస్తే, కొంతకాలం మనం సైన్సు లేకుండానే గడుపుకోవాలి"

అని హిట్లరు జవాబిచ్చాడట! "సైన్సు కొంతకాలం ఆగవచ్చునుగాని స్వరాజ్యం ఆగడానికి వీలులేదు!" అన్న ప్రఫుల్లచంద్రరేగారి వాక్యం మనకీసందర్భంలో జ్ఞాపకం రాకమానదు.

ఫ్రిట్జ్ హేబరు విఖ్యాతుడైన శాస్త్రజ్ఞుడు; ౨౨ ఏళ్లు కైజరు విల్హెల్ము సంస్థలో అధ్యక్షుడుగా పని చేసినవాడు. అతను తనసంస్థను చాలావరకు 'జ్యూ' జాతి ప్రొఫెసర్లతో నింపి జర్మను ప్రొఫెసర్లకు ఆటంకం కలగజేశాడు. 'జ్యూ'పండితులను వెంటనే తొలగించవలసిందని నాజీప్రభుత్వం అతనికి ఆజ్ఞాపించిందిగాని తనయిష్టం వచ్చిన పండితులతోనేగాని తాను పనిచేయనని అతడు పట్టుపట్టాడు. గతయుద్ధంలో జర్మనీదేశానికి అతడు తన పరిశోధనలవల్ల అపారమైన సేవ చేశాడు. ఆరోజులలో మిత్రమండలి జర్మనీకి రొట్టెను తిండిసరుకుల నన్నిటినీ ఆపుచేసినప్పుడు అతని పరిశోధనలవలన యుద్ధాని కవసరమైన నైట్రేట్లను 'చిలీ' దేశాన్నుంచి ఎగుమతి చేయనక్కరలేకపోయింది. ఆకృతజ్ఞతవల్ల నాజీప్రభుత్వం అతనినిమాత్రం మిగిల్చింది. కాని ఇతర 'జ్యూ' ప్రొఫెసర్ల విషయంలో అతడు తనపట్టును వదలనందున తుదకు అతనినికూడా పనిలోనుంచి తొలగించవలసివచ్చింది.

యూనివర్సిటీలనుంచి వెళగొట్టబడ్డ 'జ్యూ' జాతి సైన్సుపండితులలో కొందరు ప్రైవేటు ఫ్యాక్టొరీ పరిశోధన శాలలలో పనులకు కుదిరారు. మరికొందరు ఇతర పారిశ్రామికసంస్థలచేత పోషింపబడ్డారు.

మానవకోటికంతకూ సర్వసామాన్యమైన శాస్త్రజ్ఞానానికికూడా నాజీపక్షంవారు 'జర్మను సైన్సు' అనీ, 'జ్యూ' జాతిసైన్సు అనీ జాతి మత భేదా లేర్పరిచారు. విఖ్యాతశాస్త్రజ్ఞుడైన లెనార్డుపండితుడు తన గ్రంథానికి "జర్మను పదార్థవిజ్ఞానశాస్త్రం" అని పేరు పెట్టి, పీఠికలో యిల్లా వ్రాశాడు:

"జర్మను పదార్థవిజ్ఞానశాస్త్రమా ?" అని యెవరైనా అనగవచ్చును. ఈగ్రంథాన్ని 'ఆర్యను' పదార్థవిజ్ఞానశాస్త్రమని కూడా పిలవవచ్చును....'సైన్సు ఎల్లప్పుడూ అంతర్జాతీయమైనవిషయం కాదా ?' అని మీరు అనుకుంటారు. అది అబద్ధం. మానవనిర్మితమైన యితర విషయాలవలెనే సైన్సుకూడా జాతిని బట్టి మారుతుంది. రక్తస్పర్శను బట్టి నిర్ణయమవుతుంది".

ఈ విషయంలో మనం నాజీ జర్మనీని పరిహసించ నక్కరలేదు. ఇంగ్లీషువారికి అమెరికావారికి భాష సామాన్యమైనప్పటికి ఇంగ్లీషువారు తమవిజ్ఞానసర్వస్వాన్ని 'ఎన్‌సైక్లోపీడియా బ్రిటానికా' అన్నారు. అమెరికావారు 'ఎన్‌సైక్లోపీడియా అమెరికానా' అన్నారు. ఇంగ్లీషు వాఙ్మయచరిత్రలో అమెరికను కవుల పేర్లు అంతగా కనపడవు. అమెరికను వాఙ్మయ చరిత్రలో ఇంగ్లీషుకవుల పేర్లుకూడా అంతే.

సైన్సుగ్రంథాలలో జాతీయభావం ఉపోద్ఘాతం వరకేగాని అంతకు మించడానికి వీలుండదు. నాజీప్రభుత్వమైనా ప్రకృతినియమాలను అతిక్రమించలేదు. రోడ్లను వంతెనలను నిర్మించడానికి ప్రత్యేకం నాజీశాస్త్రం వుంటుందా ? వైద్యవృత్తినిగురించి యొక జర్మను వైద్యుని యీక్రింది వాక్యాలవల్ల నాజీపక్షానికీ, సైన్సుకూ వుండే సంబంధం కొంతవరకు అర్థమవుతుంది. "ఎంతటి ఘనవైద్యుడైనా, నూతన జర్మను జాతీయ రాజకీయ సిద్ధాంతాలను గ్రహించి వాటిప్రకారం సంఘంలో తనవిధ్యుక్తధర్మాలను నిర్వర్తించకపోతే, మంచివైద్యుడు కాజాలడు. వైద్యవిద్యార్థులు ఈవిధంగా తయారు కావడానికి అవకాశాలను కల్పించడమే యూనివర్సిటీల ప్రధాన కర్తవ్యం". దేశచరిత్ర, మానసికశాస్త్రం, సాంఘికశాస్త్రం మొదలైన శాస్త్రాలను వారు త్యజించలేదు. నాజీపక్షపు ప్రచారానికవి అనుకూలమైన శాస్త్రాలు కాబట్టి వాటిని జాగ్రత్తతో పోషించి అభివృద్ధిచేశారు. దేశచరిత్రననుసరించి వకజర్మను చరిత్రకారు డీవిధంగా వ్రాశాడు. "దేశచరిత్రయొక్క విలువ కల్పితమేగాని యథార్థం కాదు. ఒకవృత్తాంతంయొక్క ప్రాముఖ్యం మనం కల్పించుకున్నంతవరకే గాని దానియథార్థతనుబట్టి కాదు."

జనసామాన్యం, – చదువుకున్నవారూ, చదువురాని వారూకూడా, ద్వేషం, అసూయ, అహంభావం, కక్ష మొదలైనభావాలకు సులభంగా దాసులవుతారు. నాజీ పార్టీయొక్క తత్వం, ప్రజ లందరికీ సరిగా అర్థమైందని చెప్పడానికి వీలులేదు. పైనున్న ఏకొద్దిమంది నాయకులకో దానిస్వభావం పూర్తిగా బోధపడవచ్చును గాని జనసామాన్యానికి దిగేసరికొద్దీ అది భావోద్రేకాలకిందా, పాలిటికలకిందా, మతవిశ్వాసంకిందా మారుతుంది. నాజీ పక్షంవారు ఏవిద్యనైనా దూషించినా భూషించినా ప్రజలలో ప్రచారంకోసమే.

ఈవిధంగా విద్యాప్రణాళికలో కొన్నివిషయాలను పూర్తిగా ఏరివెయ్యడం మాత్రమే కాదు. తాము అంగీకరించిన విషయాలను, బోధించేపద్ధతులనుకూడా వారు నిర్ణయిస్తున్నారు. న్యాయశాస్త్రం, అర్థశాస్త్రం, వార్తాపత్రికానిర్వాహకశాస్త్రం మొదలైనవాటిని బోధించడానికి విరివిరైన కార్యక్రమాలను తయారు చేశారు. ఉదా: అర్థశాస్త్రంలో బోధించవలసిన విషయాలు ఈవిధంగా వుండాలి: అర్థశాస్త్రంయొక్క ముఖ్యోద్దేశం దేశాభివృద్ధికి తోడ్పడడం: ౧౯-వ శతాబ్దంలో విశ్వసోదరత్వం, అంతర్జాతీయత, మానవవిజ్ఞానాభివృద్ధి మొదలైన పెద్ద పెద్ద ఆదర్శాలతో ఆ శాస్త్రం తన అసలు ఉద్దేశాన్ని మరచిపోయింది: అర్థశాస్త్రానికి పునాది జాతీయభావం అన్నసంగతిని విద్యార్థి బాగా గ్రహించాలి; జాతి, తెగ, మానవోత్పత్తి శాస్త్రం, చరిత్ర ప్రారంభంకావడానికి ముందు మానవ వృత్తాంతం, జర్మనుల రాజకీయాభివృద్ధి, ముఖ్యంగా కడచిననూరేళ్లలో. ఈపాఠాలలో మానవసంఘనిర్మాణతత్వంమాత్రమే నేర్పుతోవా లనుకునేవారికి అవకాశాలుండవు. ఆచరణను సిద్ధాంతాలను ఐక్యం చెయ్యాలన్న ఉద్దేశంతో, బెర్లిను యూనివర్సిటీలో అర్థశాస్త్రశాఖను వర్తకవ్యవహారాలను బోధించేశాఖతో ఐక్యం చేశారు (౮-౧౧-౩౫). అర్థశాస్త్రంవంటి సాంఘిక శాస్త్రాలప్రయోజనం సంఘశక్తిని అభివృద్ధిచెయ్యడం అనీ, ముందు సంఘం, సంఘధర్మం, సంఘధర్మప్రతిష్ఠాపన, తర్వాత వ్యక్తి, వ్యక్తిస్వాతంత్ర్యము అన్న నాజీసిద్ధాంతాన్ని సాంఘికశాస్త్రజ్ఞులు గ్రహించాలనీ ప్రతిచోటా నొక్కిచెప్పుతున్నారు.

నిజానికి, నాజీపక్షంవారి విద్యాసంస్థ యూనివర్సిటీ కానేకాదు. అది పూర్వంనుంచీ వున్నది. దానిని వారు తమపనికోసం వీలైనంతమట్టుకుఉపయోగించుకున్నారు. వారిఉద్దేశాల కనుగుణంగా వారిచేత ప్రత్యేకంగా నూతనంగా నిర్మింపబడ్డవి (౧) సాంకేతికవిద్యాసంస్థ, (౨) వృత్తిస్కూలు. దేశంలో ప్రకృతిసంపద లోపించినప్పటికీ తాను పరిశ్రమలలో ఉన్నతస్థానం వహించగల్గియుండడానికి ముఖ్యకారణం సాంకేతికవిద్యాభివృద్ధియని జర్మనుల నమ్మకం. అందుచేతనే కాలేజీలలో ఆచరణపూర్వకమైన శాస్త్రీయవిద్యను అభివృద్ధి చెయ్యాలని వారిఆదుర్దా. "ఆచరణపూర్వకమైన విద్యను వృత్తులను అగౌరవం చేసి, కట్టి పుస్తకచదువులను వ్రాతకోతలను సంబంధించినవృత్తులను గౌరవించే దురభ్యాసాన్ని మనం ఎంత త్వరలో ఎంత సంపూర్తిగా వదలుకోగలిగితే అంత త్వరలో అంతతీక్ష్ణంగా జాతీయ సామ్యవాదం దేశమంతటా వ్యాపిస్తుంది" అని జర్మను విద్యాశాఖకు సంబంధించిన యొకప్రధానోద్యోగి అన్నాడు.

౧౯౩౫-౩౬ లో జర్మనీదేశపువిద్యార్థు లందరికీ బ్రహ్మాండమైన పోటీపరీక్షలు ఏర్పాటుచేశారు. ఆపోటీపరీక్షలలో ఐదువేలమంది యూనివర్సిటీ సాంకేతిక విద్యాసంస్థల విద్యార్థులూ, ఆరువేలమంది వృత్తిస్కూళ్ల విద్యార్థులూ పాల్గొన్నారు. వారందరూ చిన్నచిన్న జట్లుగా పనిచేశారు. పోటీవిషయాలు నాలుగు రకాలు:

(౧) జర్మనుగ్రామనిర్మాణము;

(౨) ఒకవ్యాపారసంస్థ;

(౩) జర్మను శాస్త్రాలలోను కళలలోను 'జ్యూ' మతస్థుల ప్రాబల్యము.

(౪) జర్మను విజ్ఞానానికి జర్మను జాతీయభావానికిగల పరస్పర సంబంధము.

మొదటి బహుమతీ వచ్చేవిషయాన్ని ఆయిదుగురు విద్యార్థులు జట్టుగా కలిసి తయారుచేశారు. దానిని

తయారుచేయడానికి రెండేళ్లు పట్టింది. విషయం "క్లెమెంకో, మరి ఫ్రెంచిదేశపు ఇతర జాతీయ ప్రజా ప్రభుత్వనాయకులు;" ఆ బహుమతీ సంపాదించినది కోనింగ్సుబర్గు విశ్వవిద్యాలయం. దానిని జర్మను విద్యార్థులసంఘం ప్రచురించింది.

కాని పోటీకి వచ్చినవిషయా లన్నిటిలోను మిక్కిలి మెప్పుపొందినది, జర్మను మునిసిపాలిటీల దివాలాలనుగురించిన పరిశోధన. మునిసిపలు అధికారులు దానిని మిక్కిలి మెచ్చుకొని అందులో చేయబడ్డ సూచనలను అమలులో పెట్టడంకోసం ఆ విషయాన్నిగురించి పరిశోధించిన విద్యార్థులజట్టునాయకుణ్ని నియమించారు! మన దేశంలోకూడా యూనివర్సిటీ చదువులు సంఘాభివృద్ధికి యీవిధంగా యేల తోడ్పడకూడదు? కాలేజీచదువులు దేశాభివృద్ధికి క్రియారూపకంగా తోడ్పడగలవని రుజువుచెయ్యడం యీ పోటీల ఉద్దేశాలలో వకటి. విద్యార్థి లెప్పుడూ రాజకీయవిషయాలలో మునిగి తేలకుండా వారిదృష్టిని విద్యాభివృద్ధివంకకు తిప్పడం మరొకటి. "నాజీ ప్రభుత్వంక్రింద జర్మనీలో శాస్త్రీయాభివృద్ధి తగ్గలేదని ఈపోటీలు ప్రపంచానికి రుజువుచేస్తున్నాయి. పూర్వపు జర్మను విద్యార్థులకన్న నాజీవిద్యార్థి ఎక్కువపని చేయించగలుగుతున్నాడు" అని ఆపోటీలను ప్రారంభించే సందర్భంలో విద్యార్థిసంఘాలనాయకుడు తన ఉపన్యాసంలో చెప్పివున్నాడు. ఇదిగాక మిలిటరీ తర్ఫీదుకూడా జర్మనువిద్యార్థులకు కొత్తజవం ఇచ్చింది.

కాని యీ అభివృద్ధి శాశ్వతమా? నిర్బంధ ప్రయత్నాలవల్ల కల్గిన విజ్ఞానాభివృద్ధి ఎంతకాలం పాసుతుంది? మిలిటరీ డిక్టేటరు తన రాజదండంతో మంత్రించి మనకళ్లయెదుట మొలిపించిన మామిడిచెట్టు ఎంతకాలం కాస్తుంది? రాజకీయ ఉద్దేశాలకు అనుగుణంగా మానవ విజ్ఞానాన్ని అభివృద్ధిచెయ్యడం యెంతవరకు సాధ్యం? ఈప్రశ్న లన్నిటికీ భవిష్యత్తే జవా బియ్యాలి.

---

# పౌష్యలక్ష్మి

బొడ్డు బాపిరాజు

చిఱుగాలిం జెరలాడు వాలుజడపై చేమంతి పూబంతి డా
లారయం జీరచెరంగుతో; బాలిపదా లూకొట్టుచుర్ల, సస్యసుం
దరి కైదండ యొసంగ భూసతి గృహద్వారమ్మునన్ మోపె శ్రీ
చరణాబ్జమ్ములు పౌష్యలక్ష్మి సకలాశల్ పట్టు నివ్వాళితో!

# మ స్న వీ

## ఉ ప క్రమ ణి క

కర్త:
జలాలుద్దీన్ రూమీ

అనువాదకుడు:
మొహమ్మదు ఖాసింఖాన్

[మౌలానా జలాలుద్దీన్ రూమీ (౧౨౦౭-౧౨౭౩): పారశీక సూఫీకవులలో మౌలానా రూమీ అగ్రగణ్యుడు. ఈ కవిసార్వభౌముని అసలు పేరు జలాలుద్దీన్ మొహమ్మద్. రూమ్ లేక చిన్నఆసియాయందు చిరకాల ముండినవా డగుటచే ఇతనికి రూమీ అను వ్యవహారనామము కల్గినది.

క్రీ. శ. ౧౨౦౭ లో ఈకవి బాల్ఖ్ నగరమున జన్మించెను. ఇతనితండ్రి బహాఉద్దీన్ ఆకాలపు సూఫీలలో ప్రసిద్ధికెక్కినవాడు. జలాలుద్దీన్ బాల్యముననే పారశీకరాజు ఆగ్రహమునకు గురియై బహాఉద్దీన్ విదేశములకు వలసపోవలసివచ్చెను. ఈసంచారములో ఆయన నైషాపురము, బాగ్దాదు, మక్కా, లరిండా, ఖోనియా మున్నగు అనేకనగరములు దర్శించెను. అప్పుడు నైషాపురములో ఫరీదుద్దీన్ అత్తార్ అను ప్రఖ్యాత సూఫీకవిచంద్రు డుండువాడు. బహాఉద్దీన్ ఆయనను దర్శించెను. అత్తార్ బాలుడగు జలాలుద్దీను నెత్తుకొని ముద్దాడి "ఇతనికీర్తి దిగంతములు వ్యాపించు"నని ఆశీర్వదించెను.

బహాఉద్దీన్ గొప్పపండితుడు, వేదాంతి, యోగి. జలాలుద్దీన్ తండ్రికడనే సర్వశాస్త్రము లభ్యసించెను. తర్వాత తనతండ్రి శిష్యులలో ప్రసిద్ధుడగు బుర్హానుద్దీన్ అను యోగిపుంగవునికడ కొన్నాళ్లు శుశ్రూషచేసి, తుదకు షమ్స్ - ఎ - తబ్రీజ్ అను ఒకమహాత్ముని అనుగ్రహమువలన దివ్యజ్ఞానమును పొందెను.

రూమీమహాకవి మూడుకావ్యములను రచించెను. అందు ప్రసిద్ధికెక్కినవి రెండు: దివానె షమ్స్ - ఎ - తబ్రీజ్; మస్నవీ. మొదటిది తనపరమగురువగు షమ్సుముని జ్ఞాపకార్థము వ్రాసినది. ప్రాచ్యదేశములలో 'దివాన్' కన్న 'మస్నవీ'యే ఎక్కువప్రసిద్ధి వహించినది. కాని పాశ్చాత్యులు 'దివాన్'కే ఉన్నతస్థాన మిచ్చినారు. 'దివాన్' ఖండకావ్యముల సంపుటి. 'మస్నవీ' అనేక ఉపాఖ్యానములతో కూడిన ఒకే దీర్ఘకావ్యము.

మస్నవీకావ్యమును "పారశీక ఖుర్ఆన్" అందురు. ఇస్లామ్ మతతత్వ మీకావ్యమున బోధింపబడినట్లు మరేగ్రంథమునందును బోధింపబడలేదు. ఇ. జి. బ్రౌన్ ఈ కావ్యమునుగురించి

"His (Rumi's) mystical Masnavi de-serves to rank amongst the great poems of all time"

అని వ్రాసినాడు. మస్నవీకావ్యము ఆరుభాగములలో వ్రాయబడినది. ఇందు ౨౬,౬౬౦ ద్విపదలు కలవు. మస్నవీ ఆంగ్లానువాదములు పూర్తిగా కలవు.]

నాడు వెదుళ్ల లేబాదల నన్ను పెకల్చిననాటనుండి నే
పాడిన శోకగీతులకు బాష్పములన్ కురిపించి రెల్లరున్;
పాడుదు నావిషాదకథ బాటగ; మీయెడదల్ వియోగపున్
వేడిమిచే హరింపబడనే విన నర్హత గల్గు నప్పుడే.

ఎందరెందరికడనో నాయెద రగుల్కొ-
నిన విరహగీతికలను వినిచితి, గాని
నన్నుబోలు యభాగ్యమానవులకడనె
నాకు సుఖము, తుష్టియు మహానంద భవము.

ఎందరో సఖులై రది యేమొగాని
నారహస్యము గ్రహియింపనేర డెవడు ;
వ్యంజితమ్మాయె నెడబాటు పాటలందె
వెలుగులోలగిన కనులకు తెలియుటెట్లు ?

ఈమురళీ సుధారవము నెంతఃరో కేవల మూపి రంచు, కా
దీమహితస్వరాలు హృదయేచ్ఛ రగిల్చిన కీలికీలికా
స్తోమము; దీని నుజ్జ్వలము సూ సకలావని: అమ్మహోజ్జ్వల
ద్ధామము కాంతిసేయని యతం డొకడేని యభాగ్యు డుండునే !

అది ప్రణయాగ్ని వేణువున నంత మహాచ్ఛవి వెల్గునట్టి; దీ
యది యనురాగ రాగ మిట నాసవమందు ఫలించునట్టి; దీ
మదిరయె మాయెడందలకు మందగు ; నీ మురళీరవాళియే
మొదలమునుంగులన్ చిరుగనేసిన శస్త్రపరంపరల్ జుమీ

విరహాము సహించును, దయా
స్వరూపమయి తానె తాపశమన మొనర్చున్,
గరళమగు, నమృతమయమగు
మురళియె, వివిధములు చిత్రములు దీనిగతుల్.

విరహ ఛురికాకృత వ్రణావిలములైన
తప్త హృదయాల ననవరతమ్ము జారు
ప్రేమరక్తాంకితపథాల వేడుకలును,
మాన్యుడౌ మజను ప్రణయోన్మాదకథలు
వేణు వాలపించు నిపుడు వినుడు సఖులు.

శీఘ్రగామి కాలమని ప్రసిద్ధికాని
మాయెడ నదేలనో కాల మాగుణమ్ము
మానె; దీర్ఘమై యేనాటికైన తరుగు
నా యిది ? తరింపగలన జన్మ యనిపించు.

మైత్రి కుదిరించు కొనెనేమొ మాదినాలు
కరము గీలించి తిరుగు శోకమ్ముతోడ ;
కడచిపోనిమ్ము శోకమున్, కాలము, మరి
సర్వ ముండుడు నీ వదే చాలు మాకు.

ఎన్నినా ళ్లిట్లు బానిసవృత్తి నీకు
పై మెరుగుల జూపెడు వెండి బంగరులకు

త్రెంచివేయు మాయాభవ చ్ఛృంఖలాల
తల ధరింపు కుమార! స్వాతంత్ర్యమాల.

స్వాగతము నీకు ప్రణయమా! స్వాగతమ్ము
కోటిలాభాల మాకెప్డు కూర్తు వీవు
ఔషధము వీవె మాసర్వ వ్యాధులకును
మాడురాళకు గర్వ డంబమ్ములకును.

ఐహికకాయమ్ము వైహాయసపథాల
స్వైరయాన మొనర్చె ప్రణయమహిమగాదె
జడప్రకృతియుగూడ చైతన్యమొందె సి
నాయిమహీధ్ర ప్రణయలాస్యములలోన.

అస్మదనుభావశాలి శోణాధరాల
నీవలె తగిలియుంటినా నేనుకూడ
హృదయమున రేగు భావాల నెల్ల మధుర
ప్రణయగీతాల గొంతెత్తి పాడివైతు.

ఇప్పుడో నే నొకప్రవాసి నిచట నేను
మాటలాడుభాష యవగతమ్మగు నెవరికి ?
ఏను మూగనైపోయినా నెన్నిపాట
లెంత స్వాదుకంఠము గల్గి యేమి ఫలము ?

రెక్కలేలేని పక్కినై స్రుక్కిపోదు
ప్రేమదేవత నను విస్మరించెనేని
యొక్క క్షణమేని గడచును యుగమువోలె
నశ్వరంబయ్యు కాల మనంతమగును.

నా జీవితేశ్వరు తేజఃస్వరూప
మన్నిదిక్కులయందు స న్నావరించె
కానియెడల నెట్లు కల్గె నాకుగల
జ్ఞానమును స్మృతియు చైతన్యశోభ.

ఈవిశ్వరాహస్య వృత్తాంతమెల్ల
ప్రణయమంత్రము గోరు ప్రకటింపబడగ
అది యేమి దౌర్భాగ్య మందురో ప్రతిఫ
లింప దొకింత యీ హృదయదర్పణము.

# పారిశ్రామిక తత్వము

ఎమ్. ఎన్. సాహా

[నేను చాలకాలంనుంచి, భారతదేశ దారిద్ర్యము తగ్గుటకు, నిరుద్యోగసమస్య నివారణఅగుటకు విపుల పారిశ్రామికాభివృద్ధి (Large scale industrialisation) ఒక్కటే ఉపాయమని చెప్పుతున్నాను. దీనినిగురించి చాలామంది సరిగా అర్థంచేసుకొన్నట్లు తోచదు. కొంతమంది సంపూర్ణ పారిశ్రామికాభివృద్ధి ధనపిశాచానికి దారితీస్తుందని భయపడుతున్నారు. మరికొంతమంది నిరుద్యోగసమస్యను పరిష్కరించుటకు మారుగా నిరుద్యోగుల సెక్కువచేస్తుందని అనుమానిస్తున్నారు. ఇప్పటికి జరిగిన పారిశ్రామికపరివర్తనమే ఆధ్యాత్మికతత్వాన్ని నాశనంచేసిందని భయపడుతున్నారు కొంతమంది. ఈ అపోహాలన్నీ పోవుటకు ఈ వ్యాసాన్ని ప్రకటిస్తున్నాను.]

మహాత్మగాంధి రౌండుటేబుల్ కాన్ఫరెన్సుకు లండను వెళ్లినపుడు ప్రపంచవిఖ్యాత సినీమానటుడు చార్లీ చాప్లిన్ అతనిని దర్శింపవచ్చెను చార్లీ మహాత్మ నిట్లు ప్రశ్నించెను: “మీరు పారిశ్రామికాభివృద్ధికి ప్రతికూలురని, మీదేశపు ప్రజలను గ్రామాలలో చేతిపనులు చేసుకొంటూ సామాన్య జీవితం గడపమని మీరు సలహా ఇస్తున్నారని వింటున్నాను. ఆధునిక ప్రపంచానికి చాలా వెనుకబడిన జీవితతత్వాన్ని ఎందుకు ఉపదేశిస్తున్నారో తెలుసుకొనవచ్చునా?”[1] చార్లీ ఎవరో తెలియనటువంటి (అని చెప్పకోవడం) గాంధిగారు ఈ ప్రశ్నకు చాలా ఆశ్చర్య పడ్డారు. ఇట్లు చెప్పేరు వారు: “భారతదేశంలో నూటికి ౯౦ మంది దుర్భరదారిద్ర్యములో బాధపడుతున్నారు. యంత్రపరిశ్రమలు వచ్చి చాలవృత్తులను చెడగొట్టేయి. ముఖ్యంగా సాలెవాళ్లు నిరుద్యోగు లయ్యారు. యంత్రములు తీసివేసి, వడుకుట, నేయుట మొదలగు చేతిపనులు పునరుద్ధరిస్తే లక్షలకొలది నిరుద్యోగులకు వృత్తి ఏర్పడతాయి. జనులు సుఖపడతారు.” తరువాత చేతిపనుల నైతికప్రాశస్త్యాన్నిగురించి కొంత చెప్పేరు. చార్లీ మళ్లీ అన్నాడు: “మీదేశంలో బీదరికంతో బాధపడేప్రజలకు ప్రభుత్వం ఏమాత్రము సాయము చేయదు. వాళ్ల బీదరికానికి నిరుద్యోగానికి కారణం వాళ్లచేతిపనులు యంత్రపరిశ్రమల పోటీకి ఆగలేకపోవడమే. కాని ప్రభుత్వమే, ఆధునిక పద్ధతులమీద పరిశ్రమలను నిర్మించి, వారికి ఆహారం, దుస్తులు, గృహోపకరణాలు, నాగరికతా ప్రపంచసౌఖ్యాలు లభించేటట్టు చేస్తుం దనుకోనండి. అప్పటికీ మీరు పారిశ్రామికాభివృద్ధికి ప్రతికూలురుగా ఉంటారా? ఇంకనూ ప్రాచీనపద్ధతులతో వస్తూత్పత్తి చేస్తూ, ప్రాచీననాగరికతే కావా లంటారా?” అని. కాని ఆసమయంలో గాంధిగారు దానికి తగినసమాధానం ఇచ్చినట్లు తోచదు. ఈ ప్రశ్నే ప్రస్తుతం ప్రభుత్వం నడుపుతూన్నటువంటి అనేకమంది కాంగ్రెసు నాయకుల నడిగేను. ఎవరూ తృప్తికరమగు సమాధానం ఇయ్యలేదు. పదవులు స్వీకరించిన నాయకులు, బయట పనిచేస్తూన్నవారు చెప్పుతూన్న మాటలనుబట్టి చేస్తూన్న పనులనుబట్టి చూస్తే జాతీయపునర్నిర్మాణానికి తగినంత సిద్ధాంతప్రణాళిక వారిదగ్గర లేదేమో అని పిస్తోంది. అందుచేత రాట్నం, చేతిమగ్గాలు ప్రవేశపెట్టి జాతీయ పునర్నిర్మాణం చెయ్యాలని వా రంటున్నారు. జమీందారీపద్ధతి, దళారీజేరగాండ్లు పోవాలని, చవకగా విద్యుచ్ఛక్తి గ్రిడ్ పద్ధతి ననుసరించి చిన్న ప్రవాహాల్లోంచి తీసి గ్రామాలకు

1. I am quoting from memory from the account of Charlie Chaplin's visit to the Mahatma. I believe that I have not mis-stated any thing.

ప్రస్తి చెయ్యాలని చెపుతున్నారు. కాని గ్రిడ్ పద్ధతంటే ఎంత క్లిష్టమైన నిర్మాణంతో కూడినపనో, అది జయప్రదంగా నెరవేరాలంటే, ఎంతమంది ఆర్థికవేత్తల, పెట్టుబడిదార్ల, పారిశ్రామికనిపుణుల సాయం అవసరమో గుర్తించినట్లు కనబడదు. ఇప్పుడు ప్రభుత్వం నడుపుతూన్న వారల మాటలనుబట్టి చూస్తే గతయుద్ధసందర్భంలో, శెనారస్ యూనివర్సిటీని రంగులపరిశ్రమ (ani'ine dyes) నిర్వహించవలసినదిగా తీర్మానింపజేసిన ఒక 'లిబరల్' రాజ్యాంగవేత్త జ్ఞప్తికి వస్తున్నాడు. మనకు డిబేటింగ్ సొసైటీ తీర్మానించినంతమాత్రాన పరిశ్రమ నిర్వహించబడదని మనకు తెలియును. కొత్తగా అధికారపదవులలోకి వచ్చినవారి మాటలవల్ల కూడా ఆ ప్లైపని జరుగదు. వార్తాపత్రికల సాయావిడే కాని మనకు తెలిసినంతవఱకు కాంగ్రెసు, కాంగ్రెసేతరరాష్ట్రాలలో కూడ, దీనివిగురించి తీవ్రప్రయత్నాలేమీ జరుగుతూన్నట్లు తోచదు. జాతీయపునర్నిర్మాణం కార్యరూపం దాల్చడానికి అవసరమైన సిద్ధాంతప్రణాళిక సామగ్రి మనకు లేదు. ఇట్టిసంస్కరణలు కార్యరూపం దాల్చడానికి అధికారుల (High command) చేతిలో స్పష్టంగా నిర్ణయింపబడిన కార్యప్రణాళిక ఉండాలి. కేవల తీర్మానాలవలన లాభంలేదు. తీవ్ర ప్రయత్నాలు అవసరం. కేంద్రంలో భారతప్రజలకు బాధ్యతగల ప్రభుత్వం ఏర్పడనిదే ఇట్టివి సంపూర్ణంగా నెరవేరడానికి వీలులేదు. కాని ఇప్పుడున్న అధికారాలతోనే రాష్ట్రీయప్రభుత్వాలు యీ పెద్ద కార్యానికి పూర్వసన్నాహాలు చేసుకోవడం, కొన్ని కొన్ని పనులు చేయడంకూడ జరగవచ్చును. చార్లీచాప్లిన్ గాంధిగారి నడిగినప్రశ్న సంగతి చూద్దాం. గ్రామపునర్నిర్మాణం, చేతిపనులను పునరుద్ధరించడం, ఉన్న వాటికి చేయూత ఇవ్వడం మొదలగునవి గ్రామాలను కొద్దిగా చక్క బరచవచ్చును. కాని అంతగా బాగుచేయలేవని నానమ్మకం. ఇందుకు కారణాలు చాలా ఉన్నాయి. వాటిలో కొన్నిటిని ఇచ్చట ఉదాహరిస్తాను: "భారతదేశంలో ఎక్కువమందికి వ్యవసాయమే జీవనోపాయము. ౧౯౩౧-వ సంవత్సరం లెక్కలనుబట్టి చూస్తే నూటికి ౭౭ మంది వ్యవసాయంలో పనిచేస్తున్నారు. వాళ్లపని ఆహారము ఉత్పత్తిచెయ్యడం అన్నమాట. మిగిలిన ౩౮ గురిలో ౧౧ గురు మాత్రమే నగరవాసులు – పరిశ్రమలలోను, వృత్తులలోను పని చేస్తుంటారు. మిగిలిన ౨౩గ్గురు వర్తకులుగాను, భూస్వాములుగాను, గ్రామవృత్తులు చేసుకొనేవారుగాను, ఇతరవిధాల గ్రామాలమీద వచ్చే ఆర్థికసంపదమీద ఆధారపడి జీవించేవారుగను ఉన్నారు. ఈ హెచ్చుతగ్గులనుబట్టి చూస్తే ఏవృత్తికి తగినంతమంది ఆవృత్తిలో పనిచేయుట లేదని తెలుస్తుంది. చైనావంటి వెనకబడిన దేశాలల్లో తప్ప, ప్రపంచంలో ఏదేశంలోను ఇంత మందిరైతులు లేరు. ఈ రైతులకైనా సుఖజీవనం జరుగుతున్నదా అంటే — కిటికీలులేని మట్టిగుడిసెలు, చిరిగిపోయిన దుస్తులు, చింకిచాపలు, బక్కపశువులు— ఇదే వీరిసంపద. ఆకలిబాధ, ఋణబాధ, అంటురోగాలు ఇవి వారిసౌభాగ్యాలు. రైతులస్థితిని బాగుచేద్దామనీ, వీరిజీవితప్రమాణం హెచ్చిద్దామనీ అనేకమంది యత్నిస్తున్నారు. ఇది ఎల్లా నెరవేరుతుంది? ఇదే పెద్ద సమస్య. పట్నాలనుంచి జనులు గ్రామాలకు పోతే కాదు; పట్నాలలోని నిరుద్యోగసమస్యతో బాధపడలేక కొంతమంది చెప్పినట్లు చదువుకున్నవాళ్లంతా గ్రామాలకు మరలితే యీపని జరుగదు. ఇప్పటికే గ్రామ్యవృత్తులమీద వచ్చేఆదాయం చాలక నిరుద్యోగంతోను, దారిద్ర్యంతోను బాధపడుతూన్నటువంటి పల్లెటూళ్లకు ఎక్కువ ఒత్తిడి కలుగజేసి వారి దారిద్ర్యాన్ని ఇనుమడింపజేస్తాము. వ్యవసాయాన్ని నవీన పద్ధతులమీద నడిపిస్తే, జీవితావసరాలకు పదార్థాలను చవుక చెయ్యవచ్చు,'ఎక్కువగాకూడ పండించవచ్చును. ఇది మంచిపద్ధతే కాని ఇది గ్రామదారిద్ర్యాన్ని' నిరుద్యోగాన్ని ఎంతమాత్రము నివారించలేదు.

వ్యవసాయంలో నవీనశాస్త్రపద్ధతులు ఉపయోగిస్తే ఇపుడు పనిచేసేవాళ్లలో సగంకంటె ఎక్కువ మంది పనిచెయ్యనక్కరలేదు. ఇప్పుడు నూటికి ౭౭ మంది చాల ప్రాచీనపద్ధతులమీదను చాలప్రాచీన పరికరాలతోను ఉత్పత్తి చేస్తున్నారు. నవీనపరికరాలు (శాస్త్రీయపద్ధతులు) ప్రవేశపెడితే నూటికి ౩౦ మంది

తోనే దేశానికి సరిపడిన పదార్థాలకంటె ఎక్కువగా పండించవచ్చును; అంటే నూటికి ౩౬ గురికి పనిపోతుంది. అసలే ఉన్న నిరుద్యోగులస్థితిని మరీ హీనం చేస్తుంది. ఇప్పటికే జనసామాన్యంలో అసంతృప్తి ప్రబలిపోయింది.

ప్రతివానికి, ఇప్పటికంటె ఆరోగ్యప్రదమైన, సౌఖ్యప్రదమైన జీవితం గడపాలని ఉంది. ప్రతివాడు తనకు సరిపడినంతతిండి ఏవిధంగానైనా బాధ లేకుండా దొరకాలనుకుంటాడు. కాని ఇదో పెద్దకోరిక కాదు. పరిశుభ్రమగు దుస్తులు, తనకు తనకుటుంబానికి చక్కటిఇల్లు, మంచివిద్య, ఎక్కువ విశ్రాంతి, మంచివినోదాలు కావాలని కోరుతాడు. ఇది నెరవేరాలంటే ఇప్పటికంటె ౧౦ మొదలు ౨౦ రెట్లవరకు వస్తూత్పత్తి హెచ్చించాలి. పరిశ్రమలు పూర్ణంగా వృద్ధిచెందితేనేగాని ౨౦ రెట్లు ఉత్పత్తి చేయలేము. ఈపనిఅంతా ఒకనియమబద్ధమైన పద్ధతి ననుసరించి జరగాలి. గ్రామాల్లో పనిచేస్తున్న వాళ్లలో సగంమంది నగరాలకు పోయి పరిశ్రమలలో పని చెయ్యాలి; అంటే గ్రామాలను బాగుచెయ్యడానికి చాలమంది జనులు పట్నాలకి పోయి పరిశ్రమలను హెచ్చించాలి. పట్నాలు, నగరాలు విరివిగా పెరగాలి.

పైనిచెప్పిన సంగతులలో విపులపారిశ్రామికాభివృద్ధి ఎందుకు అవసరమో సూత్రంగా చెప్పేము. అది నెరవేరడం ఎట్లో తెలుసుకుందాం. పరిశ్రమ అనేపదానికి సంపూర్ణార్థం తీసుకొంటే నాగరికతా ప్రపంచంకోసం ఒకనియమపద్ధతిప్రకారం జరుగుతూన్న వస్తూత్పత్తి యని యర్థము. ఆటవస్తువులు, ఆహారపదార్థాలు, దుస్తులు, మందులు, రాసాయనిక సామగ్రి, ఆయుధసామగ్రి, గృహోపకరణాలు, వినోదానికి సంబంధించిన ఉపకరణాలు, మనుష్యునియొక్క జీవితావసరాలు మొదలయినవి అతడు వసించియున్న యుగాన్నిపట్టి అప్పటివిజ్ఞానమునుపట్టి ఉన్నాయి. ఆదిమ యుగపుమానవున కాహారసంపాదన, ఆత్మసంరక్షణ తప్ప వేరేపని లేదు. ఆతడు గ్రామాల్లోను పట్టణాల్లోను స్థిరపడేటప్పటికి అతనిజీవితావసరాలు పెరిగాయి. ధరించడానికి దుస్తులు, ఉండడానికి ఇల్లు, శత్రుసంహారణార్థమూ తన ఆస్తిని వాడుకునేందుకూ సంరక్షణోపాయాలు కావలసివచ్చినాయి. నాగరికతా విజ్ఞానం అభివృద్ధి చెందుతూన్నకొద్దీ అవసరాలు నెరవేరడం, వినోదాలు ఏర్పడడం సంభవించింది. ౨౦-వ శతాబ్ది మనుష్యునికి ౧౮-వ శతాబ్ది మనుష్యునికి, విజ్ఞానంలో నైతేనేం నాగరికతలోనైతేనేం ఎంతో వ్యత్యాసం ఉంది.

కొన్ని శతాబ్దులక్రిందట ప్రపంచ మంతటా, స్వర్ణయుగం వ్యాపించియుండేదనీ, జనులందరూ విశేష సౌఖ్యాలను పొందుతూ, రోగ, దారిద్ర్య, అశాంతులు లేకుండా వుండేవారనీ అంటే విచక్షణగల విద్యావేత్త ఎవడూ నమ్మడు. ఇప్పటికి మిగిలియున్న వెనుకటి యుగపు పరిశేషాలను పరిశీలిస్తే మన మనుకొనేటట్టు అది స్వర్ణయుగంకాదనీ జనులు ఇప్పటికంటె ఎక్కువమంది, అన్నివిధాలా చాలా తక్కువస్థితిలో నుండేవారనీ తెలుస్తుంది. వారు రోగదారిద్ర్యాలతో చాల బాధపడుతూ ఉండినట్టు ఊహించగలం. కాని మానవుని జీవితచరిత్ర అంతటిలోను ఒకయుగంకంటె మరొక యుగంలో మానవాభివృద్ధి గోచరమవుతూంటుంది. ఒకదశలోకంటె మరొకదశలో వైజ్ఞానికాభివృద్ధి కనిపిస్తోంది. వ్యవస్థాబద్ధములైన సమష్టిప్రయత్నాలచేతను, నూతన యంత్రసామగ్రిచేతను మానవుడు తనజీవితంలో ఎక్కువ ఆనందం పొందగలిగేడు. ఆకలిమంట, రోగబాధ నశించడానికి తగినవసతు లేర్పడ్డాయి. శీతోష్ణపరిస్థితుల వ్యత్యాసం అతనిని బాధించలేదు. చరిత్రనుపట్టి చూస్తే ఏజాతైనా అభివృద్ధి చెందుతూవున్న జాతులతోపాటు తానుకూడా సమంగా రాలేకపోతే అది తన స్వాతంత్ర్యాన్ని వ్యక్తిత్వాన్ని త్వరలో కోల్పోతుంది. చరిత్రయందలి తన స్థానం భ్రష్టమైపోతుంది. అబిసీనియా ఇటలీక్రింద ఎందుకు నలిగిపోయింది? చైనా తనస్వాతంత్ర్యాన్ని ఎందుకు కోల్పోతోంది? వైజ్ఞానిక, పారిశ్రామిక అభివృద్ధి చెందిన దేశాలతోబాటు తాము అభివృద్ధి చెందలేకపోబట్టియే. శాస్త్రవేత్తలు మానవుడు పదార్థోత్పత్తి కుపయోగించే సాధనాలను పట్టి సాంస్కృతికయుగాలను (epochs of culture) విభజించేరు. అట్లు మనకు పాతరాతియుగంలో అనేక

తరహాలసాధనాలు కనిపిస్తాయి. శరీరసంరక్షణకు ఆహార సంపాదనకు మొద్దురాళ్లు ఉపయోగిస్తూండేవారు ఈ యుగంలో. అటుతర్వాత కొత్తరాతియుగం. ఇది రాళ్లను కోసుగా చెక్కి అనేకసాధనాలు తయారుచేసిన యుగం. తరువాత రాగియుగం. మనుష్యుడు మొదట ఉపయోగంలోనికి తెచ్చుకొన్న లోహం ఇదే. ప్రాచీన సుమేరియా, ఈజిప్టుదేశస్థులు రాగి వస్తువులను ఉపయోగించేవాళ్లు. సింధునదీప్రాంతపు మొదటి నాగరికజాతులుకూడ రాగితోనే వస్తువులు చేసుకొనేవారు. రాగియుగం తర్వాత కంచుయుగం వచ్చింది. మన్నికలోను, గట్టిలోను రాగికంటె కంచు మంచిది. గ్రీకులు, సింధుదేశస్థులు చాలకాలము రాగితోనే నగలు చేసుకొనేవారు. ఈయుగపరివర్తన అన్నిదేశాల లోను ఒక్కవిధంగా రాలేదు. కొన్నిటిలో కొంత ఆలస్యమైంది, కొన్నిటిలో కొంత ముందరైంది. ఇనుప యుగం అమెరికా మొదలగు కొత్తదేశాలలో కొంత ఆలస్యంగా వచ్చింది. స్పెయినుదేశస్థులు అమెరికాకు పోయినపుడు మంచి నాగరికతగల జాతులను అక్కడ చూసేరు. మెక్సికోలో పెరూలో "ఇన్కా"లు మంచిసామ్రాజ్యాలు స్థాపించుకొని ఉన్నారు. కాని వాళ్లకు రాగిసాధనాలుమాత్ర ముండేవి. పెంపుడు జంతువులు ఆట్టే లేవు. కొద్దిగా ఒంటెలుమాత్ర ముండేవి. క్రీ. పూ. ౧౨౦౦ తర్వాత ఇనుపయుగం వచ్చింది. ఆ యుగంలోనే మన మున్నాము. మనపరికరాలన్నీ ఇనుముతోను, ఉక్కుతోను తయారు చేయబడు తున్నాయి కాని ప్రాచీన ఇనుపయుగానికీ, శాస్త్రీయ రచనానైపుణ్యం కావలసిన నేటి ఇనుపయుగానికీ ఎన్నో రెట్లు తేడా ఉంది. న్యాయంచేత దీనికి వేరే పేరు పెట్టాలి. చరిత్ర జాగ్రత్తగా చదువుతే తక్కువరకం ఉపకరణాలుకలవాడు అంతకంటె ఎక్కువ శాస్త్రీయనైపుణ్యంగల ఉపకరణాలుగలవానికి లొంగిపోవుట మనం తెలిసికోగలము. మెక్సికోలోని అజ్టెక్కుల గాథ ఈ సంగతిని ధృవపరుస్తోంది. గుఱ్ఱపుదళం తోను, కత్తులతోను, తుపాకులతోను వెళ్లిన స్పెయిను దేశీయులకు, మంచి శిక్షణగల్గిన, యుద్ధనైపుణ్యం ధైర్యసాహసాలు కల అజ్టెక్కులు ఓడిపోయారు. ఎందుచేత? వారి యుద్ధసామగ్రి, బాకులు, కత్తులు రాగితో చేయబడినవి. వారికి గుఱ్ఱాలు లేవు; తుపాకులు లేవు. కావున చరిత్రవలన మనము నేర్చుకొనవలసిన పాఠము: పారిశ్రామిక పద్ధతిలో ఎప్పటి కప్పు డేర్పడు తూన్న కొత్తపద్ధతులను అవలంబించక పోయినట్టయితే, అంతకంటె ఉత్తమ విశిష్ట శాస్త్రీయ పద్ధతులు గల్గిన జాతితో పోరాటం సంభవించినపుడు ఏజాతికాని తన స్వాతంత్ర్యాన్ని నిలుపుకోలేదు.

పారిశ్రామిక ఉత్పత్తివిషయంలో ప్రపంచం లోని అభివృద్ధిచెందిన దేశాలు నేడు ఉపయోగిస్తున్న 'టెక్నిక్కు'కు, వెనకటి ఇనపయుగం 'టెక్నిక్కు'కు ఎంతమాత్రము సంబంధము లేదు. వైజ్ఞానికదృష్టిలో పాతఇనుపయుగం తరువాతిదశగా దీనిని పరిగణించ డానికి వీలులేదు. ఈ యుగము మానవుని జీవనతత్వం లోనే అపూర్వమైన కొత్తదశ తీసుకొని వచ్చింది. ఈ యుగాన్ని 'నియో టెక్నిక్ ఏజ్' (Neo-technique age) అనిన్నీ, దీనికి పూర్వఘట్టమైన ౧౯, ౧౮ శతాబ్దులనాటిదానిని, 'పాలియో టెక్నిక్ ఏజ్' (Paleo-technique age) అనిన్నీ అంటారు. దీనిని కొంతమంది మూడవవిప్లవముగా పరిగణిస్తారు. పారిశ్రామికవిప్లవము దీనికి కేవలం ప్రారంభదశమాత్రమే. శాస్త్రాభివృద్ధివలన శాస్త్రీయపద్ధతులు జీవితంలోని ప్రతి అంశానికి సమన్వయపరచడంవల్ల, ఇప్పుడున్న స్థితికంటె అనేకరెట్లు ముందుకు పోగలమనే దృఢనమ్మకంతో ఉన్నాము మనం. కనుక దీనిని శాస్త్రయుగ మనుట మంచిది. శాస్త్రాభివృద్ధివల్ల, ఆనంద, సౌఖ్యమయమైన జీవితాన్ని సృష్టించగల మని ధైర్యముంది. అభివృద్ధే ఆదర్శంగాగల యీ యుగానికి సర్వము ఊహాసౌధాల్లో అనుభవిస్తూ మతముపిచ్చితో నిండియున్న గత శతాబ్దికి ఎంతో వ్యత్యాస ముంది.

మనం ఆధునిక యుగంలోని అభివృద్ధినిగురించి తెలుసుకొనవలెనంటే అమెరికా, జర్మనీ, ఇంగ్లండు మొదలగు దేశాలలోని పారిశ్రామికాభివృద్ధిని గమనించాలి. ఇప్పటి ఉత్పత్తివిధానం, దాని ననుసరించిన ప్రజల సాంఘికజీవితం పరిశీలిస్తే ౧, ౨ శతాబ్దులకంటెయూ శతాబ్దియొక్క విశిష్టత్వం బోధపడుతుంది. రెండు శతా

బ్బులకు పూర్వము కూలీ లందరు వృత్తిసంఘాలుగా ఏర్పడేవారు. ఉ॥ రైతులు, వడ్రంగులు, కుమ్మరులు, సాలీలు, పల్లెవాళ్లు మొదలగువారు. ఈవృత్తి వంశపారంపర్యంగా తండ్రినుండి కొడుకుకు వస్తూండేది. వృత్తి రహస్యాలు, తండ్రీ కొడుకులకే తెలిసిఉండేవి. పని చాలమట్టుకు కొద్దివ్యక్తుల చేతులలోనే ఉండేది; లేదా కుటుంబంలోనివా ళ్లందరు కలసి సంఘంగా పనిచేసేవారు. మొత్తంమీద దేశంలో ఏగ్రామాని కాగ్రామం, ఏభాగాని కాభాగం స్వయంపోషకంగా ఉండేది. ఆహారపదార్థాలు, దుస్తులు, గృహోపకరణాలు చాల మట్టుకు ఎక్కడికక్కడే తయారు చేసుకొనేవారు. ఆప్రాంతాలలో దొరకనివిమాత్రము దిగుమతిచేసుకొనేవారు. వీనిలో కొద్దిపాటి వ్యవస్థ (Organisation)మాత్ర ముండేది. విదేశవ్యాపారం చేసుకొనే వర్తకులు, గనులలో రసాయనద్రవ్యాలు, లోహాలు త్రవ్వేచోటమాత్రం వ్యవస్థ ఉండేది. వారికి తెలిసిన ఆరోగ్యశాస్త్రాదులుకూడ చాల తక్కువ.

ఎంతసేపూ మానవజీవితంలోని భౌతికతత్వాన్ని గుఱించే చర్చిస్తున్నా మనుకొనవచ్చును. వేదాంత చర్చలలో మునిగి తేలే మహర్షులుకూడ పారిశ్రామిక వస్తూత్పత్తియందు చాల జాగ్రత్తపడేవా రంటే మీ కాశ్చర్యము కలుగుతుంది. హిందూదేశంలో వృత్తి సంఘాలే కులాలుగా మారేయి. ఈ వృత్తులు మానేసుకొన్నా, స్వతంత్రవృత్తులు చేసుకొన్నా పెద్దలు నరకం వస్తుందని భయ పెట్టేరు. దీనికి అనుగుణంగా చాలపురాణాలు వ్రాసేరు. అట్లు వృత్తులు మానేసినవారికి మతాధికారులు శిక్షలు విధిస్తూండేవారు. ఇతరదేశాలల్లో వంశపారంపర్యంగా వచ్చేవృత్తులను బహుకొద్దిమందే వదలివేసేవారు కాని వాళ్లవృత్తినియమోల్లంఘనకు మతసంబంధమైన శిక్షలు లేవు. ౧౮-వ శతాబ్దినాటికి శాస్త్రాభివృద్ధి, నూతనవిజ్ఞానం పాశ్చాత్యదేశాలలోని పారిశ్రామికోత్పత్తి విధానాన్నంతనీ మార్చేసింది. దానితోపాటు జీవితవిధానం, వృత్తులపద్ధతీ అంతా మారిపోయింది. ఆవిరితోను, విద్యుచ్ఛక్తితోను, పెట్రోలు మొదలగు నూనెలతోను ఇంజనులను నడుపుతున్నారు. దీనినిగురించి కొంత తెలిసికొందాం. ఇప్పుడు మనకు కావలసినవస్తువులు, బట్టలు, మందులు, ఆయుధాలు ఒకటేమిటి, అన్నీకూడ యంత్రాలవల్ల తయారవుతున్నాయి. పాలియో 'టెక్నిక్' విధానాన్ని బట్టికంటె (గత ౧, ౨ శతాబ్దులనాటి పారిశ్రామికోత్పత్తి విధానం) అనేక రెట్లు ఎక్కువగాను, అనేక ఇంతలు ఎక్కువగాను ఉత్పత్తి చేస్తున్నారు. ౨, ౩ శతాబ్దులక్రితం రాజులకు మాత్రమే లభ్యమయ్యేభోగాలు, సామాన్యమానవునికి నేడు అనువుగాఉన్నాయి. వేలకొలది మైళ్లప్రయాణంకూడ అతిసునాయసంగాను, అతిహాయిగాను ఉంటోంది. అది వివిధదేశాలలో ఉండే వివిధజాతుల మనుష్యుల సౌహార్దానికి, పరస్పరాభివృద్ధికి కారణమయింది. ప్రపంచంలోని మారుమూలదేశాల్లోని వస్తువులుగూడ ప్రతిదేశానికి సులువుగా అందుబాటులోనికి వచ్చేయి. ఇంగ్లండు మొదలగు దేశాలల్లో పల్లెజీవితం నానాటికి తగ్గిపోతూన్నది. అన్నీ నగరాలక్రిందా నగరపరిసరాలక్రిందా మారిపోతున్నాయి. ఈకొత్తపద్ధతి అప్పుడే ప్రపంచం అంతటా వ్యాపించిపోయింది.

ఈ కొత్తపద్ధతులవలన దేశాలు కొత్తబాధ్యతలు నెరవేర్చవలసిన అవసరం ఏర్పడింది. నేటిమానవుని అవసరాలు మునుపటికంటె చాలరెట్లు పెరిగిపోయేయి. అందుచేత మునుపటికంటె అనేకరెట్లు ఎక్కువపని చేయవలసివస్తోంది. ఆధునిక పారిశ్రామిక పద్ధతి (Neo-technique) అవలంబించిన దేశాలలో సగటునప్రతివాడు ౧,౮౦౦యూనిట్లపని చేయవలసివస్తోంది. కాని వస్తూత్పత్తివిధానంలో జంతువులను, ప్రాచీనపు పనిముట్లనుఉపయోగిస్తే ౬౦ యూనిట్లపనికంటె ఎక్కువ చేయలేము. నేటి వైజ్ఞానికయుగమందలి మనుష్యుడు, అనాగరికపు మనుష్యునికంటె ౨౦ రెట్లు ఎక్కువపని చేయవలసి వస్తోంది. శాస్త్రాభివృద్ధిగల దేశాలలో ఈ శక్తి ప్రకృతిశక్తులను బొగ్గు, చమురులు, జలపాతశక్తి మొదలగు సాధనాలచే వశపరచుకొనడంవలన జరుగుతోంది. అలంకారికంగా చెప్పవలసివస్తే ఇలా చెప్పవచ్చు.

శాస్త్రవిజ్ఞానం గల నేటి పాశ్చాత్యుడు తన కిప్పుడు పనిచేయుటకు ౨౦ మంది బానిసలను సంపాదించుకొన్నా డన్నమాట. శాస్త్రజ్ఞానంలో వెనుకబడ్డ

ప్రాచ్యదేశీయులుమాత్రము ప్రాచీనపద్ధతు లవలంబించి, మానవశక్తిమీద జంతుశక్తిమీదమాత్రమే ఆధారపడి యున్నారు. వీనివల్ల జరిగేపని ఒకకూలీ (కానిస) పనికంటె ఎక్కువ ఉండదు.

శక్త్యుపాయములనబడే శక్తులు (Power resources) వినియోగంలోనికి తీసుకొనివచ్చుటకు, పారిశ్రామికోత్పత్తి సక్రమంగా నడిపించుటకు నేటిప్రభుత్వాలు చాలాబాధ్యతలు తలమీద పెట్టుకొనవలసి వచ్చింది. శక్త్యుపాయాలు వినియోగంలోనికి తీసుకరావడం, పరిశ్రమలను వృద్ధిచేయడం అనేది మొదట వ్యక్తులు తమలాభాలకోసం చేస్తూన్నా ఇప్పుడు ప్రభుత్వాలు వాట్లబాధ్యత వహించవలసివస్తోంది.

ఇంగ్లండులాంటి దేశాలలో, ఈ పనిపంపకం, శక్త్యుపాయాలను ఉపయోగంలోనికి తీసుకొనిరావడం ప్రభుత్వ మెట్లు నియమిస్తోందో చూదాం.

ఇంగ్లండు ప్రభుత్వం గ్రిడ్ సిస్టంద్వారా విద్యుచ్ఛక్తిఉత్పత్తి నంతను తాను నియామకంచేస్తోంది. దానికోసం కొంతమంది విద్యుచ్ఛక్తికమీషనర్ల నియోగించింది. మోటారుకార్లు, ఓడఇంజన్లు నడపడానికి ద్రవరూపమను ఇంధనం కావాలి. వీట్లకి ఇంగ్లండు ఇతరదేశాలమీద ఆధారపడాలి. ఇవి ప్రస్తుతం సరఫరా అవుతున్నా, యుద్ధం వస్తేమాత్రం ఆ సప్లై ఆగిపోతుంది. కావున బ్రిటిషుప్రభుత్వం ద్రవరూపమైన ఇంధనం తయారుచేయించడంకోసం చాలడబ్బు ఖర్చు పెట్టుతోంది. కొన్నికంపెనీలకు చాల ధనసహాయం చేస్తోంది. దానివలన ప్రభుత్వానికి నష్టమొస్తున్నా అల్లా చెయ్యక తప్పదాయెను. ఇంగ్లండుకు శక్త్యుత్పాదకోపాయం బొగ్గు ఒక్కటే. జలశక్తివలన వచ్చే యంత్రశక్తి ఏమీ లేదు. ఇంగ్లండులో నేలబొగ్గు తగ్గిపోతే దానిపరిశ్రమలన్నీ పడుకోవలసిందే. అందుచేత ప్రభుత్వం నేలబొగ్గును చాల జాగ్రత్తగా వాడుకుంటూ అదేమీ వ్యర్థంకాకుండా ఉండడానికి ఇంధననియమాలూ, పరిశోధకసంస్థలూ (Fuel control and research Boards) స్థాపించింది. అందుచేత నేలబొగ్గును తయారుచేసిన సరుకు (manufactured goods)గా చూచుకుంటూ, దానివలనవచ్చిన ప్రతికాలరీ శక్తిని (every caloric of energy) జాగ్రత్తగా వాడుకొంటోంది.

శక్తిపరిశ్రమ (పవర్ ఇండస్ట్రీ) అన్నిపరిశ్రమలకు ప్రధానమైనది. మిగిలిన పరిశ్రమలుకూడ ఎప్పటి కప్పుడు శాస్త్రపరిశోధనవలన తేలిన కొత్తపద్ధతులద్వారా అభివృద్ధిచేసిన నేతప్ప అవి మిగిలిన పరిశ్రమలపోటీకి ఆగలేవు. కాని పోటీనుండి రక్షించుచుండుటకు వస్తువులను చవకగా బాగుగా తయారుచేస్తూండాలి. ప్రభుత్వం పారిశ్రామిక, శాస్త్రీయ పరిశోధక సంస్థలను నెలకొల్పి ఇందుకు సాయపడుతోంది. ఎప్పటి కప్పుడు పాత పరిశ్రమలలోని లోపాలను దిద్దుకొనడం, కొత్తపద్ధతులు ప్రవేశపెట్టడం, నూతనపరిశ్రమలను కనిపెట్టడం — ఇవి పరిశోధకసంస్థలపని. ఇదిగాక పెద్దపెద్దకంపెనీలు ప్రత్యేకంగా పరిశోధకులను నియమించి పరిశోధనలను చేయిస్తూంటాయి.

పైచెప్పిన సంగతులవలన ఉత్పాదనచేయడంలో నవీనయుగపు 'నియో టెక్నిక్' పద్ధతులవల్ల తయారైన సరకు 'పాలియో టెక్నిక్' పూర్వపుపద్ధతులకల్ల కంటె ఎన్నిరెట్లు అభివృద్ధికరంగా ఉంటుందో కొంతవరకు తెలుస్తుంది. ఈ పూర్వపు 'పాలియోటెక్నిక్'పద్ధతే మననాయకులు అవలంబించమంటున్నారు. ఆజ్ టెక్కులు స్పెయినుదేశీయుల ముందర పనికిరానట్లే 'పాలియో టెక్నిక్' మనుష్యులు 'నియోటెక్నిక్' మనుష్యులవద్ద పనికిరారు. సాహసికులైనవ్యక్తులు ఇంగ్లాండు, ఫ్రాన్సు, జర్మనీ, అమెరికా మొదలగు దేశాలలోని పరిశ్రమలను 'నియోటెక్నిక్' పద్ధతులద్వారా అభివృద్ధిచేశారు. కావున ప్రభుత్వం పని చాలా సులకనైంది. ఆకంపెనీలకు శాస్త్రీయపరిశోధక సంస్థలద్వారా సాయంచెయ్యడం 'పాలియోటెక్నిక్'పద్ధతులలోఉన్న యంత్రములను 'నియోటెక్నిక్' పద్ధతులకు మార్చడంమాత్రమే ప్రభుత్వం చేసేసహాయం. వెనుకబడిన రష్యా, జపాను దేశాలలోమాత్రము ఇంతమాత్రము చాలదు. గాటలా లో, అభివృద్ధి చెందాలంటే జపాన్ తాను 'నియో టెక్నిక్' పద్ధతు లవలంబించాలని నిర్ణయించుకొంది. ఈ పని దూరదృష్టిగల నాయకుల ప్రోత్సాహం, పట్టుదల, ప్రభుత్వసహా

యములవల్ల నెరవేరింది. కాని జపాన్‌మాత్రము గృహపరిశ్రమలలో కొంతవరకు శాస్త్రీయపద్ధతు లవలంబించి తన ప్రాచీన జీవితాన్ని కొంతవరకు నిలుపుకుంది. గ్రామాలకు విద్యుచ్ఛక్తి సరఫరా చేయుటవలన, ఆధునిక యంత్రాలలో అక్కడ పనిచెయ్యడానికి వీలవుతోంది. ముడిసరకులు సప్లై చేయడం తయారైనవస్తువులకు మార్కెట్టు చూపించడం మొదలగు పనులకు ప్రభుత్వం చేయూత ఇచ్చింది. అందుచేత జపాన్ శ్రామికులకు కష్టమునకు తగినట్టు కిట్టుబాటు అవుతోంది. జపాన్ సాలీ విద్యుచ్ఛక్తిచే నడపబడే 'టోయాడా'మగ్గం మీద నేస్తూంటాడు. భారతదేశపు శ్రామికుడు చేసేదానికంటె ౧౦, ౧౨ రెట్లు ఎక్కువ ఉత్పత్తి చేస్తూంటాడు. జపాన్‌లో తయారైన వస్తువులలో సగానికి పైగా గ్రామాల్లోంచి వస్తున్నాయి. ప్రస్తుతం మనకళ్లముందర రష్యా బ్రహ్మాండమైన ప్రయత్నాలవలన 'పాలియో టెక్నిక్' పద్ధతులలోనుంచి 'నియో టెక్నిక్' పద్ధతులలోనికి మారిపోయింది. నవీనపద్ధతులద్వారా దేశపు ఆర్థికసంపత్తిని వృద్ధిచేసుకొనలేకపోవుటవల్లనే జారుప్రభుత్వం కూలిపోయింది. జారుప్రభుత్వం చాలవరకు విదేశపు పెట్టుబడిమీద విదేశనిపుణులమీద ఆధారపడియుండేది.

ఆధునికపద్ధతుల ననుసరించి ఉత్పత్తి వృద్ధిచేసుకొనుట, తదనుగుణంగా సాంఘిక రాజకీయపరిస్థితులు చక్కబరచుకొనుట లేకపోవుటవలన మనకళ్లముందరే అనేకదేశాలు పతనాన్ని పొందుతున్నాయి. అబిసీనియా, చైనాలు ఇందుకు మంచిఉదాహరణాలు. అందుచేతనే పారిశ్రామికాభివృద్ధి కింత ప్రాధాన్యం కలిగింది.

కావున హిందూదేశనాయకులు తక్షణం పూనుకొని 'నియో టెక్నిక్'పద్ధతులద్వారా పరిశ్రమలను అభివృద్ధి చెయ్యాలి. రష్యా, అమెరికాలకుతప్ప ప్రపంచంలో మరేదేశానికి భారతదేశానికి ఉన్నన్ని పారిశ్రామికాభివృద్ధిసౌకర్యాలు లేవు. 'పవర్'(Power), లోహములు, రసాయనద్రవ్యములు, వ్యవసాయపుభూమి, పంటలు,— అన్నీ ఉన్నాయి. అందుచేత భారతదేశం సులువుగా 'నియో టెక్నిక్' ఉత్పత్తివిధానం అవలంబించవచ్చును. నాయకుల ప్రోత్సాహం, ప్రభుత్వసంపూర్ణసహాయం, విద్యాధికుల చేయూత, యువకులపట్టుదల మాత్రమే అవసరం. పారిశ్రామికంగా అభివృద్ధి నొందనిదే భారతదేశం ఎప్పటికీ నిరుద్యోగసమస్యను పరిష్కరించలేదు. ఆకలిబాధను అణచలేదు. సర్ యమ్. విశ్వేశ్వరయ్యగారు ఆర్థికనిర్మాణం అనేపుస్తకంలో ఈపద్ధతులనుగురించి చాలవరకు చర్చించారు. దేనికైనా మానవుడు ధృఢంగా నమ్మితేనేగాని ఏపనీ చెయ్యలేడు. కావున ప్రాచీనపద్ధతులే మంచివేమో అనుకుంటూంటే మనకర్తవ్యాన్ని సరిగా నిర్ణయించుకొనలేము. కావున కర్తవ్యాన్ని నిర్ణయించుకొని ఒకనిర్మాణకార్యక్రమం ప్రకారం పనిచేయాలి; లేనిచో మన కోరికలన్నీ ఊహాసాధాలు, గగనకుసుమాలే!

అనువాదకుడు: సుబ్రహ్మణ్యం.

---

# అశ్రుభిక్ష

కొండూరు వీరరాఘవాచార్యులు

౧

ఎన్ని శతాబ్దము లడచె
నే! మనశిల్పధరిత్రి భారతా
భ్యున్నతి వెల్లజేసిన త్వ
దుజ్జ్వలదివ్యచరిత్ర మాసి; యా
చిన్నెలు మున్నె శాంతిని వ
చించెనొ, జీవమె లేదు దేశమం
దెన్నటి కింక శిల్పజన
యిత్రి! చరించెడు భారతావనిః ?

౨

ఆత్మనామప్రకాశాభిలాషయు లేని
శిల్పు లీ భూమి వసించునాడు,
ఊరూర చిత్ర శిల్పోదయంబయి దేశ
కల్యాణతోరణా ల్గట్టునపుడు,
వేదవేదాంత భిక్షాదానముం జేయు
వీర దేశికుడున్న వేళలందు,
జక్కన్నగోళ్లు పాషాణాల చెరగని
జీవరేఖలు వ్రాయబోవునాడు,
తల్లి! ఎట్టుల మురిసి మంత్రాలతోడ
మమ్ము దీవించితో! కృపామసృణవీక్ష
లెటుల బఱపితివో, యవి యెల్ల నేడు
కఱవులయ్యె; శేషించె నీ కంటినీరు.

౩

ఇదిగో ముగియింతునమ్మ! నా యీ విషాద
గీతికాగాన మింక దీర్ఘీకరింప;
గోచరించెడు నల్లదిగో! నవీన
భావి మంగళ సోపానపథము గంటె?

౪

గడచి చన్న తాతలనాటి గాథ లెల్ల
తలచి తలచి కుమారిల ఫలము లేదు;
అంజలి ఘటించి సేవావ్రతైకదీక్ష
నడుగుచున్నాడ నిడుము నా కశ్రుభిక్ష.

౫

కుఱువున పాప ఆకొన్నట్టి సడి దోచె,
వీరరసపుటుగ్గు వేయుమమ్మ;
బాలకుల్ జ్ఞానపిపాసార్తు లరుగో, నే
డింత విద్యాదాన మిమ్ము తల్లి!
దేశీయ శిల్పవృద్ధికి బట్టుగొమ్మ లౌ
స్థపతిసింహుల సృష్టి సలుపుమమ్మ;
ఐక్యప్రబోధ శంఖారావముల సుప్త
మనుసంతతుల నిద్ర మాన్పు తల్లి!
మామకీనపురాణ బ్రాహ్మప్రభావ
మతిశయింపగ జేయుమమ్మా! యొకింత
జనని, చూచెదవో లేదొ చకితదృష్టి
నీ కుమారపురామహనీయశక్తి!

౬

వాగీశ్వరీకుండ పావకజ్వాలతో
విశ్వకృన్మూర్తిని వెలుగ జేసి,
శైల్పికాగమ మార్గసంపత్తితో నీదు
పుత్రుల నాల్కపై బాదల జేసి,
తెలుగుల కత్తియంచుల నిగ్గుదళ్కులో
శిల్పితేజము పరీక్షించి చూచి,
ఆత్మదేశౌన్నత్య మాత్మాభ్యుదయమన్న
భావంబు నెదలలో బాదుకొల్పి,
వాస్తు మంగళ పీఠికోపరి వసించి,
భరతభూమి నార్ద్రాక్షితార్పణ మొనర్చి,
అపుడు చూచెదు గర్వదృగంచలముల
నస్మదీయ పురాణ కల్యాణ మహము.

# మడత పేచీ

భమిడిపాటి కామేశ్వరరావు

ఒకసారి చందనబస్తీపత్రికలో ఒక చాటింపు పడింది: "లక్షారావుగారు ప్రమాదంవల్ల పడిపోయారు. వారినడుం మడతపడిపోయింది. చిట్టిచిట్టి ఉపాయాలవల్ల గుణం లేకుండా ఉంది. ఇక్కడికి వచ్చి కుదర్చగల వైద్యుడికి వెయ్యిరూపాయలు పైగా ఉండే బహుమతీ ఇస్తారు. ప్రజ్ఞగల వైద్యులు కావాలి. స్వయంగా వచ్చి మాట్లాడుకోవచ్చును. వివరాలకి వ్రాయవచ్చు. — చిరునామా, పత్రికాధిపతి: చందనబస్తీ" అని.

అబస్తీకి ఒకపూట నాటుప్రయాణంలో కరూరు అనే పట్నం ఉంది. ఆ ఊళ్లో వైద్యాభ్యాసం చేస్తూన్న డాక్టర్ ధనాధన్‌గారు కూడా, అందరికిమల్లేనే, పత్రికలోపడ్డ ఘోషణ చదివి చప్పరించి ఊరుకున్నాడు. కాని, ఆ మర్నాడే పత్రికాధిపతిదగ్గిర్నించి ఆయనకి ఓపెద్దఉత్తరం వచ్చింది. అందులో రోగిగారినిగురించిన వివరా లన్నీ ఉన్నాయి. ఆయనకి ఆశ్చర్యంవేసింది. ఇంతమంది ఘనవైద్యులు ప్రపంచంలో ఉంటూాంటే తనపేరు అప్పుడే పత్రికాధిపతికి ఎట్లా తెలిసిందోగదా అని ఆయన అనుకుని, లోపల సంతోషించుగుని, భార్యని కేకేసి, మీసం ఉండవలిసిన చోట తర్జన్యంగుష్ఠాలతో గాల్ని మెలిపెడుతూ, "చూశావా, మనతఢాఖా!" అంటూ ఆవిడికి ఆ ఉత్తరం చూపెట్టాడు. తక్షణం ఆవిడ నవ్వేసి, "తఢాఖాలానే ఉంది. మొన్న నేను పత్రికాధిపతిపేర రాయగా, ఆయన తబిసీల్లు రాశాడుగావును. ఇంతమాత్రానికే పొంగిపోకండి మరి" అంది. ఆయనకి కొంచెం చిన్నతనంవేసినా, మాట్లాడ్డానికి వీల్లేక ఊరుకున్నాడు. బహుమతీ ఆశ ఎవడి కుండదూ? ఆయనా నిలబడ్డపాట్న ఆకేసు అంగీకరించి ఉండేవాడే కాని, అతనికి ఆఉత్తరంలో చాటింపులో లేని షరతు ఒకటి మహాపాపిష్టిది కనిపించింది. ఏమంటూారా, వైద్యానికి కుదురుకున్నవారు వంద రూపాయలు ధరావతు కట్టింతరవాతే వైద్యం ప్రారంభించవలసి ఉంటుందని. ఎక్కడేనా చక్కటి బజానా ముందుపుచ్చుగుని పని ఒప్పుగుంటారు గాని ఇవ్వడం ఏమిటి అన్నాడాయన. పెద్దవాళ్లతో వ్యాపారం అమాత్రం బరువుగానే ఉంటుం దని గ్రహించుగోవాలి అం దావిడ. ఆ బహుమతికి ఓ అరదణ్ణం పెట్టి మనపని మనం చూసుగుంటే నయం అని ఆవిడతో నయాన్నీ భయాన్నీ చెప్పి చూద్దాం అని ఆయన యత్నించాడు. ఆవిడ ససేమిరా వినిపించుకోలేదు. సరిగదా :

భార్య — మనకి బ్యాంకిలో నిలవ ఎంతుంది?

డాక్టర్ — నూరు పైనే ఉంటుంది.

భా — రేప్పొద్దున్న అది పుచ్చేసుగుని వెళ్లి మీరు ఈ బేరం అచ్చుగోండి.

డా — అక్కడ ఎంతమంది ఉన్నారో పోటీకి?

భా — ఏ కాళ్లో పట్టుగుని బేరం చే చిక్కించుకోవాలి. దాటపెట్టుగుంటే ఓరికేసి ఓరు చూస్తూ కూచోవాలి.

డా — నాకింకా వైద్యపరంగా చెయి తిరగలేదు, అర్థపరంగా గుక్క తిరగలేదు: మనస్థితి కింకా ఎక్కడా గాలి తిరగలేదు.

భా — మృతనష్టపుకేసులు ఎన్నని చేసి సంపాదిస్తే అంత అవుతుంది ?

అని వాడించింది. డాక్టర్ ధనాధన్ పని వాడే గాని, మాటశూరుడు కాడు. అందులో, ఇవతలమనిషి భార్యగాని, మరొ కరూ మరొకరూ కాదు. అందుకని, మర్నా డు డబ్బా డవాలీ కట్టి, బ్యాంకి కెళ్లి డబ్బు తెచ్చి జాగ్రత్తచేసుగుని, ఆరోగి శాస్త్ర మార్గంలో పడడం చూసుగుని ఒకవారంలో మళ్లీ వస్తానని చెప్పి, ఆయన చందనబస్తీ వెళ్లి పోయూడు. ఆయనా వెళ్లగానే, ఆవిడ స్నేహితురాలిద్వారా ఆవిడదగ్గిరికి ఒక బంగారపు గొలుసు — పాతికాసుల్ది — బేరాని కొచ్చింది. మహాగతు కలిసిరావడం వల్ల కొంచెంరాహితుగా వస్తువుదొరుకుతోం దనిపించి, బహుమతీ రాగానే పూర్తిగా సొమ్ము గిరవాటెయ్యొచ్చుగదా అనే ధైర్యం చొప్పున, ఆవిడ, మానవాయిదాలమీద డబ్బు చెల్లించేవరకుకి ఆ గొలుసు పుచ్చుగో డానికి ఒప్పుగుని బజానా ఇచ్చింది.

కాని, డాక్టర్ ధనాధన్‌గారు వారం లేదు, గీరం లేదు. మర్నాడు సాయింత్రానికి ఇల్లు వెతుక్కుంటూ వచ్చిపడ్డాడు. అంత పెందరాళే ఆయన వచ్చెయ్యడం ఆవిడికి కొంచెం ఆశ్చర్యం అయింది. అయినా ఆవిడ, "చూశారా! ఈ గొలుసు ఎంత ఇంచక్కా ఉందో!" అంది. 'ఇంచక్కానే ఉంది', అని ఆయన కూలబడి చెప్పగొచ్చాడట:

ఆ ఊళ్లో ఉన్న సత్రంలో రాత్రి మకాం వేశాను. ఉదయాన్ని కాఫీ కానిచ్చుగుని, వచ్చి, మరి ఆరోగిదగ్గిరికి ఎల్లానా వెళ్లిపడడం అని నేను గుంజాటన పడుతూండగా, కోర్టుపనిమీద ఆపూరొచ్చి అక్కడ బసగా దిగిన ఒకాయన సాయంచేశాడు. ఆయన నన్ను వెంటబెట్టుగుని తిన్నగా లతూరావు గారి గుమాస్తాకి అంటించి వెళ్లాడు. మొద ట్లో, ఆ గుమాస్తా, రేగటిబెడ్డల్లాగ మహ గుచ్చుకొనేటట్టు మాట్లాడాడు. కాని, కాస్త తడి తగిలించేసరికి, అతడు ఎక్కడలేని మెత్త దనం కనపరిచి, తక్షణం నన్ను వెంటేసుగుని రోగిగారింటికి తీసిగెళ్లాడు. రోగిగారిది పెద్ద మేడ. ఒక గదిలో ఒక సాగుడు మంచం మీద ఆయన శాలువ కప్పుగుని పరున్నాడు. ఆయన బాధతోనే నాతో ప్రసంగించాడు.

రోగి — కూచోండి. తమ దే[గ్రామం?

నేను — కరూరు. మీకు ఒంట్లో ఎట్లా ఉంది?

రో — ఒంటికేమండీ, పిక్కలా ఉంది. నడుమే!

నే — అసలు సంగతేమిటండి ?

రో — మా బస్తీప్రముఖులు ఈమధ్య రోడ్లమీద పిల్లకాలవలు తవ్వారు.

నే — ఎందుకూ ?

రో — మంచినీళ్ల గొట్టాలకనీ, మురుగు నీటి తూములకనీ, చెట్లు పాతడానికనీ, స్తం భాలు స్థాపించడానికనీ, బళ్లవాళ్లమీద కసి

కొద్దీననీ, హెచ్చుతగ్గులొచ్చినప్పుడు దూరా భారం వెళ్లక్కర్లేకుండాననీ జనం చెప్పు గున్నారు. ఆవయినం ఇంకా తేల్నే లేదు.

నే — సరిపోయింది. మీా రల్లాంటి గోతు లోగాని పడ్డారా ఏమిటి?

రో — మరే.

నే — పోన్లెస్తురూ, మీా అజాగర్తా మీా రూనూ! కాస్త కిందూ మీాదూ చూసుగుని నడవక్కర్లేదుటండీ, మీా రెంత సామంతు లైనా ! చిన్నవారూ చితగవారూగనకనా ఇదవడానికి !

రో — అయ్యో! అయ్యో! అబ్బ ! అబ్బ!

నే — ఏం ఏం ? నెప్పా ? తగ్గిస్తాగా! వెధవ నెప్పి !

రో — మరేనండి. గట్టిగా మాట్టాడేస రికి ఖరేలుమనడమూనూ అక్కణ్ణించి ధను వాయిపోటూనూ! కదులుదాం అనుకునే సరికి కలుక్కుమంటుంది.

నే — అయితేపోన్లెండి. కాస్త నిమ్మళిం చుగుని మరీ చెప్పండి.

రో — ఒకనాడు నేను రాత్రి పికా రెళ్లి కార్లో వచ్చాను.

నే — మీారు రాత్రెళ్లు కారుపికారు వెడతారా ?

రో — రోజూ కాదు. తోచనప్పుడు వెడుతూంటాను. ఆవేళ కారు దిగి ఇంట్లోకి వస్తూ, ఈపక్కా ఆపక్కా కనిపించే పాతా ళపుగొయ్యిలాంటిది చూసి కళ్లు తిరిగిపోయి పడిపోయూను. ఆపడిపోడంలో ఆతవ్విన కాల వకి సరీసుగా అడ్డంగా డాముపంతెనలా పడ్డా నేమో, నానడుం మడతడిపోయింది. అసలు విరిగి ముక్కలైపోవలిసినమాటే. ఆతరవాత ఏంజరిగిందో నాకు తెలియదు. కాని కిట్టని కుంకలకి పన్లేక నాకు పడడానికి పూర్వమే స్పృహ లేదనీ, నే నేదో తాగొచ్చి పడిపోయా ననీ, లేనిపోని అపవాదలు నామీాద వేశా రనీ మాగుమాస్తాకి తెలిసిందిట. నడుం సర్దు కోడంతోటే, నడుంకట్టి వాళ్ల పని పడతాను.

నే — పోన్లెండి,అదంతా ఎందు కిప్పుడు? తక్షణం మీారు తోమించకపోయూరా ?

రో — అయ్యో ! తోమించాం.

నే — ఏదేనా మందు పామించకపో యూరా ?

రో — అయ్యో! పామించాం.

నే — బెణుకువైద్యులకీ,యిరుకువైద్యు లకీ చూపించారా ?

రో — చూపించాం.

నే — కాపించారా ?

రో — కాపించాం. ఉప్పు, నిమ్మ కాయి...

నే — పట్లు ?

రో — పట్లూ వేయించాం.

నే — లోపలికి మందు ఏమన్నా కుట్టిం చారా ?

రో — ఆఁ. కుట్టించాం.

నే — పథ్యం ఏమన్నా చేస్తున్నారా ?

రో — అక్కర్లే దన్నారు. సరేగా నండి, తమది కూసీవైద్యం కాదుగదా !

నే — అంటే ?

రో — అంటే కూసీయే.

నే — చఛ. తమకి తెలియదు. అది 'హైడ్రోపతి'. నాకు అదీ తెలుసు.

రో — అయితే తమరు దయచెయ్యండి. ఇల్లా ఉండనీ బాబూ, పోయినప్పుడే పోతాను. కూనీ కావడం ఎందుకొచ్చింది?

నే — అది జలవైద్యమయ్యా! అది కర్త పేరు.

రో — పేరా? అయితేమాత్రం. ఏమిటంత మరీ నిర్మోహమాటప్పేరు!

నే.— పైగా నా కది అట్టే బాగా రాదు. సరా!

రో — మీది సీసామందు వైద్యమా?

నే — "అలోపతీ" తెలుసు.

రో — 'ఉమాపతీ' తెలుసా?

నే — దాన్ని 'హోమియోపతీ' అనాలి.

రో — ఈ కాలంలో 'ఉమాపతీ' అంటేనే పుణ్యం. మీకేం తెలుసు?

నే — పోనీలెండి. ఉమాపతీ తెలుసు.

రో — ఇంక మరేమీ తెలియదుకద, ఇన్నింటితాలూకు పథ్యాలూ చెయ్యాలేమో?

నే — నాకు 'లక్ష్మీపతీ', 'వనస్పతీ' తెలుసు. 'ఎలెక్ట్రోపతీ' తెలుసు. కొన్నిచోట్ల దాన్ని 'న్యాయతీ' అనికూడా అంటున్నారు.

రో — అయితే మీరు ఎక్కువ ఇష్టంగా వాడేరకం ఏది?

నే — నాది 'బృహస్పతీ' వైద్యం అంటాను.

రో — అంటే?

నే — మిక్కిలి గొప్పది.

రో — సరే. మీరు గుమాస్తాగారికి అడ్వాన్సు చెల్లించండి.

నే — ధరావతు ముట్టినట్టు రసీదు రాసి యిప్పించండి. కుదరడంతోటే నా బహుమతీ నాకు స్వాధీనపరిచే అంగీకారంతో కాగితం కూడా నాకు పారేయించండి. నేను ఈవేళే ప్రారంభిస్తాను.

రో — ఇన్నాళ్లకి నాకు ధైర్యం వచ్చింది. సరే, మీరు భోజనం చేసుగునిరండి. వైద్యానికి ఇక్కడ బాగుండేటట్టు లేదు. అవతల వీధులో నామేడ మరోటి ఖాళీగా ఉంది. నేను అక్కడికి మారతాను. వసతి మారుస్తే రోగం సహాంమట్టుకు తమాయిస్తుం దని శాస్త్రం. మీరు దగ్గిరుండి, నన్ను ఎల్లాగో జాగర్తగా కార్లోకి ఎక్కించాలి. కారు సున్నితంగా నడవాలి. ముందు కోటదాకా వెళ్లి రావాలి.

నే — కోట ఏమిటి?

రో — ఈ ఊళ్లో కచేరీలన్నీ ఉండే చోటు.

నే — అక్కడి కెందుకూ?

రో — ఈ వేళ కోర్టులో వాయిదా ఉంది. ఆ తరవాత నన్ను ఎల్లానో ఆమేడలో దింపాలి.

నే — సరే లెండి. వస్తాను.

అని నేను వచ్చేస్తూంటే గుమాస్తా, దేవతార్చనకి నన్ను తన యింటికే లాక్కెళ్లాడు. ఎక్కడి కక్కడికే అనుకుని, నేను రానని బెట్టు చెయ్యలేదు. భోజనం అయి వచ్చాం. ఆయన్ని ఆపళంగానే ఒక బల్లచెక్కమీదికి జరిపి ఆ బల్లచెక్క పళంగానే ఆయన్ని కార్లో ప్రతిష్ఠించాం. ఆ రోజున

కారుడ్రైవరు కార్యాంతరంమీద వెడతానని సెలవు అడిగితే లేదన్నారట, కొరకొరలాడిపోతూ ఉన్నాడు. నేను ఎదటి కెళ్లి డ్రైవరుపక్క కూచోబోయాను. అతడు నన్ను వెనక్కివెళ్లి దయచెయ్యమన్నాడు. అధికారవర్గంలోవాళ్లు కిరాయిబస్సుడ్రైవర్లని బెదిరించి, వాళ్లచేత బస్సులు ఖాళీ చేయించి, స్వంతపనిమీద ఫ్రీగా ఎక్కినప్పుడు వాళ్లకి సరియైన సమ్మానం జరగడానికి డ్రైవర్లు వాళ్లని వీలైనంత వెనకే కూచో పెడతారులే.

కారు బయల్దేరేటప్పుడే పెద్ద సింహగర్జన చేసింది. డ్రైవరువాలకం చూస్తే అత డేదో అవాంతరం తెచ్చిపెట్టేటట్టు కనపడింది. నిమిట్లో పెద్దరోడ్డుమీంచి తప్పుగుని కారు పక్కవీథిలో పడింది. అది సందులా ఉన్నా పసందుగాకూడా ఉంది. వెనక కతకలపోటీలో ఒక రోడ్డుకి మట్టి 'షీల్డు' బహుమతీ యిచ్చారని విన్నాం. అల్లాంటి రోడ్డది. గాలీ, వానా, వాహనాలూ, అధికార్లూ, మధ్యవర్తులూ అంకినంతవరకు రక్తం పీల్చేసుగుని మాంసం నల్చేసుగుని వొదిలేసిన శల్యాల్లాగ కంకర రాళ్లూ, కతకలూ, గోతులూ, కయ్యలూ, గాళ్లూ, రొంపీ, దిబ్బలూ దిరుగుండాలూ, మట్టీ మశాణం, పెంటడబ్బా — దానిచుట్టూ శాఖోపశాఖలుగా వ్యాపించి ఉన్న తుక్కుసంతానం — ఇల్లాగ్గా భయమేస్తూ ఆరోడ్డు జీభూతంలా ఉంది. ఆ డ్రైవరు తెలివి ఏముటో గాని, కారు, వెనక్కీ ముందుకీ కూడా నడిచింది. అది ఒక్కొక్కసారి కప్పలా దాటేది. ఒక్కొక్కసారి పీతలా నడిచేది. ఉండి ఉండి పొట్టేలులాగ కొన్ని గజాలు వెనక్కిపోయేది. మరొకసారి తూటాలాగ ఉన్నచోటే గిజగిజా కొట్టుకునేది. నేను పచ్చడైపోయాను. పచ్చడీ మెతుకులూ నోట్లోకొచ్చాయి. రోగిమాట అల్లా ఉండగా నా నడుం విరిగేట్టు కనపడింది. రోగి, ఏక మూలగడం, కుయ్యడం, అరవడం, ఏడవడం. ఓ మాటు రోగి డ్రైవరుమీదికి ఒరిగాడు, మళ్లీ యథాస్థానంలో పడ్డాడు. మరోమాటు, మేం యిద్దరం డ్రైవరుమీద పడి వెనక్కొచ్చాం. ఇంతలో నే నున్న వేపు గాడిలో దిగడి రోగి వచ్చి నా పొట్టమీద పడ్డాడు. పడ్డవాడు ఊరుకోకూడదూ, రోగమా? 'బాబో, బాబో' అని ఏడుపు. ఆ ఫళంగా అతడు అసలుచోటి కెళ్లి పడేటట్టు ఒక్కగెంటు గెంటాను. మరి కాస్సేపట్లో రోగివేపు చక్రాలు రొంపిలాంటిదాల్లో కూరుకుపోయేసరికి డ్రైవరు 'గేరు'మీద కార్ని లాగించాడు. దాంతో నే నున్న వేపు పైకి లేచిపోయి, నే వెళ్లి అమాంతంగా రోగిమీద పడ్డాను. కారు బోల్తా వేసింది. రోగి 'చచ్చాను, చచ్చాను, నీతాడు తెగా, నామీద పడకురోయ్' అని గోల. నాశక్యమా? డ్రైవరు జాగ్రత్తపడి ముందే దూకేశాడు. చాలామందిజనం పోగై నన్నూ రోగినీ పైకి తీశారు. ఈగలభాలో నాకు మోకాళ్లూ మోచేతులూ కొంచెం కొట్టుగుపోయాయి. కాని, ఆరోగినడుం బాగుపడి నిట్రాడులా అయి ఊరుకుంది, వీడి అదృష్టంకాలా! అతడు, 'అమ్మయ్య' అనుకుంటూ సాగి వెళ్లిపోబోయాడు. 'నాబహుమతీ నా కిచ్చెయ్యండీ' అని నే నడిగాను. 'నువ్వ కుదిర్చిందేమిటి? ఇంటి కెళ్లి ఇచ్చేస్తాలే' అన్నాడు. తన డ్రైవింగు మహాత్యంవల్ల ఆయనకి నడుం-

కుదిరింది గనక, బహుమతీ ఛీదాగా తనకే రావలిసిఉంటుం దని డ్రైవరు మొదలెట్టి నన్ను అటకాయించాడు. నేను కొంచెం తెల్లపోయి ఆగిపోయాను. ఆస్థలానికి ఒక వేపున ఇల్లుగల కూచయ్య తన యింటి యెదట లత్సూరావునడుం కుదిరిందిగనక తనకే ఆబహుమతీ రావా లన్నాడు. రెండో వేపు కాపరంఉన్న మాచయ్య వచ్చి, తన యింటికికూడా ఆస్థలంమెట్టమెదటిదే గనక, తనకి చెరిసహామేనా వాటా ఉండాలన్నాడు. దాంతో, కూచయ్య, లత్సూరావుతనయిల్లున్న పక్కనే కార్లో కూచుని ఉండడంవల్ల తనకే యావత్తుబహుమతీగాని, మాచయ్యకి పూచికపుల్లేనా వెళ్లకూడ దన్నాడు. ఆస్థలం పేరుకి కూచయ్యవేపుదైనా, పగలు తనపిల్లలూ రాత్రి తన పెద్దలూ బాహ్యానికి భుక్తపరుచుగుంటూండడంవల్ల తనదే బహుమతీ అని మాచయ్య కేకలేశాడు. అక్కణ్ణించి ఓ పోలీసు "బీటు" కనిస్టీపు వచ్చి, ఆరోడ్డు అక్కణ్ణించి ఎడాపెడా వందగజాలు తనదే గనక, తనకే బహుమతీ రావా లన్నాడు. వెంటనే, ఎక్కడ తెలిసిందో, వెనక ఆరోడ్డు వేయించిన కంట్రాక్టరు వచ్చి, 'అయ్యా! ఈ రోడ్డు ఇంత మహాత్యంగలిగి ఉండేటట్టు తయారు చేయించింది నేను. ఇల్లా రోడ్డు లేకుండా ఉంటే కారు ఇన్ని పిల్లిమంత్రాలు వేసిఉండదు, అది అల్లావేసి ఉండకపోతే, మీాకు నడుం కుదిరిఉండదు. అందుకని బహుమతీ నాది' అన్నాడు. ఆ రోడ్డు స్వయంగా తవ్వి చేసినవాళ్లొచ్చి తమ కీ బహుమతీలో వాటా ఉందన్నారు. కాన్పేపటికి బస్తీపాలక సంఘంవారు మనుష్యుల్ని పంపి, రోడ్డు తమదే గనక బహుమతీ తమదే అన్నారు. ఇది పబ్లిగ్గా జరిగినపని గనక, డీ. పీ. డబ్లుయూ. వారు రాకుండా ఉంటారా అని కొంద రన్నారు. ఈలోపల కొందరు బోర్డువారికీ, ప్రభుత్వానికీ, చక్రవర్తికీ టెల్లిగ్రాఫులు కొట్టి వారొచ్చి బహుమతీకోసం దెబ్బలాడమని సలహాయిస్తాం అన్నారు. ఈ దెబ్బలాటలో లత్సూరావు చాలాదూరం వెళ్లిపోయాడు. న న్ను క ద ల్నీ కుం డా వీ ళ్లం తా పిశాచాల్లా పట్టుగున్నారు. "మీావాటాలు ఇదైపోనూ, అల్లానే చూడచ్చులెండ్రా! పోన్స్, ఇంకా ఎంతమందికి బహుమతీలో వాటా లున్నాయో కనుక్కుని మధ్యవర్తుల్ని పెట్టి వ్యాపార పరిష్కారం చేయిత్తాం, ముందు అసలుమనిషి దాటిపోకుండా పట్టుగుందాం నడవండి" అని నేను గట్టిగా అన్నాను. అతడు కోటవేపుకి వెళ్లాడని కొంద రన్నారు. కార్ని ఆ రోడ్డుమీాంచి గెంటి, పెద్దరోడ్డుమీాదికి ఎక్కించి, అంతా కిటకిటలాడుతూ కార్లోనూ కారుమీాదా ఎక్కి కూచున్నాం. క్షణంలో కారు కోటదగ్గిర వాలింది. లత్సూరావు ఏకోర్టులోకో వెళ్లి అప్పుడే తిరిగి వచ్చేస్తున్నాడు. కొంద రెళ్లి వాకబుచేశారు. వాడికోర్టు చల్లగా ఉండా, అది దివాలాలకోర్టుట. వాడివాయిదా అక్కడట

అని డాక్టర్ ధనాధన్ వైద్యవృత్తాంతం చెప్పి ఆగాడట. 'పోనీ మీారు అడ్వాన్సుగా కట్టినసొమ్ము తెచ్చుగున్నారా?' అని ఆయన భార్య అడిగిందిట. ఆ సంగతి తను అప్పట్లో మరిచా ననిన్నీ, మళ్లీ వెళ్లి తెచ్చుగోవాలనిన్నీ ఆయన అన్నాడట.

# మహాయాన బౌద్ధధర్మోత్పత్తి

త్రిపిటకాచార్య, రాహుల సాంకృత్యాయనులు

[ఈ వ్యాసాన్ని రచించిన మహాశయుడు రాహుల సాంకృత్యాయనులు గొప్ప బౌద్ధాచార్యులు. ఈయన చీనా, టిబెత్తు పాలీ, సంస్కృతాది భాషలలో గొప్ప పండితుడు. అనేకపర్యాయాలు టిబెత్తుదేశానికి వెళ్లి అక్కడనుండి, ఇక్కడ అంతరించిపోయి అక్కడమాత్రమే మూలరూపంగానో, అనువాదరూపంగానో నిలిచియున్న అపూర్వబౌద్ధగ్రంథాలు ఎన్నిటినో సేకరించుకువచ్చాడు మనదేశానికి. అట్టివి కొన్ని యిప్పుడు ప్రకటన అవుతున్నాయి. ఇంకా అట్టిగ్రంథాలు తీసుకువచ్చేటందుకు, సంయుక్తరాష్ట్రాలప్రభుత్వంవారు ఈ మహాశయుణ్ని మళ్లీ టిబెత్తుదేశం పంపుతున్నట్లు ఈనడుమనే ప్రకటన అయింది.

బహుగ్రంథపరిశోధకుడు ఆయనవ్రాసినది ఈ వ్యాసం. హిందీవ్యాసానికి అనువాదం. వ్యాసవిషయం మహాయానబౌద్ధధర్మం ఉత్పత్తి. బౌద్ధమతపరిణామంలో కలిగినమార్పులలో ఇది చాలా గొప్పది. ఆదిమబౌద్ధ స్వరూపాన్నే మూలముట్టుగా మార్చివేసింది మహాయానం. అటువంటిమార్పు తెచ్చిపెట్టినవారు, దానికి ప్రాతిపదికవేసినవారు 'అంధకు'లట మరి — అంధకులంటే ఆంధ్రులే! చదవండి మీకే తెలుస్తుంది. భా. సం.]

బుద్ధుడు 45 సంవత్సరముల పర్యంతము ఈశ్వరవాదము, అనాత్మవాదము, పుస్తక వాదము, జాతివాదము మరియు నెన్నియో వాదములకు విరుద్ధముగు జడవాదమును చరమసీమవరకు గొనిపోయి బుద్ధిప్రధానమును, సదాచారపరాయణమును నైన ధర్మము నుపదేశించి క్రీ. పూ. 483 నందు నిర్వాణము నందెను. కాలము గడచినకొలదియు, నానాప్రకృతుల మనుజులు ఆధర్మమునందు చేరినకొలదియు, దానిలో మార్పులను



గలుగుచువచ్చెను. ఇట్లు బుద్ధనిర్వాణానంతరము వందసంవత్సరములకు వైశాలీనగరమున సమావేశమైన 'సంగీతి'[1] కాలమునందు బౌద్ధధర్మము స్థవిరవాద మనియు, మహాసాంఘిక మనియు రెండు సంప్రదాయములుగ విభక్తమయ్యెను. తదుపరి ౧౨౫ ఏండ్లు గడచినవెనుక మరింత విభక్తమై ౧౮ సంప్రదాయము లయ్యెను. పాలీ 'కథావత్థు'నందలి "అట్ఠకథ"ను అనుసరించి ఈ సంప్రదాయముల వంశవృక్షము ప్రక్కపుటలో చూపబడినది.

బుద్ధుని జీవిత కాలమందే యతని శిష్యులు గాంధారము, గుజరాత్ (సూనాపరాంతము), పైఠాణ్ (హైదరాబాదు రాజ్యము) వరకు బోయియుండిరి. క్రమముగా వారి యుత్సాహమువలనను, అశోక మిళింద ఇంద్రాగ్నిమిత్రాది సమ్రాట్టుల భక్తిసాహాయ్యములవలనను దీనిప్రచారము మరింత అధికమయ్యెను. భారతవర్షపు సరిహద్దుల వెలుపలనున్న దేశములకుగూడ ధర్మప్రచారకుల బంపి మతాభివృద్ధికి తోడ్పడుట అశోకునికార్యము లన్నింటిలో ముఖ్యమైనది. అశోకుని యనంతరము (క్రీ. పూ. మూడవ శతాబ్ది) బౌద్ధధర్మము సమస్తదేశములందును వ్యాపించియుండెను. అప్పటికి ౧౮ సంప్రదాయములు ఏర్పడియుండెను. రాజసాహాయ్యము ఏదో యొకసంప్రదాయమునకే లభించుచుండినప్పటికిని తక్కినసంప్రదాయములవారును ఉత్తమవిధానమున మతప్రచారము గావించియుండిరి. శుంగులు, కాణ్వులు, తరువాత ఆంధ్రులు లేక ఆంధ్రభృత్యులను వారు సమ్రాట్టులైరి. వీరల సర్వప్రథమ రాజధాని ప్రతిష్ఠానము(పైఠన్)[1a] మహారాష్ట్రము. తరువాత ధాన్యకటకము రెండవ రాజధాని యయ్యెను. కాలాంతరమున నిదియే కోసల రాజధానియగు శ్రావస్తింబోలి ప్రధాన రాజధాని యైనది. పైఠణ్ కేవలము యువరాజునకు రాజధానిగ నుండిపోయెను. శాతకర్ణి (శాతవాహన, శాలివాహన) నామక ఆంధ్ర రాజు కొంతకాలమువరకు ఉత్తరభారతమునకును శాసకుడుగ నుండెను. కాని తరువాత నతడు దక్షిణముతోడనే సంతుష్టినొందవలసి వచ్చెను. బౌద్ధధర్మముమీద ఇతనికి నపరిమితమగు అనురాగము. ఇది పర్వతముల తొలిపించి ఇతడు కట్టించిన గుహావిహారము

1. బుద్ధోదితధర్మప్రవచన నిర్ణయమునకైన సమావేశమునకు సంగీతియని పేరు.

1a. సామ్రాజ్యాధిపతులైన అనంతరము పైఠాణ్ శాతవాహనులకు శకులతో వివాహసంబంధము కలిగెను. వీరిని తమదేశపుపేరున రఠికులు (రాష్ట్రికులు) లేక మహారఠికులని పిలుచుచువచ్చిరి. పిదప నాటకములందు శక లేక శకారునకు రఠిఅసాల్ (రాష్ట్రికశాల) అని వాడబడుట కిదియే కారణము. భారతవర్షమునకు క్రొత్తగావచ్చిన శకుల దేహవర్ణము తెలుపగుటచే అంతఃపురములందు శకకన్యకలకును మంచి గిరాకి చేయుండెను. ఈ విషయమునగూడ వీరు రాజులకు శ్యాలకు (బావమరదు)లుగు సంభవమైయుండెను. రఠి లేక మహారఠమను పేరు వచ్చుటకు బూర్వము పైఠణ్ చుట్టుప్రక్కలనున్న దేశము అంధక మని పిలువబడుచుండెను. ఇందువలననే శాతవాహను లాంధ్రులనుపేరు గాంచిరి. తరువాత రాజనీతికారణములనుబట్టి వారికి తెలుగుదేశములోని ధాన్యకటకమును రాజధానిగ చేసికొనవలసివచ్చెను. అందుచే ఆ ప్రదేశమునకు ఆంధ్ర మనునామము కలిగెను. అంధకులు వృష్ణులు ఇరువురుసోదరులనుండు జాతులు అంధకు లార్యజాతివారా యనువిషయము వృష్ణుల వాసుదేవుని జాతిమీద నాధారపడియున్నది.

లందు జెక్కబడిన శిలాలేఖలవలన విదిత మగుచున్నది. ధాన్యకటక(అమరావతి) రాజధానియం దితడు కట్టించిన భవ్యస్తూపము, అనేకమూర్తులు, లతలు మున్నగునవి, చిత్రములతో అలంకృతము లైయున్న పాలరాతి పట్టికలు, స్తంభములు, తోరణములు లోనగునవి నేటికిని నతని శ్రద్ధకు జీవసాక్షులుగ నున్నవి. క్రీ. పూ. ప్రథమశతాబ్దినుండి క్రీ. శ. మూడవశతాబ్దివరకు గల కాలమున బౌద్ధులకు పురాతన మౌర్యవంశమును, అంతిమపాలవంశమును ఎట్లుపకరించెనో శాతవాహన రాజవంశమును అటులే యుపకరించియుండెను. కొండలను త్రవ్వించి గుహలను గట్టించు కార్యము మౌర్యు లారంభించి

కథావత్థునందు ఖండింపబడిన సిద్ధాంతముల తులనాత్మక సూచి.

| | సిద్ధాంతముల సంఖ్య | ఆర్వాచీనములు | | | | | | | | ప్రాచీనములు | | | | | | | | | |
|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|---|
| | | అంధక | | | | | | | | మహాసాంఘిక | | స్థవిరవాద | | | | | | | |
| | | అంధక | అపరశైలీయ | పూర్వశైలీయ | రాజగిరిక | సిద్ధార్థక | వైపుల్య | ఉత్తరాపథక | హేతువాద | మహాసాంఘిక | గోకులిక | కాశ్యపీయ | భద్రయానిక | మహీశాసక | వాత్సీపుత్రీయ | సర్వాస్తివాద | సామ్మితీయ | హైమవతీయ | ఇతరులది కలిసిన |
| ఆర్వాచీనములు. | | | | | | | | | | | | | | | | | | | |
| అంధక | ౪౨ | | | | | | | | | | | | | ౧ | | ౧ | ౭ | ౬౨ | ౧౦ |
| అపరశైలీయ | ౪ | ౧ | | ౬ | | | | | | | | | | | | | | ౦ | ౪ |
| పూర్వశైలీయ | ౨౯ | ౧ | ౬ | | | | | | | | | | | ౧ | | | ౩ | ౧౫ | ౧౧ |
| రాజగిరిక | ౧౧ | ౧ | | | | ౭ | | | | | | | | | | | ౧ | ౨ | ౯ |
| సిద్ధార్థక | ౯ | ౧ | | | ౭ | | | | | | | | | | | | ౧ | ౬ | ౯ |
| వైపుల్య-వేతుల | ౭ | ౧ | | | | | | | | | | | | | | | | ౪ | ౧ |
| ఉత్తరాపథక | ౮౮ | ౪ | | | | | | | ౧ | | | | | ౧ | | ౧ | | ౩౮ | ౧౦ |
| హేతువాద | ౭ | | | | | | | ౧ | | | | | | | | | | ౪ | ౧ |
| ప్రాచీనములు. | | | | | | | | | | | | | | | | | | | |
| మహాసాంఘిక | ౨౮ | | | | | | | | | | | | | | | | | | |
| గోకులిక | ౧ | | | | | | | | | | | | | | | | | ౧ | ౦ |
| కాశ్యపీయ | ౧ | | | | | | | | | | | | | | | | | ౧ | ౦ |
| భద్రయానిక | ౧ | ౧ | | | | | | | | | | | | | | | | ౦ | ౧ |
| మహీశాసక | ౯ | ౨ | | ౧ | | | | ౧ | ౧ | | | | | | | | ౩ | ౧ | ౭ |
| వాత్సీపుత్రీయ | ౧ | | | | | | | | | | | | | | | ౧ | ౧ | ౦ | ౧ |
| సర్వాస్తివాద | ౮ | ౧ | | | | | | ౧ | | | | | | | ౧ | | | ౧ | ౩ |
| సామ్మితీయ | ౨౨ | ౭ | | ౩ | ౧ | ౧ | | | ౮ | | | | | ౩ | ౨ | ౨ | | ౩ | ౧౯ |
| సమ్మిళితములు | ౪౦ | | | | | | | | | | | | | | | | | | ౧౫౪ |
| అనిశ్చితములు | ౧౪ | | | | | | | | | | | | | | | | | | ౫౪ |
| | | | | | | | | | | | | | | | | | | | ౨౧౮ |

యుండిరి. అందు వా రెంతవరకు అభివృద్ధిని గాంచియుండినదియు సరాసరి నేటికిని పాలిషుచేసినట్లు తలతలలాడుచుండు గుహాల ద్వారా విదిత మగుచునేయున్నది. కాని గుహాలను అధిక సంఖ్యాకములుగ సుందరములగురీతి నిర్మించు ప్రయత్నములు ఆంధ్రుల రాజ్యమందే జరిగియుండెను. నాసిక, కార్లీ గుహాలవలె అజంతా ఎల్లోరా గుహాలును ఈ కాలముననే ఆరంభమై తరువాత అభివృద్ధి నొందుచుబోయెను.

అంధక[2]సామ్రాజ్యమునందు మహాసాంఘికులును, ధర్మోత్తరీయులును ఉండిరను విషయము కార్లీ[2a], నాసికగుహాలవలన దెలియుచున్నది. పాలీ 'అభిధమ్మపిటక'మునకు జెందిన "కథావత్థు" గ్రంథమునం దెన్నియో సంప్రదాయముల మతములు ఖండింపబడినవి. అట్ఠకథానుసారము వానివిశ్లేషణము ప్రక్కపుటలో నిచ్చిన పట్టిక (సూచి) వలన విశదమగును.

మొత్తము ౨౧౪ (౨౧౬) సిద్ధాంతముల మీద "కథావత్థు" వాదనము కావించియుండినని పై పట్టికవలన దేలుచున్నది. వానిలో ౧౩౦ అంధకాది అర్వాచీనుల సంప్రదాయములు. అనేక సంప్రదాయములతో గలిసియున్నవి ౪౦[3]. ౬౪ సిద్ధాంతముల విషయమున అట్ఠకథయం దేమియు గానరాదు. ౨౬ సిద్ధాంతములుమాత్రము పురాతనములైన ౧౮ సంప్రదాయములకు జెందినవి. ఇట్లగుటచే "కథావత్థు" అర్వాచీన సంప్రదాయములకు విరుద్ధముగ వ్రాయబడుటయే స్పష్టము. ఈ యర్వాచీన సంప్రదాయములెనిమిదింటిలో అపరశైలీయ, పూర్వశైలీయ, రాజగిరిక, సిద్ధార్థకము లనునవి అంధకులలోని భేదములే. అంధకుల సిద్ధాంతములిందు ౬౨ ఖండింపబడినవి. వైపుల్య, హేతువాదుల స్థాన మెచట నైనదియు నిందు వ్రాయబడియుండలేదు; కాని ముందుముందు వైపుల్యులు ఆంధ్రదేశీయు లని తెలియగలదు. ఉత్తరాపథకులు పంజాబు, లేక హిమాలయవాసులై యుందురు. కాని హేతువాదుల విషయమై ఏమియు చెప్పజాలము. మహాసాంఘికులనుండియే తరువాత తరువాత అంధకసంప్రదాయములు జన్మించినవి. అందులకు రెండు కారణములు కలవు: ౧. వివాదగ్రస్తములగు విషయము లెన్నియో వీరిద్దరికి సమానములే. రెండవది ఆంధ్ర

2. బౌద్ధగ్రంథములయందు ఆంధ్రులకు అంధకులని వ్యవహారము.

2a. Epigraphia Indica, Vol. VII, pp. 55, 64, 71.

3. కలిపి చూచినయెడల అనిశ్చితములైన ౧౬ సిద్ధాంతముల సంప్రదాయము లీ రీతిగ నుండవచ్చునని తోచుచున్నది:— అంధకములు ౪+౧, పూర్వశైలీయము ౧, ఉత్తరాపథకములు ౫, మహాసాంఘికములు ౫, సామ్మితీయ అంధకము ౧.

భూత భవిష్యత్ కాలముల అస్తిత్వసిద్ధాంతము (కథా ౧-౬) ఎవరిదైనదియు నిచట వచించియుండలేదు కాని యువాన్‌చాంగ్ యొక్క "విజ్ఞప్తిమాత్రతాసిద్ధి" మీద లిఖించినటీకలో నీ సిద్ధాంతము సర్వాస్తివాది, సామ్మితీయులదైనట్లు నిరూపించెను (చూడుడు: "విజ్ఞప్తిమాత్రతాసిద్ధి" మీద డాక్టరు పూసీ యొక్క ఫ్రెంచి అనువాదము; పృ. ౧౫౬).

సామ్రాజ్యమునందు[4] మహాసాంఘికులకు ఎక్కువ ప్రచారమును ప్రభావమును ఉండియుండెను. కావున మహాసాంఘికుల నుండియే ఉత్తరకాలమున అంధక సంప్రదాయములవారు బయలుదేరిరని తలపవలయును




పూర్వశైలీయము: "కథావత్థు" యొక్క అట్ఠకథ(౧-౯)యందు దిది తృతీయసంగీతి తరువాత ఉత్పన్నమైన అంధక సంప్రదాయములలోనిదిగ గణింపబడినది. మహాసాంఘికుల (ధాన్యకటకమహాచైత్యము) యొక్క చైత్యవాద సంప్రదాయము ప్రాచీన అష్టాదశ సంప్రదాయములందు సమ్మిలితము గావింపబడినది కాని ఈ అంధక సంప్రదాయములు వానియందు చేర్పబడినట్లు గన్పింపదు. కాబట్టి ఇవి చైత్యవాదసంప్రదాయముకంటెను తరువాతివని తెలియుచున్నది. చైత్యవాదుల నామములు ౧౮ సంప్రదాయములలో వచ్చియుండినందున అట్ఠకథాకర్త వానినిమూడవసంగీతినాటికంటె పూర్వపువనివచించియుండెను. అయినప్పటికి శుంగుల తరువాత పాలించిన ఆంధ్రుల ప్రతాపకాలముననే ధాన్యకటకచైత్యమునకు ప్రఖ్యాతి

4. మహాసాంఘికులయందు చైత్యవాదసంప్రదాయముగూడ ఉండెను. ధాన్యకటకమునందు దీని కెంతటి విలువ యుండినదియు అమరావతియందు దొరకినశిలాలేఖలవలన తెలియనగును. ధాన్యకటకపు స్తూపపుపేరే "మహాచైత్యము." మంజుశ్రీమూలకల్పపు ౧౦-వ పటలమునందు:

"శ్రీపర్వతే మహాశైలే, దక్షిణాపథసంజ్ఞకే,
శ్రీధాన్యకటకే చైత్యే, జినధాతు ధరే భువి"

అని కలదు. ఈ చైత్యమునుబట్టియే అచటివారు చైత్యవాదు లనుపేరు వడసిరి.

కలిగియుండును. కాబట్టి ఇచటి భిక్షుకుల పృథక్ వ్యక్తిత్వము ఖారవేల, శుంగుల యనంతరమే స్థాపితమైయుండును. మరియు ధాన్యకటకమునకు పూర్వ పశ్చిమములందు రెండుపర్వతము లుండెననియు వానిమీాది విహారములే క్రమముగా పూర్వశైలీయ, అపరశైలీయము లని వ్యవహరింపబడుచుండెడి వనియు[5] భోటియా (టిబెట్టు)గ్రంథములవలన తెలియుచున్నది. ధాన్యకటకము ఆంధ్రదేశమందలి ప్రస్తుతపుధరణికోటయే (గుంటూరుజిల్లా). ౧౪-వ శతాబ్దియందు లిఖింపబడిన "నికాయసంగ్రహ"మను సింహళగ్రంథము వలన పూర్వశైలీయులు "రాష్ట్రపాల గర్జిత"[6] మనుగ్రంథమును వ్రాసి బుద్ధుని కర్తృత్వమున ప్రకటించిరని తెలియుచున్నది. భోట దేశమున శ్రీ (పూర్వ శైలము) లనబడు ఇత్తడి విగ్రహములకు విలువ ఎక్కువ.

అపరశైలీయము : ధాన్యకటకమునకు పడమటగానున్న పర్వతముమీాది ఈసంప్రదాయమువారుగూడ చైత్యవాదులనుండి వచ్చినట్లే తోచుచున్నది. తక్కినవిషయములన్నియు పూర్వశైలీయముల బోలియుండును. దీనినిగురించిన ప్రస్తావనయు భోటియాగ్రంథమున గలదు. వీరు "అలవక గర్జిత" మనుగ్రంథమును లిఖించి బుద్ధుని పేర ప్రకాశితము గావించిరని నికాయ సంగ్రహమువలన తెలియనగును.

రాజగిరికులు:— వీరును అంధకులే. కాని ఆంధ్రదేశమున రాజగిరి ఎక్కడ నున్నదియు వీరి కేంద్రస్థాన మెచటనైనదియు చెప్పజాలము. "కథావత్థు"నందు వీరి సిద్ధాంతములు ౧౧ ఖండింపబడినవి. వానిలో ఎనిమిది వీరికిని సిద్ధార్థకులకును సమానములుగనే యున్నవి. కావున వీరిరువురకు పరస్పర మెక్కువసంబంధ ముండవచ్చును. నికాయ సంగ్రహమునందు వీరు "అంగులిమాలపిటకము"[7] నకు కర్తలని వ్రాయబడియున్నది.

సిద్ధార్థకులు :— రాజగిరికులకువలె వీరి ముఖ్యస్థానమును ఆంధ్రదేశమున నెచట నుండినదియు జెప్పజాలము. వీరికిని, రాజగిరికులకును, సిద్ధాంతముల సమత వలన వీరిలో ఒకరినుండి మరియొకరు ఏర్పడి రనికాని లేక ఇరువురకు నుద్గమ స్థాన మొకటే యని కాని తలపవలసి వచ్చుచున్నది. "నికాయసంగ్రహము"న వీరు "గూఢవెస్సంతర" కర్త లని పేర్కొనబడియున్నారు.

ఈ నాలుగు అంధక సంప్రదాయములును ఆంధ్రసమ్రాట్టుల కాలమున మహోన్నతదశయం దుండెను. ఆంధ్ర రాజులకును, వారి రాణులకును బౌద్ధధర్మము నెడల నెంతటి యనురాగ ముండినదియు అమరావతి, నాగార్జునకొండలలో దొరికిన శిలాలేఖలవలన విదిత మగుచున్నది. ఈ

5. క్లోఙ్-ర్దల్-స్నం-బుం-(ల్హాసా)-౫. పృ. ౮౨౧.

6. చీనాత్రిపిటక "రాష్ట్రపాలపరిపృచ్ఛా" అనునది కావచ్చును.

7. అంగులిమాలీమాత్రము కావచ్చును. (Nanjio's ౪౩౪; కఞ్జూర్, ౨౨-౧౩) } (Nanjio's ౮౭౩. కఞ్జూర్, ౧౯-౯)

విషయమున మనకు చీనా, భోటియా, పాలీ, సంస్కృత స్రోతస్సులద్వారా కొంత సామగ్రి లభించును కాని అది మిక్కిలి స్వల్పము. కాని ఆంధ్రులు శిలాలేఖలమెడల మిక్కిలి యనురాగముగలవా రగుటంజేసి ధాన్యకటక, నాగార్జునపర్వతములందును, గుంటూరు జిల్లాయందలి ఇతర ప్రదేశములందును పురాతన ధ్వస్తావశేషముల త్రవ్వట పూర్తియైనపిదప మన మీా చిక్కుల నన్నింటిని విడదీయగలుగుదు మఱియు, తన్మూలమున మహాయాన, వజ్రయాన ముల ఆరంభికదినముల యొక్కయు, వాని వికాసముయొక్కయు ఇతిహాసము ఇంతకంటె ఎక్కువ దెలియ గలదనియు ఆశించుచున్నాము.

వైపుల్య (వేతుల్ల) వాదులు:— "కథావత్థుయొక్క అట్ఠకథయందు వీరు మహాశూన్యవాదులని పేర్కొనబడిరి. నాగార్జునుడు శూన్యవాదమున కాచార్యుడు. ఇట్లు వైపుల్యమును మహాయానమును ఒకటేయని స్థిరమగును. కథావత్థునందు విశేషమహత్వము గల విషయములు రెండు గలవు. అందు మొదటిది వైపుల్యుల ఖండితసిద్ధాంతములందు శూన్యత లేదు.

వీరి మత సంఘ బుద్ధ మైథున విషయములలో భేద ముండెను. వీరు వచించున దేమన:

(౧) సంఘము దానము గ్రహింపదు, దానిని పరిశుద్ధము గావింపదు, ఉపభోగింపదు. సంఘమున కిచ్చుటవలన మహాఫలమును లేదు.

(౨) బుద్ధున కొసగుటవలనను మహాఫలము లేదు. అత డీ లోకమున కేతెంచి యుండనూ లేదు. ధర్మోపదేశమునూ చేయలేదు.

(3) కొన్నికొన్ని విశేషావస్థలందు మైథున మొనరింపవచ్చును.

ఈ మూాడు విషయములును, అందులో ముఖ్యముగ కట్టకడపటి రెండువిషయములును బౌద్ధధర్మమం దొకప్రకారమగు విప్లవాందోళనముల గలిగించునవి యని చెప్ప నవసరము లేదు. ఐతిహాసిక బుద్ధుని అస్తిత్వమునే నిరాకరించుటయు, విశేషావస్థయందు మైథునమునకు అనుమతి నిచ్చుటయు అను నీరెండు విషయములలో మొదటిదాని యందు మహాయానముయొక్క అంతిమ వికాసముపర్యంతము గల స్పష్టమగు పూర్వరూపమును, రెండవదానియందు వజ్రయానము లేక తాంత్రికబౌద్ధధర్మము యొక్క స్ఫుటబీజములును లభించుచున్నవి.

"కథావత్థు"నందు విశేషమహత్వము గల రెండవవిషయ మేదన వేతుల్లవాదుల మతము లన్నియు దానియంతిమభాగమున ౧౭, ౧౮, ౨3-వ వర్గములలో వ్రాయబడియున్నవి. "కథావత్థు" అశోకుని మూాడవ సంగీతి కాలముననే ప్రారంభమై యుండినప్పటికి దానియందు తరువాతి తరువాతి వాదములు చేర్పబడుచుపోయినవని ఇదివరకే తెల్పితిమి. అందువలన వేతుల్లపాదభాగము కథావత్థునందు అన్ని

టికంటె ఆఖరున చేర్చబడినదని తలచుట కష్టము గాదు. ఎంతవెనుక చేర్చబడియుండును అనుదానికి సమాధాన మేమన బుద్ధఘోషుని కంటెమాత్రమే కాదు, నాగార్జుననికంటె గూడ పూర్వము చేర్చబడియుండును అని; ఎందుచేతనన సందులో వేతుల్లవాదుల శూన్యవాదఖండనము లేదు. మన మీకాలమును క్రీ. శ. ప్రథమశతాబ్ది యని యెంచినచో వాస్తవిక కాలమునకు మిక్కిలి స్వల్పముగ అటో ఇటో ఉండును. విక్రమార్క, శాలివాహనశకములను, నాగార్జునుని కాలమును మన మెప్పుడు సప్రమాణముగ నిష్కృష్టగ నిశ్చితముచేయఁగలుగుదుమో అప్పుడే ఈవిషయమునగూడ నిశ్చితరూపమున మరికొంత చెప్పగలుగుదుము. బలగమబాహురాజు కాలమున (క్రీ. పూ. ప్రథమశతాబ్ది) ప్రప్రథమమున వేతుల్లవాదము సింహళమున ప్రవేశించెనని ఆదేశపు ఇతిహాసమువలన దెలియుచున్నది. కాలాంతరమున అంధకసంప్రదాయములు నాల్గును, వానిశాఖలలోనిదగు వేతుల్లమును ఒకటియేయైనపుడు అన్నియు వేతుల్లనామము నొందుట సంభవమే కదా!

మహాయానసూత్రములు[8] చీనాయందలి ప్రజ్ఞాపారమిత, రత్నకూటము, వైపుల్యము, అవతంసకము, నిర్వాణములందును, టిబెట్టుదేశపు కగ్జూరమందలి ప్రజ్ఞాపారమిత, రత్నకూటము, వైపుల్యము, సూత్రము (ప్రకీర్ణము), నిర్వాణములందును గ్రమముగా విభక్తములైనట్లు మనము కనుగొనవచ్చును. అవతంసకసూత్రములు వైపుల్యమునకంటె భిన్నములుగ గణింపబడినవికాని యీ రెండింటిలో ఒకేవిధమగు సూత్రములున్నవి.[9] "మంజుశ్రీమూలకల్పము"లోని ప్రత్యేకపటలాంతమున "బోధిసత్వపిటకాదవతంసకాత్ మహాయానవైపుల్యసూత్రాత్" అని వచ్చుచుండును. భోటియాయందును వైపుల్యసూత్రముల నామములతో సహా "బోధిసత్వపిటకాత్ అవతంసకాత్ మహావైపుల్య...సూత్రమ్" అని వచ్చుచుండును. స్వయం నంజోయొక్క సూచీపత్రపు ౮౭, ౮౯, ౯౮, ౯౬, ౧౦౦ ల గ్రంథములలో అవతంసక వైపుల్యములు తోడ్తోడ విశేషణ విశేష్యరూపముగ ప్రయుక్తము లైనవి ప్రజ్ఞాపారమిత, రత్నకూట, వైపుల్యాదుల సూత్రములు మహాయానమునకు చెందినవి[10]. ఇందులో సందేహ మెవరికిని గలుగనేరదు. ఇప్పుడు మనము మహాయాన మనునదే వైపుల్యవాదము లేక పాలీ వేతుల్లవాదమనుట సమంజసము ఆరంభికకాలమున వైపుల్య (వేతుల్ల) నామముతో నెయ్యది ప్రసిద్ధ మయ్యెనో అదియే మహాయానము. ఆకాలమున మహాయాన మని పిలువబడుటచే వారికి సఫలత కలిగియుండలేదు. "వేతుల్ల", "వైపుల్య" ఒకటే. వేతుల్లవాదిని మహాశూన్యవాది యని పిలుచు కథావత్థునందలి అట్ఠకథావాదమునుండియు మన కిదే స్పష్టమగును. వేతుల్లవాదులు "వేతుల్లపిటక" (వైపుల్యపిటక)మునకు కర్తలని నికాయసంగ్రహ

---

8. చూడుడు: A catalogue of Buddhist Tripitaka by Bunjiu Nunjio.

9. Trivendrum Sanskrit series, L XX,LXXXIV.

10. కగ్-జూర్, ౪౧-౪౬.

మునందును పేర్కొనబడియుండిరి. అదే స్థలమున అంధకులు రత్నకూటాది శాస్త్రములను రచించిరని[11] వ్రాయబడియున్నది. "రత్నకూట", "వైపుల్య"ముల రెండు ప్రకారములగు సూత్రములే మహాయానసూత్రములు. ఇందువలన మహాయానము అంధకుల(పూర్వశైలీయాది నాలుగు సంప్రదాయముల) యొక్కయు, వైపుల్యవాదుల యొక్కయు సమ్మిలితరూపపు పేరే యని చెప్పవచ్చును.

మహాయానము పూర్వశైలీయాది నాలుగు అంధకసంప్రదాయములయొక్కయు, వైపుల్యవాదులయొక్కయు సిద్ధాంత సమ్మిశ్రణమున నేర్పడినట్లు నిరూపింపబడినది కదా. అందలి అంధకనికాయములకు సంబంధించిన యంశ మంతయు ఆంధ్ర దేశమందలి గుంటూరు జిల్లాలోని నేడు ధరణికోటయన్న చోటునుండి ఉద్భవించినది. కాని వైపుల్యమునకు ముఖ్యస్థానమేది? ఇక దీనిని విచారించెదము.

మహాయానసూత్రములు సరాసరి పరివర్తితములును, పరివర్ధితములను అగుచుండినవని ధ్యానమం దుంచుకొనవలయును. కాబట్టి వాని మూలస్థాన, మనగా వాని నిర్మాణమునకు బునాది యచ్చట వేయబడినదని మా యభిప్రాయము. కాని పరివర్తన, పరివర్ధనములందు సమస్త భారతవర్షమునకు గూడ హస్తక్షేపము కలదు.

వైపుల్య వాదమున మనకు దెలిసిన దేమన:

౧. క్రీస్తుపూర్వము మొదటిశతాబ్దియందిది సింహళమును బ్రవేశించియుండెను.[12]

౨. రెండవ శతాబ్దియందే ఇందలి కొన్ని సూత్రములు చీనా దేశమున అనూదితములయియుండెను.[13]

3. దీనిప్రచారకులలో అందరిని మించినస్థానము నాగార్జునాచార్యులది.

౪. నాగార్జునుని నివాసస్థానము ధాన్యకటకపు శ్రీపర్వతము.[14]

౫. (ఆంధ్రరాజు) శాతవాహనుడు నాగార్జునుని ఘనిష్ఠ మిత్రుడు.[15]

---

౧౧. అంధకోక్త రతనకూటాదివ్య- శాస్త్రాంతరరచనాకరహ.- నికాయసంగ్రహము (౧౯౨౨ లో సిలోను సర్కారుచే ముద్రితము).

౧౨. మహావంశము.

౧3. నన్‌జో సూచీపత్రము. సంఖ్య ౨౫. "సుఖావతీ వ్యూహము"; లోకరక్షకునిచే అనూదితము. (క్రీ. శ. ౧౪౭ — ౧౮౬).

౧౪. క్లోక్-ర్దల్-స్నం-బుమ్ (ల్హాసా). చ, పృ. ౯. ౪. "నాగార్జునుని వాసస్థానము దక్షిణభారతమున శ్రీ పర్వతముదగ్గర శ్రీ ధాన్యకటకమునందైయుండెను."

౧౫. హర్ష చరిత్రము. సప్తమఉచ్ఛ్వాసము. (నిర్ణయసాగర ప్రెస్. తృతీయసంస్కరణము-పృ. ౨౫౦)- "సమతిక్రామతి చ కియత్యపి కాలే, కదాచిత్ తా మేకావలీం తస్మాత్ నాగరాజాద్ నాగార్జునో నామ నాగైః కె వానీతః పాతాలతలం భిక్షు రభిక్షత్, లేభేచ నిర్గత్య రసాతలాత్, త్రిసముద్రాధి

౬. వీరి క్రాంతికారిసిద్ధాంతములు కొన్ని అంధకులసిద్ధాంతములతో సరిపోవుచుండును.[16] ఇందువలన వైపుల్యవాదమునకు ఉద్గమనస్థానముకూడ ధాన్యకటకము[17] దగ్గరే యుండునని యనుమానము కలుగకపోదు మంజుశ్రీమూలకల్పములోనినిమ్నలిఖితశ్లోకము ఈవిషయమునే బలపరచును.

"గచ్ఛేద్ విదిశం తంత్రజ్ఞః
సిద్ధికామఫలోద్భవామ్,
పశ్చిమోత్తరయోర్మధ్యం
న దేశః పరికీర్తితః". —పృ.౧౭౫-పటము,౧౮.

ఇందు "పశ్చిమోత్తరములమధ్య" విదిశ నిర్దేశింపబడినది. లేఖకుడు దక్షిణభారతమున కూర్చుండిననే యట్లు వ్రాయగలుగుట సంభవము. "మంజు శ్రీమూల కల్పము" మహావైపుల్యసూత్రములలోని దని ఇదివరకే చెప్పబడినది. కావున ఆస్థానము శ్రీపర్వతమో లేక ధాన్యకటకమో అయివుండునని మా నమ్మకము.

---

పతయే శాతవాహననామ్నే, వకేంద్రాయ సుహృదే స దదౌ తామ్. నాగార్జునుడు శాతవాహనరాజు పేర "సుహృల్లేఖ" నామకపత్రమును వ్రాసియుండెను. అది చీనీ, భోటియా భాషలయం దిప్పటికిని సురక్షితముగ నున్నది.

౧౬. విశేషావస్థయందు మైథునమున కనుజ్ఞ (కథావత్థు - ౨౩-౧) అంధకులకు వీరికి ఒక్కటే. అంధకులు బుద్ధుని వ్యవహారములను లోకోత్తరములని నమ్ముచుండిరి (క-వ, ౨-౮). వైపుల్యులు బుద్ధుని ఐతిహాసికతనుగూడ తిరస్కరించిరి. "బుద్ధుడు మనుజలోకమునకు వచ్చియుండలేదు" (౧౮-౧); బుద్ధుడు ధర్మోపదేశమును చేయలేదు (౧౮-౨).

౧౭. రాళ్ళబోడు.-(నాగార్జునకొండ, గుంటూరుజిల్లా).

# ప్రగల్భప్రేతము

## (జాతక కథ)

'చక్రపాణి'

[ముసురుగా ఉన్న ఒకనాటి సాయంకాలం, జేతవనంలో కూడిన భిక్షువులు అనాథపిండదుని వద్దకు వెళ్లి – "సత్తమ! ఈమనోహరమైన వర్షాసంధ్యలో మాకొక చక్కని భూతాలకథ చెప్పు"డని కోరగా వా రీక్రింది కథను చెప్పిరి.]

వారణాసిని బ్రహ్మదత్తుడను రాజు పాలిస్తూవుండగా శీతప్రీ అను ముసలిబ్రాహ్మణుడు ఉండేవాడు. అతనికి సత్ప్రజ్ఞ అను పడుచుభార్య కలదు. ఒకప్పుడు పెద్ద భూకంపం వచ్చి బ్రాహ్మణుని ఇల్లు కూలిపోయినది. బ్రాహ్మణి ఇంటిలోనుంచి తప్పించుకోలేక అందులోనే అణిగిపోయి ప్రేతయోని పొంది, ఊరి బయట చెరువుగట్టున ఉన్న మారేడుచెట్టుమీద నివసింపనారంభించినది.

ఆ చెట్టుకు సమీపంలోనే ఒక పడుచుగొల్లవాని నివాసంకూడా. ఒకనాడు వానిభార్య చెరువుకు స్నానానికి రాగా ప్రేతం ఆమెను ఆవేశించింది. గోపాలుడు భార్యలోని భావవైలక్షణ్యము చూసి చాల చింతితుడై గొప్ప గొప్ప రాజవైద్యులను చికిత్సకోసం రావించాడు. వైద్యులు అనేకమందు లిచ్చికూడా రోగాన్ని కుదర్చలేక "ఇది మందులకు లొంగేరోగము కాదు; గాలి చేష్ట భూతవైద్యులను పిలిపించుకో"మ్మని చెప్పిపోయినారు.

తర్వాత గోపాలుడు ప్రఖ్యాతి చెందిన భూతవైద్యులను కొందరిని పిలిపించాడు. వారిని చూడగానే గోపాలునిభార్య ఉగ్రరూపంధరించింది; కళ్లెర్రచేసి ఉరిమి చూసింది, పళ్లు పటపట కొరికింది, గుప్పిటి బిగబట్టి తుప్పున ఉమ్మేస్తూ నోటికి వచ్చిన తిట్లెల్లాతిట్టి "మీ రిక్కడికి చావటానికి వచ్చారా? వెంటనే పారిపొండి; లేకపోతే మీ మెడలు విరగగొడతాను!"అని గద్దించింది.

ఇది చూసి భూతవైద్యులు పరస్పరము పరామర్శచేసుకుని "ఈమెను తప్పక మ్లేచ్ఛభూతం ఆవేశించి ఉంటుంది. దీన్ని వదలించటం మనవల్ల కాదు. ముఖ్యంగా దీనిమోటుప్రవర్తనా, భయ పెట్టేపద్ధతీ చూచి కూడా దీనిజోలికి పోవటం బుద్ధిమంతుల పనికాదు. కాబట్టి మనం ఈక్షణానే ఇక్కడనుంచి వెళ్లటం మంచిది" అనిస్థిరపరుచుకున్నారు.

వీరినిర్ణయం విని ముసలిభూతవైద్యు డొకడు క్రుద్ధుడై ఈక్రిందికవిత చెప్పాడు:

ఎంత చిత్రమైన మాటలాడుచుంటి రయ్యలో!
ఇలలో భూత మెక్కడైన భూతవైద్యు దెగడులా!
గాన మీరలెల్ల దూరముగను, నుండి చూడుడీ
గురునికృపచే నీక్షణంబె నదరోలెద భూతమున్.

తర్వాత భూతవైద్యుడు మంత్రించిన ఆవాలు గుప్పిట పట్టుకుని గోపాలునిభార్యవద్దకు పోగా, ఆమె "ఓసి ముసలిపీనుగా! నీకు కాలం సమీపించింది, కాచుకో!" అని ఆడుపులివలె అతనిమీదికి లంఘించి, బుజాలు రెండూ గోళ్లతో పట్టుకుని, ముక్కుకొన గట్టిగా నోట లంకించుకున్నది. భూతవైద్యుడు మహాప్రయాసలో ఆమెపట్టు వదలించుకొని, వెంటనే, తిరిగిచూడకుండా పారిపోయినాడు. అతనివెంబడే మిగతాభూతవైద్యులుకూడా కుక్కవెంటపడితే కుందేళ్లుపారిపోయినట్టుఎటువారటే మాయమైనారు. ఆతర్వాత సాహసించి ఎవ్వరూ భూతాన్ని వదలిస్తామని రాలేదు. పాపం గోపాలునికి మనశ్శాంతిలేదు. సుఖమనేది ఎరుగకుండా కాలం గడుపుతున్నాడు. క్రమంగా ఈసంగతి చాలా దూరం వ్యాపించింది.

ఆకాలంలో బుద్ధభగవానుడు జితధీ అను పేరుతో అవతరించినాడు. పుట్టినదాది అధ్యయనమూ, జ్ఞానచర్యా చేయడంచేత వారికి ప్రతివిషయంలోనూ గంభీరమైన అంతర్దృష్టి కలిగింది. జ్ఞాని అని వారికీర్తి దేశ విదేశాల్లో వ్యాపించింది. ఒకనాడు వారు ఏదో కార్యార్థమై ఈచోటికి రాగా, గోపాలునికి తెలిసి వారిదగ్గరకు పోయి - తన్ను ఈ ఆపదనుంచి రక్షించమని వారిని వినయంగా బలవంత పెట్టినాడు. వాని ప్రార్థన తోసివేయక శాస్త (బుద్ధభగవానుడు) శిష్యులతో గోపాలునియింటికి వచ్చినాడు.

గోపాలుని ఇంటిముంగిలిలో అడుగుపెట్టగానే స్ఫురతానరతరుణి ఒకతె రెప్పవాల్చకుండా కిటికీలోనుంచి తన్ను చూస్తూ ఉండటం శాస్త కనిపెట్టినాడు. గోపాలుని యింటిలో ఆతనిభార్యమినహా ఇక స్త్రీ లెవ్వరూ లేరని శాస్త ముందుగానే తెలుసుకున్నాడు. అందుచేత ఈమెగోపాలునిభార్య అని స్థిరపరచుకొని, ఇతరులు చూడకుండా ఆమెవంక చూసి మందహాసముచేసి తల కొంచెం ఎగర వేసినాడు. తరుణి కిటికీలోనుంచి వెళ్లి పోయింది. అప్పుడు శాస్త శిష్యులతో "మీరు ఊరిబైట ధర్మశాలలలో భోంచేసి, నాకోసం వేచి ఉండండి. త్వరలో నేను వచ్చి కలుస్తాను" అని చెప్పి పంపి, గోపాలునితో "నిన్ను కొన్నిమాటలు అడిగవలసి ఉన్నది" అన్నాడు.

"సెలవివ్వండి" అన్నాడు గోపాలుడు.

"ఈరోగసంగతి నేను విన్నాను. మామూలుపనిపాటల్లో నీభార్యలో ఏమీ మార్పు ఉండకూడదని నానమ్మకం. ప్రవర్తనలో పూర్వానికీ ఇప్పటికి ఏమైనా మార్పు ఉంటే చెప్పు."

"తమరు సర్వజ్ఞులు. తమరు చెప్పిన దంతా నిజం. పూర్వానికీ ఇప్పటికీ పనిపాటల్లో ఎక్కువమార్పు లేమీ లేవు వెనకటికంటె ఇప్పుడు కొంచెం ఆచారమూ శుచీ ఎక్కువైంది. గృహకృత్యాలు చక్కగానే నిర్వర్తిస్తూఉంటుంది. భూతవైద్యులను చూస్తే మాత్రం ఉత్తేజితురాలవుతుంది. ఇకపట్టపగ్గాలుండవు. ఇంకా—"

"ఇంకా?"

గోపాలుడు తలవంచుకొని "ఇది తప్పుగా ఎంచకండి దేవా! పూర్వం నాభార్య చాలా సిగ్గు కలది. ఈరోగం వచ్చినప్పటినుంచీ నానుమా కాముకతా ఎక్కువైపోయినవి. అలంకరణ అంటే మహాప్రీతి; ఎప్పుడూ సాహచర్యం కోరుతూ ఉంటుంది; గురుజనులు ఉన్నాకూడా. నాదగ్గరకు వచ్చికూర్చోటానికి సిగ్గుపడదు" అన్నాడు.

"ఇక ఈవ్యాధి సంగతంతా నాకు తెలిసింది. కుదర్చగలను. కాని నేను చెప్పినట్లు నీవు నడుచుకోవలసి ఉంటుంది."

"చిత్తం. తమ సెలవుప్రకారం నేను—"

"నేను చికిత్సచేయటానికి వచ్చినానని నీవు ఎవ్వరికి చెప్పకూడదు. నేను అందాకా ఇక్కడే ఉంటాను. నీవు ఇంట్లోకి పోయి 'బాటసారి ఒకడు మనఇంటికి అతిథిగా వచ్చా' డని చెప్పు. నీఇంట్లో ఒకగది నాకివ్వాలి. మధ్యాహ్నం భోజనం అయినాక నీ భార్య నాకు తాంబూలం తెచ్చి ఇచ్చేటట్టుగా చూడాలి; అక్కడ జరిగే తంతు అంతా నీవు పక్కగదిలో ఉండి చూడవచ్చును."

ఈ విధంగా గోపాలునిచేత ఒప్పించుకొని శాస్త గోపాలునిఇంట అతిథిగా ప్రవేశించినాడు.

భోజనంచేసి శాస్త ప్రక్కమీద విశ్రమిస్తూ ఉండగా, గోపాలునిభార్య వారికోసం సుగంధ ద్రవ్యాలు వేసి చాలా శ్రద్ధగా తాంబూలం తయారు చేసి తెచ్చింది. శాస్త తాంబూలం చేత్తో తీసుకుని "భద్రా! కొంచెంచల్లనిపానీయం తెచ్చిపెట్టగలవా?" అన్నాడు.

గోపాలునిభార్య లోపలికి పోయి లోటాలో నీళ్లూ, చక్కెరా, నిమ్మపండూ తెచ్చి, నట్టింట కూర్చుని నెమ్మదిగా పానీయం తయారుచేయ నారంభించింది. ఆమె ఇచ్ఛాపూర్వకంగానే ఆలస్యం చేస్తున్నదనీ, ఆమెచేతులు పనిచేస్తున్నప్పటికీ కళ్లు రెండూ తనమీదనే ఉన్నవనీ శాస్త గ్రహించి ఆమెవంక రెప్ప వాల్చకుండా చూడనారంభించాడు. గోపాలునిభార్య వారివంకనే చూస్తూఉండటంచేత వారిసమ్మోహనశక్తికి వశ్యురాలై పోయింది.

"నీ విప్పుడు నా ఇచ్ఛాశక్తికి పూర్తిగా లొంగిపోయినావు. నేను ఏశక్తితో నిన్ను కట్టివేశానో దాన్ని జయించటం నీకు సాధ్యం కాదు. నేను అడిగినవాటికల్లా నీవు జవాబివ్వు. స్వేచ్ఛగా మాట్లాడటానికి నేను నీకు స్వాతంత్ర్యం ఇచ్చాను."

గొల్లవానిభార్యకు స్మృతి లేదు యంత్రచాలితవలె "సెలవివ్వండి" అన్నది.

అప్పుడు శాస్త్రి, ప్రక్కగదిలోనుంచి తొంగి చూస్తూవున్న గోపాలుని పిలిచి "నీ భార్యను ఆవేశించిన భూతాన్ని నేను నా ఇచ్ఛాశక్తితో వశపరుచుకున్నాను. ఈక్షణానే దాన్ని పారదోలగలను. కాని, ఎంతో కాలంనుంచి నేను ఏదుయోగంకోసం వేచియున్నానో అది నేడు సిద్ధించింది. ఈ భూతాన్ని నేను కొన్ని ప్రశ్నలు అడగా లనుకుంటున్నాను. నీ వీ ప్రశ్నోత్తరాలు విని ఏమాత్రం విచలితుడవు కావద్దు. కారణం, నాతో మాట్లాడేది పైకి నీ భార్యగా కనపడినా నిజానికి ఆమె కాదు. ఆమెను ఆవేశించినభూతమే నాకు జవాబిస్తుంది. నీవు ఇక్కడకు వచ్చి చూడొచ్చు, నీవు లేకుండా నేను నీ భార్యదగ్గర ఎక్కువసేపు ఉండటం, లోకదృష్టిలో బాగుండదు" అని, ఆతర్వాత శాస్త్రి ప్రేతాన్ని సంబోధించి "నీ జనకటిచరిత్ర అంతా నాకు తెలుసును. నీవు మారేడుచెట్టుమీద ఉంటూ గోపాలునిభార్య స్నానం చేయటానికి రాగా పూనినావు. కాని, నీ వెందుకు ఈమెను పూని కష్టపెట్టుతున్నావు? ఈమెమీద నీ కింతకోపం కలగటానికి కారణం ఏమిటి?" అని అడిగినాడు.

గోపాలునిభార్య అంటే ప్రేతం మందహాసం చేసి "మీ జ్ఞానం ఇంతమాత్రమే అయితే మీకు నేర్పిన గురువులమీద కూడా నాకు గౌరవం ఉండదు, మీ మనోబలానికి నేను వశ్యురాలనై నప్పటికీ" అన్నది.

"ప్రగల్భాలు కట్టిపెట్టి నే నడిగినదానికే జవాబు చెప్పు" అన్నాడు శాస్త్రి గద్దించి. "నీ ఆచారాలూ, నీరుచీ, నీ అలంకరణపద్ధతీ చూస్తే, నీవు నీచజాతికి చెందినదానివి కావని స్పష్టంగా తెలుస్తున్నది. బహుశా నీవు ఉత్తమజాతి కన్యవు కావచ్చును. ఈ గొల్లపిల్లను ఎందుకు ఆవేశించావు?"

ప్రేతం మరల నవ్వి, వారిమీద ఒక కటాక్షబాణం విసరి—"సరిగ్గా కనిపెట్టారు. నేను ఉత్తమజాతికన్యనే! దరిద్రకుటుంబంలో నా జీవితమంతా గడిచింది. పాలూ పెరుగూ నెయ్యీ నే నెన్నడూ చవి చూచి ఎరుగను. ఇప్పుడీమెను ఆవేశించి ఆతీరనికోరికను తీర్చుకొంటున్నాను. ఈమెమీద నాకు ఎంతమాత్రం కోపంలేదు. ఉన్నట్లయితే ఈమెశరీరాన్ని ఈ విధంగా అలంకరించే దాన్నే కాను" అన్నది.

ఇక వీటితో లాభంలేదని శాస్త్రి గ్రహించి — "అమ్మా! స్త్రీలమనస్సును సప్తఋషులుకూడా తెలుసుకోలేరు. ఇక నేనా మానవమాత్రుణ్ణి. సరే, నీతో నే నొకరాజీకి ఒప్పుకుంటాను. నీవు నా అధీనంలో ఉన్నావు. ఈ గోపాలునిభార్యను నీవు వదలక తప్పదు. దానికిబదులు నీకు, ఈ ప్రేతయోనినుంచి విముక్తికలిగే ఉపాయం చెప్తాను. నీకు ఇష్టమా, అయిష్టమా?" అని అడిగాడు.

ప్రేతం చాలాసేపు ఆలోచించి, చివరకు— "ఇష్టమే" అన్నది.

"అయితే దీనికిబదులు నీవు నా కొకసహాయం చేయాలి. నేను చాలా అధ్యయనమూ, చింతనా చేసి కూడా, ప్రేతాలు మనుష్యుల్ని ఎందుకు ఆశ్రయిస్తారో, సరైన నిర్ణయానికి రాలేకుండా ఉన్నాను; ఈ విషయం నీవు నాకు ఉపదేశించాలి. నేను నిన్ను కొన్ని ప్రశ్నలు అడుగుతాను, జవాబివ్వు. నీకు ముక్తిలభించే ఉపాయం నేను చెప్పతాను."

"అలాగే ప్రశ్నించండి" అన్నది ప్రేతం.

"అయితే విను. పాలూ పెరుగులమీద ఉన్న కోరిక తీర్చుకోవటానికే ఈమెను ఆవేశించావని నీవు చెప్పతున్నావు. ఇందులో కొంత సత్యముందని నేను ఒప్పుకుంటాను; కాని అంతా నిజంకాదు. ఏమంటావు?"

ప్రేతం మాట్లాడలేదు. శాస్త్రి చెప్పనారంభించాడు:

"ఏదైనా తీరనికోరిక మనస్సులో పెట్టుకొని చనిపోయినట్టయితే ఆత్మకు ముక్తి లభించదు; ఆతీరని కోరికను తీర్చుకోవటంకోసం ప్రేతం బ్రతికి ఉన్న

మనుష్యులను ఆశ్రయిస్తూ ఉండవచ్చని, నేను అనేక సార్లు అనుకున్నాను. మరణసంపనకు పూర్వం దండి కుని ఆఖరుకోరిక నెరవేర్చాలని శాస్త్రాల్లో ఉన్నది. బహుశా దీనికికూడా మూలకారణం పైదే కావచ్చును. నీకూ ఏదో అతృప్తి ఉంటుం దని నేను ఒప్పుకుంటాను. కాని నీవు చెప్పినకోరిక నాకు సబబుగా కనిపించటం లేదు. బ్రహ్మదత్తునిరాజ్యంలో పాలూ పెరుగూ లభించనిదరిద్రు డెవ్వడూ లేడు. అందులో ఉత్తమజాతివా రసలే లేరు. దీన్నిబట్టి నీ అతృప్తిపాలూ పెరుగులకు సంబంధించింది కా దని తేలిపోయింది. ఏమంటావు ?"

ప్రేతం మాట్లాడా లని కొంచెం ఊగులాడింది. కాని మాట్లాడలేదు.

“ఇం తేకాక, ఒకమాటు దేహం వదలిపెట్టినటు వంటి ఆత్మ, మళ్లీ తనకై తాను ఇం కొకరి దేహంలోకి వచ్చి బంధింపబడుతూ ఉందంటే, దానికారణం ఎంత బలవత్తరమైనదో మనం ఊహించుకోవచ్చు. మామూలు జిహ్వాచాపల్యంకోసం అది ఇంత శ్రమపడదు. నేను మరొకవిషయంకూడా గమనించాను. ఎప్పుడూ మగ ప్రేతాలు పురుషుల్ని ఆడుప్రేతాలు స్త్రీలనీ ఆవేశిస్తూ ఉంటాయి. దీనితో తప్పక ఏదో విశేషం ఉండితీరు తుందని నానమ్మకం. అదేమిటో నీవు నాకు చెప్పాలి.”

ప్రేతం కలవరపాటు చెంది, ఎవరన్నా ఉన్నా రేమోనని చుట్టూ ఒకమాటు కలయచూసింది. తర్వాత మెల్లగా “ప్రేతాన్ని అయినప్పటికీ నేను స్త్రీని. అన్నిసంగతులూ మీలాంటి మగవారిదగ్గర చెప్పలేను” అన్నది.

“నేను నీదగ్గర జ్ఞానసంబంధమైన ఉపదేశం పొందుతున్నాను; నీకూ నాకూ గురుశిష్యసంబంధమే ఉన్నది. కాబట్టి నీవు ఏమైనా నాకు చెప్పటానికి సంకోచించటం భావ్యంకాదు. సరే, అలాగైతే టూకీగా చెప్పుకుపో, నేను గ్రహిస్తాను.”

“దేవా! ప్రేతం స్త్రీని ఆశ్రయించబోయే ముందు, ఈడు మిసలనిదీ, మంచి శరీరపుష్టికలదీ, పడుచు భర్తకలదిగానూ చూసుకుంటుంది. దీన్నిబట్టి మీప్రశ్నకు జవాబు గ్రహించుకోండి.”

“గ్రహించాను. కాని, నీవు ఉత్తమజాతిదానవు కదా, ఎవరైనా అట్టి ఉత్తమజాతి వధువునే చూసి ఆశ్రయిస్తే బాగా ఉండేది. మరి నీవు ఏ ఉద్దేశములో ఈ గోపకన్యను ఆశ్రయించావు? ఇది నీ సురుచినీ, వర్ణవైశిష్ట్యాన్నీ వెల్లడించటం లేదు.”

ప్రేతం తలవంచుకొని “దేవా! ప్రేతలోకంలో జాతిభేదం లేదు. అక్కడ అంతా సమానులే” అన్నది.

“ఇదిగో, మళ్లీ మోసపుచ్చాలని చూస్తున్నావు. నేను ప్రేతాన్ని కాకపోయినా, ప్రేతలోకానికీ వాటి ఆచారాలకూ సంబంధించిన విషయాలు చాలా తెలుసుకున్నాను. అక్కడకూడా బ్రహ్మరాక్షసి వగైరా సమాజభేదాలు ఉన్నవి. మానవుడు ప్రేత మయినంత మాత్రంచేత స్వభావగతమైన సంకీర్ణతను వదిలిపెట్ట లేడు. పోనీ, అక్కడ జాతిభేదంలేదనే అనుకుందాము. ఇక్కడ ఉన్నదిగా! చనిపోయిన గోపాలుని ప్రేతమూ బ్రతికి ఉన్న గోపాలుడూ ఒకరు కారు. కనీసం ఈ సంగతైనా నీవు తెలుసుకునిఉంటే బాగుండేది.”

ప్రేతం తలవంచుకు నే“ దేవా! నేను చెప్పింది అసత్యమే. నాది చాలా అకాలమృత్యువు. అతృప్త కామవాసనకు తాళలేక నేను అస్థిరురాల నైనాను. దానితో పోరాడి జయించేశక్తి నాలో లేదు. చాలా కాలంనుంచి నా కిలాంటిసుయోగం దొరకలేదు. అందుచేత ఈ గోపకన్య కనిపించగానే, ఈమెను ఆశ్రయించ కుండా ఉండలేకపోయినాను” అన్నది.

శాస్త్రి—“ నీవు మొదటినుంచీ అబద్ధాలే చెప్పు తున్నావు. నీ సంగతిఅంతా నేను ఎప్పుడో ఊహించి తెలుసుకున్నాను. అకాలమృత్యువువల్ల లభించిన ప్రేతత్వాన్నించి సులభంగానే ముక్తి పొందవచ్చు; కాని, నీవు చేసినపాపానికిమాత్రం పరిహారం సులభం కాదు. అసలు, నీ అంతరంగంలో ఇంతవరకూ అనుతాపం కలగ లేదు; నీవు చేసినపాపం చాలక ఇంకా పెద్దపాపం చేయటానికి సిద్ధమైనావు. పైగా అన్నీ అబద్ధాలు.”

“నన్ను క్షమించండి” అన్నది ప్రేతం ఏడుస్తూ.

శాస్త్రి సమయోచిత గాంభీర్యం అవలంబించి “క్షమించవలసినవాణ్ణి నేను కాను. నీవు సంయమంలేని

పాపిష్ఠవు, భౌతిక దేహంలో నీలాలస తీరలేదు ప్రేత దేహంలో, అది తీర్చుకోవాలని చూచావు. ఈ పాపాచరణకు అవలంబనంగా ఎవరిని ఆశ్రయించావో ఆమెను కూడా సర్వనాశనం చేయటానికి సిద్ధపడినావు. నిజానికి ఈ బాలికఏమీ అన్నెం పున్నెం ఎరుగదు."

ప్రేతం "దేవా! నన్ను తిట్టండి. కాని, నా మీద మిథ్యాదోషాలు ఆరోపించకండి. ఈగోపకన్యకు నేనేమీ చెరుపుచేయలేదు. పైగా, ఈమెను నాశక్తి కొలది అలంకరించటానికి ప్రయత్నించాను"

శాస్త్రి "ఇది నీస్వార్థం. గోపాలుని ఆకర్షించటానికి, ఈమెహితార్థం కాదు. నీమోహంలో నీవెంత అంధురాలవైనావంటే, ఈమెకు ఎంత చెరుపుచేయబోతున్నావోకూడా తెలుసుకునేశక్తి నీకు లేకుండా పోయింది."

ప్రేతం జిజ్ఞాసుదృక్కులతో వారివంక చూసింది.

శాస్త్రి "బహుశా, నీవు ఈ దేహంతో ఇంతవరకు ఈమెభర్తమినహా అన్యపురుషులసాంగత్యం చేసి ఉండకపోవచ్చును. కాని, ఇవ్వాళ నేను ఇంటిముంగిట అడుగుపెట్టగానే, నీచూపు నామీదనే ఉండటం చూశాను. నీలాలసదృక్కులు చూడగానే నేను సంగతంతా అవగాహన చేసుకున్నాను. నిజానికి, నేను ఎవరినో ఏజాతివాడినోకూడా నీకు తెలియదు. తర్వాత, తాంబూలం ఇచ్చేనెపంతో నీవు నాదగ్గరికి వచ్చినప్పుడు కూడా నీ మనస్సులో లాలసే ప్రబలంగా ఉన్నది. ఇలా జరుగుతుందని తెలిసే, నిన్ను ఈవిధంగా పంపమని గోపాలునితో చెప్పాను."

"అంతేనా!" అన్నది ప్రేతం శ్వాస బిగించి.

"ఆఁ, నీవు బాగా మోసపోయావు. ఇక ఇప్పుడు దానికోసం పశ్చాత్తాపపడికూడా లాభం లేదు. ఇటు చూడు, నీ విచ్చినతాంబూలం ఇంకా నాచేతిలోనే ఉన్నది; దీంట్లో వశీకరణ ఓషధి ఉండవచ్చుననే సందేహంతో నేనింకా వేసుకోలేదు. నీవు పానీయం తయారు చేసే నెపంతో, నావంక సిగ్గువిడిచినదానివలె రెప్పవాల్పకుండా చూచి, నా మనోబలానికి కట్టుపడిపోయావు. ఈ విషయంలోమాత్రం నీమోహాంధతే నాకు సహాయం చేసింది. కాని, నేను వేరుప్రకృతికి చెందినవాడనైతే నీ కోరికకు కబళమయేవాడినే. నీవు, నీలాలస తీర్చుకోవటంకోసం ఈ అభంశుభం ఎరగని బాలికదేహాన్ని పరపురుషునికి బలి ఇచ్చేదానివి. ఈ పాపం ఎవరికి అంటుకునేది ?"

గోపాలునికి క్రమంగా శివం పెరిగిపోతూఉన్నది. శాస్త్రి సైగతో అతన్ని వారించాడు.

ప్రేతం భూమిమీదపడి పొర్లుతూ—"ప్రభూ! దుఃఖితురాలిని. నన్ను క్షమించండి, మీ పాదాలు పట్టుకొంటున్నాను."

శాస్త్రి విద్యుద్వేగంతో వెనక్కు పోయి "ఇంకా ఈ దేహంతో పరపురుషుని స్పృశించాలనే! నీకు మన్ననకావలిస్తే, నీవు ఎవరిభార్యకు అపకారంచేశావో వారిదగ్గరకే పోయి క్షమించమని వేడు." అన్నాడు.

ప్రేతం గోపాలుని కాళ్లమీదపడి, తల విసురుగా నేలమీద కొట్టుకో నారంభించింది.

ప్రియురాలి దేహం దుమ్ములో పొర్లాడటంచూసి గోపాలుడు వ్యాకులుడై ఆమెను చేతులతో పట్టి ఎత్తబోయాడు. శాస్త్రి "ఈ దేహాన్ని ఇప్పుడు ప్రేతం ఆశ్రయించి ఉన్నది. నీ విప్పుడు ఈమెను ముట్టినయెడల ప్రేతాన్ని ఆలింగనంచేసుకున్నట్లవుతుంది" అని నిషేధించాడు.

గోపాలుడు డగ్గుత్తికతో—"దేవా! మూర్ఖుణ్ణి. అంతదూరం నేను ఆలోచించలేను. ఈమెబాధను నేను చూడలేకుండా ఉన్నాను. తమరు అనుగ్రహించి ప్రేతాన్ని వెంటనే వెళ్లగొట్టండి మేము ఆ జన్మాంతం తమకు క్రీతదాసులుగా ఉంటాము" అన్నాడు.

శాస్త్రి "కాని, ఈప్రేతాని కింకా తగినశాస్తి జరగలేదు. నీవు కొంచెం గట్టిగాఉన్న కొబ్బరి ఈనెల చీపురు తీసుకురా."

గోపాలుడు "అలా చేయకండి. ఆ దెబ్బలు దాని ఒంటిమీదనే పడతవి."

ప్రేతం "ప్రభూ! అలానే చేయండి."

గోపాలుడు రోదనస్వరముతో "అలా ఎప్పటికీ జరగనివ్వను. తమయుక్తులూ తర్కాలూ నేను విన దలచలేదు. ఈ దేహంలో ఇప్పుడు ఎవరిఆత్మ ఉన్నదీ తెలుసుకున్నందువల్ల నా కేమి వస్తుంది? నాకు తెలిసిందల్లా ఇది: ఈచేతులు రాత్రంతా కూడా నా మెడకు పెనవైచుకుని తృప్తిపడలేదు. ఈవీపును నేను మొదటినుంచీ ప్రేమతో నిమురుతూ వస్తున్నాను. ఈజుత్తు..." అంటూఉండగానే అతని రెండుచెక్కిళ్లమీద అశ్రుధారలు ప్రవహించినవి. కళ్లు తుడుచుకొని మరల చెప్పనారంభించాడు "అంతకంటె, ఈ ప్రేతాన్ని వచ్చి నన్ను ఆవేశించమని ఆజ్ఞాపించండి. అప్పుడు మీఇష్టం వచ్చినట్టు నన్ను కొట్టుకోవచ్చును. నేను ఏమాత్రమూ ఆటంక పెట్టను."

ఈ మాటలు చెప్పి గోపాలుడు భార్యను వెనుక వేసుకుని శాస్త్రముందు మోకరిల్లినాడు.

శాస్త్ర గోపాలునికంక వేలు చూపిస్తూ, ప్రేతంతో — 'పాపిష్ఠురాలా! చూడు, నిష్ఠ అంటే ఏమిటో? ఇతనితో నీ వ్యభిచారప్రకృతిని పోల్చుకో! పైగా ఇతను పురుషుడు, నీవు స్త్రీవి. పాతివ్రత్యంలోనూ, నిష్ఠలోనూ ఉన్న గొప్పతనమే నీకు కనిపించలేదు!" అన్నాడు.

ప్రేతం మరల నేలమీద పొర్లాడుతూ "ప్రభూ! నన్ను క్షమించండి" అన్నది.

"నీ కింత త్వరలో నిష్కృతి కలిగించటం నా కిష్టంలేదు. కాని, గోపాలుని బలవంతంమూలాన అతని భార్యను సాధ్యమైనంతత్వరగా స్వస్థురాలిని చేస్తాను. ఈ పుణ్యాత్మురాలిదేహాన్ని ఆశ్రయించబట్టి నీ వింత తేలికగా తప్పించుకోగలిగావు. సరే, నీకు ముక్తివిషయమై సలహా చెప్పుతానని మాట ఇచ్చాను. అది అయిన తర్వాత నిన్ను వదలిపెడతాను."

ప్రేతం "ప్రభూ! ఈ దుఃఖతురాలి ప్రగల్భతను మన్నించండి. నేను చేయలేనిది మీరు ఉపదేశిస్తే మాత్రం ఏమిలాభం?"

శాస్త్ర "చేయలేనంటే అర్థం? రక్తమాంసాల దేహంతో కూడిన మానవుడే చిత్తసంయమమూ, ఇంద్రియనిగ్రహమూ అవలంబించగలిగితే, నీవు వాయుమయశరీరంతో అనుష్ఠింపజాలవా?"

ప్రేతం తర్జని చూపుతూ "సన్యాసులకు మీకు ఏమి తెలుస్తుంది? మాకంటే మీకు చిత్తబలం అధికం; ఒకవేళ, మీకంటె మాలో వాసనాప్రభావం ఎక్కువ ఉన్నా, దానికి మమ్మల్ని బాధ్యుల్ని చేయటానికి వీలులేదు. చచ్చినాకూడా వారి వారి స్వభావాలు మారవు. ఈశ్వరుడు జీవులకు స్త్రీ పురుష దేహాలతో పాటు సంగలిప్సకూడా ఇచ్చినాడు. దోషమైనట్టయితే ఇచ్చేవాడే కాడు. దీన్ని బట్టి, ఇది మనం అనుశీలించటానికే ఇచ్చినా డని స్పష్టంగా తేలిపోతున్నది. ఈ స్వాభావికలిప్సను తోసివేయటం ఎవరితరమూ కాదు. దీని అస్తిత్వాన్ని ఒప్పుకోనివాడు ఈ స్వభావానికి వ్యతిరేకి అయినా కావాలి; లేక వంచకుడైనా కావాలి. దేవా! ఈ లిప్స రక్తమాంసాలతో కూడిన దేహాన్ని కానీ, సంభవాన్ని కానీ అపేక్షించదు. మానవునికి దైహికసామర్థ్యం రావటానికి చాలాకాలం ముందే ఇది చిత్తంలో ప్రవేశిస్తుందని పండితులు చెప్పుతున్నారు. దీనికి అధిపాకమహారాజు[1] వృత్తాంతమే ప్రమాణము. ఇక చనిపోయిన పిమ్మటకూడా ఇది నిలిచి ఉంటుంది అని చూపించటానికి దృష్టాంతంగా నేను మీయెదుటనే ఉన్నాను.

1. అధిపాకుడు ఒక రాజకుమారుడు. ఇతనిసంగతి ప్రాచీనగ్రంథాలలో ఉన్నది. ఇతను బాల్యంలోనే తల్లిని కామించి అపస్మారరోగగ్రస్తు డవుతాడు. ఇతనిచికిత్సకోసం మహామతి జీవకుని పిలిపించగా, వారు రోగికి సుద్దులు విప్పదీయించి పిరుదులమీద అయిదువందల దెబ్బలు కొట్టమని ఆజ్ఞాపిస్తారు. ఈచికిత్సతో అధిపాకునిరోగం కుదురుతుంది. (నితంబాలలోని నరాలకూ కామోత్సారపద్మానికీ దగ్గరసంబంధం ఉన్నదని ఈ యుగంలోని వైజ్ఞానికులుకూడా ఒప్పుకుంటారు.) ఎడిపస్ రాజు విషయమైకూడా, యూరోపియను గ్రంథాలలో ఇలాంటికథలు చాలా ఉన్నవి. కాని వాటిలో జీవకునిచికిత్స సంగతి లేదు. 'అధిపాకు'ని వికృతఉచ్చారణే ఎడిపస్ అని మనం సహజంగా ఊహించవచ్చును.

నిజానికి ఈలిప్స పుట్టటంకానీ ఉండటంకానీ మనస్సులో; కాయం దీనికి ఆధారం కాదు, కేవలం సాధనోపకరణం. ఇది సర్వవ్యాపి; అజేయము; అవినశ్వరము. దీనిమోహంతోనే పట్టణాల్లోని స్త్రీలు సాయంకాలం అలంకరించుకొని రాజమార్గంపై వున్న కిటికీదగ్గర నిలబడతారు; శాకినీ, మోహినీ, మొదలైన దొంగవేషాలతో చీకటిరాత్రిళ్లు నిర్జనస్థానంగుండా ఒంటరిగా పోతున్న పథికులదృష్టిని ఆకర్షిస్తారు. ముక్తితృష్ణకంటె కూడా ఈతృష్ణ బలవత్తరమైన దని బుధుల అభిప్రాయము; ఇదే ఆత్మకు ప్రథమప్రవృత్తి. చనిపోయినమీదట కూడా స్త్రీ పురుష భేదాలు ఉండటాన్నిబట్టి మనకు ఏమి తేలుతుం దంటే—"

"ఇలా నిన్ను చెప్పుకుపోనిస్తే లాభం లేదు. ఉపన్యాసం కట్టిపెట్టి, ఇక అవసరమైనసంగతులు మాట్లాడు. ఇప్పుడు ఏమిచేయాలని నీఉద్దేశం?"

ప్రేతం చేతులు జోడించి "దేవా! భోగంవల్లనే నివృత్తి కలుగుతుం దని విన్నాను. తృప్తివల్లనే తృష్ణ లయిస్తుంది" అన్నది.

శాస్త్రముఖంమీద కరుణహాసం తొలుకాడింది. నిట్టూర్చి "అయ్యో! దురదృష్టవంతురాలా, ఇప్పటికీ నీకు చైతన్యం కలగలేదా? నే నింకా ఏమి చేసేది?" అన్నాడు.

"మహాప్రభూ! ఏ ఉపాయంతో, నాకు ఎప్పుడు ముక్తి కలుగుతుందో చెప్పండి?"

"అదే చెప్పలేకుండా ఉన్నాను. తృప్తిద్వారా తృష్ణను లయం చేయబోయి, ఆఖరికి నీవు ఏది చేసినా ఏది చేయకపోయినా, సృష్టిలయానికిమాత్రం తోడ్పడతావేమో నని నాకు సందేహంగా ఉన్నది. సరే, ఏదైనా కానీ, నీకు నేను మాట ఇచ్చిఉన్నాను కాబట్టి నాకు చెప్పకతప్పదు."

"చెప్పండి, మహాప్రభూ!"

శాస్త్ర క్షణకాలం ధ్యానస్థుడై ఇలా చెప్పినాడు "ఉత్తరకాలంలో ఈదేశాన 'తృప్తివల్లనే తృష్ణ లయిస్తుంది' అనేవాదం బాగా ప్రచారం కాబోతున్నది. అప్పుడే మీకుకూడా, కావలసినంత తృప్తి పొందటానికి వీలు చిక్కుతుంది."

"ఎలాగు?"

"రసస్రష్టలను ఆవేశించండి."

"మగవాళ్లనా!"

"ఆఁ! ఎందుకు, అంత అమాయకత్వం చూపిస్తావు? పురుషస్పర్శగా మీకు కావలసింది! సరే, కాలాన్నిబట్టి, వెదికితే కొంతమంది స్త్రీలుకూడా చిక్కవచ్చును. వాళ్ల మస్తిష్కంలో ప్రవేశించి, మీరు వారి మానసకన్యారూపంతో వారు రచించే కథలలో నాయికలుగా పుట్టండి. ముద్రాయంత్రాలుకూడ మీకు సహాయపడతవి. ఆస్థితిలో, తృప్తిని పొందటానికి మీకు కావలసినంత వీలు చిక్కుతుంది. ఆ అచ్చయిన కథలపుస్తకాలు తగలబడికానీ చిరిగికానీ నశించటంతోపాటు మీకూకూడా విలయం సంభవిస్తుంది. అదే మీకు ముక్తి."

"అ దింకా చాలా కాలానికిగా!"

"దేనికి అంత ఉత్కంఠత? నిజంగా, ముక్తికోసమా, లేక నీతృప్తి తీరేసుయోగం ఎప్పటికోకాని రాదనా?"

"అయితే నే నిక వెళ్లవచ్చునా, మహాప్రభూ?"

"ఆఁ. ఇంకోమాట — ఈ ప్రపంచంలో ఉన్న ప్రేతాలన్నిటినీ, వెతికి, ఈమాట చెప్పటానికి నాకు తీరికలేదు; ఆపని నీవే చేయి, పో."

వాకిట్లో ఉన్న మామిడిచెట్టుకొమ్మ ఒకటి ఫెళ్లున విరిగిపడింది. గోపాలునిభార్య మూర్ఛిల్లింది.

శాస్త్ర గోపాలునితో— "మూర్ఛ త్వరలోనే తెలుస్తుంది. కాని రోగి చాలా నీరసంగా ఉంటుంది." అని శుశ్రూష చేయవలసినవిధం చెప్పినాడు. స్మృతిరాగానే గోపాలునిభార్య చకితురాలై నాలుక కొరుక్కని, ముసుకు లాగి ఇంకోగదిలోకి వెళ్ళిపోయింది.

శాస్త్ర "ఇక దిగులుపడవలసినపని లేదు. నా అనుచరులు ధర్మశాలలో నాకోసం ఎదురుచూస్తున్నారు. నీవు ఎవరిద్వారానైనా వారికి కబురుచేయి" అని గోపాలునికి చెప్పినాడు.

కొంచెంసేపటికే అనుచరులు గోపాలుని ఇంటికి వచ్చినారు. అప్పుడు కొత్త గ్రామంలో ఉన్నవారి నందరినీ పిలిపించి, వారికి చాలాసేపు ఇంద్రియనిగ్రహాన్ని గురించి ఉపదేశించాడు. వారందరికీ నమ్మకం కుదరటానికిగాను ప్రేతానికి సంబంధించినకథ యావత్తూ చెప్పినాడు. చివరకు గోపాలునితో — "సాయంత్రం అయింది. ఇక నేను వెళ్లుతున్నాను. ఓ, గోపాలుడా! నిగ్రహం లేకపోవటంవల్ల ఎటువంటిఫలితం కలుగుతుందో నీవు కళ్లారా చూచినావు. నీ కింకా కొత్తగా ఏమి చెప్పేది? నీవుమాత్రం ప్రవృత్తికి దాసుడవు కావద్దు. చూడు, ప్రేతంముందు నీ నిష్ఠను ప్రశంసించాను. అంతమాత్రంచేత నీ ఆచరణను నేను సమర్థించానని, నీవు సంతోషించవద్దు; ప్రేతాన్ని లొంగదీయటంకోసమే నే నలా నటించాను. నిజంగా, నీ వన్యాయం స్త్రైణుడిమాదిరిగా ప్రవర్తించావు; అది స్వాభావికబుద్ధికి లక్షణం కాదు; భార్యదేహంమీద ఎక్కువ వాత్సల్యం చూపించటం కామప్రవృత్తిని ఒకవిధంగా వెల్లడించటమే."

ఇంకా యిలాంటి అమూల్యవిషయాలు అనేకం ఉపదేశించి శాస్త్ర అక్కడినుంచి వెళ్ళిపోయినాడు.

గోపాలుడు నిట్టూర్చి "బ్రతికాను, బాబూ!" అనుకున్నాడు.[1]



---

1. అతృప్తివల్ల ముక్తికి విఘ్నం ఘటిల్లుతుంది అనేది ప్రాచీనవాదమే. జాతకకథల్లో అనేకచోట్ల ఈ విషయం కనపడుతుంది.

ప్రేతాలు ఎక్కువగా నవోఢలనే ఆవేశిస్తూ ఉంటవి. ఈ సంగతి ప్రతి పల్లెటూరిముసలమ్మకీ తెలుసును. అందుచేతనే, ముసలమ్మలు నిట్టమధ్యాహ్నమూ, సంధ్యవేళా పిల్లలను ఇంట్లోనుంచి కదలనివ్వరు.

కామప్రవృత్తినిగురించి ఈకాలంలో చాలా పరిశోధన జరుగుతూఉన్నది. ఫ్రాయిడ్, ఎలిస్ మొదలైన విద్వాంసులు పుస్తకాలు రచించకముందు 'సెక్సు'ను సంబంధించినచర్చ జరిగిఉండదని చాలామందినమ్మిక. ఈకథను 'క. చితీ' పత్రికవారు చాలాశ్రమపడి, ప్రాచీనగ్రంథాల్లోనుంచి సేకరించి ప్రకటించినారు. ఇందులో చివరిభాగం మినహా అంతా మూలంలో ఉన్నదే. నేనిది ఆ పత్రికనుంచే అనువదించాను.—'చ క్ర పా ణి'.

# రాష్ట్రీయస్వపరిపాలన సఫలమైనదా?

పండ్రంగి రాజేశ్వరరావు

నూతన రాజ్యాంగ ప్రణాలిక ననుసరించి రాష్ట్రీయ స్వపరిపాలన మమలులోనికి వచ్చినది. ప్రారంభమందుమాత్రము అసందర్భపు పరిస్థితు లేర్పడినవి. రాష్ట్రీయ స్వపరిపాలనను సఫలమొనర్చు వుద్దేశముతో కాంగ్రెసువారు తమ మంత్రివర్గములు చట్ట ప్రకారము సక్రమముగ ప్రవర్తించుచున్నంతకాలము గవర్నర్లు తమప్రత్యేకాధికారములను వుపయోగించకుండునట్లుగా హామీని కోరిరి. ఇట్టి సమాధానమువల్ల పరిపాలన సక్రమముగను సరళముగను జరిగిపోవును. కాని బ్రిటిషుగవర్నమెంటిందుల కొప్పుకొనక పోవుటచేత విషమపరిస్థితు లేర్పడినవి. కీత్ వంటి రాజ్యాంగవేత్తకూడ యీ వైఖరిని ఖండించెను. సప్రూ, శివస్వామయ్యరుగార్లు మాత్రము సమర్థించిరి. ఈ వాద ప్రతివాదములు చెలరేగుచుండగా కాంగ్రెసువా రధికసంఖ్యాకులుగా ఎన్నుకోబడిన ఆరు రాష్ట్రములందు అనామతు మంత్రివర్గము లేర్పడినవి. కాని ఆరునెలల తర్వాత శాసనసభలను సమావేశపరుపవలసి యుండుటచేత యీలోపుననే రాజీ చేసుకోవలె ననెడి అభిలాష యిరుపక్షములకుకూడ యేర్పడినది. నెమ్మదిమీద అందరకును నిజస్థితి తెలియవచ్చెను. అపుడు రాజప్రతినిధి యీవిషయమై ప్రకటన గావించిరి. సాధ్యమగునంతవరకు గవర్నర్లు తమప్రత్యేకబాధ్యతలను వుపయోగించకుండ మంత్రివర్గముయెడ సమరసభావముతో మెలగుదు రని చెప్పిరి. ఈమాట కాంగ్రెసు కోరిన హామీని కొంతవరకు సంతృప్తిపరచుటచే మరి ఆలస్యము చేయక కాంగ్రెసువారు మంత్రివర్గముల నేర్పరిచిరి. ఇప్పటికి మొదటి సంవత్సరము గడచుటయే కాక రెండవసంవత్సరమందుకూడ సగము దాటినది. ఇంతవరకు వచ్చిన అనుభవము ననుసరించి రాష్ట్రీయ స్వపరిపాలన మెంతవరకు సఫలమైనదో యనువిషయమును తెలిసికొనుట చాలా ముఖ్యము.

చట్టప్రకారము రాష్ట్రీయ స్వపరిపాలన సంకుచితమైనదని చెప్పవలసియున్నది. ప్రజలలో వోటింగుహక్కు కొలదిమందికే యుండుటచే ఎన్నుకొనబడినవారు ప్రజాప్రతినిధు లని చెప్పుటకు అభ్యంతరము కలదు. కార్యనిర్వహణ మంతయు గవర్నరు పేరుమీదనే జరుగును. మంత్రులపని సహాయముచేయుట సలహానిచ్చుట మాత్రమే. గవర్నరు యిష్టము ననుసరించియే వీరు తమపదవులం దుందురు. మినహాయింపులకు రక్షణకు ప్రత్యేకబాధ్యతలకు అంతులేదు. ఏదో వక వంకమీద ఏటిని సదా వుపయోగించుటకు అవకాశము కలదు. మంత్రివర్గముల సభలకు గవర్నరు అధ్యక్షత వహించును. ఈపద్ధతి స్వపరిపాలనాసిద్ధాంతమునకు వ్యతిరేకము. కొన్నివిషయములందు మంత్రివర్గముయొక్క సలహాతో నిమిత్తములేకుండ పనిచేయుటకు గవర్నరు

కధికార మున్నది. శాసనసభయొక్క చట్టములను త్రోసిపుచ్చు అధికారము వుండనే వున్నది. అవసరమని తోచినపుడు నిరంకుశ శాసనములను నిరభ్యంతరముగ అమలులో పెట్టవచ్చును. ప్రతిశాఖయందును పనిచేయు పెద్ద అధికారులందరు ఇండియా మంత్రియొక్క తాబేదారులే. ఖజానాపై మంత్రులకు గల అధికారము అతి స్వల్పము. సివిలియనుల జీతములు గవర్నరుకు సంబంధించిన ఖర్చులవిషయమై మాట్లాడుటకు కూడ వీలు లేదు. ఇందుకుసాయము సాంఘిక పరిష్కారము జాతీయతను ధ్వంసము చేయుటయే కాక స్వపరిపాలనకు లేనిపోని అడ్డంకులను తెచ్చిపెట్టినది. ఇట్టి ప్రతిబంధకముల నడుమ రాష్ట్రీయశాసనసభలు, అందులకు బాధ్యులగు మంత్రులు యేమి చేయగలరను అభిప్రాయము సహజముగ యేర్పడును.

ఇప్పట్టున చట్టము ననుసరించి, తు చ తప్పకుండ పరిపాలన చేయుట యెంతవరకు సాధ్యము అనువిషయమే ప్రధానప్రశ్న. రాజ్యాంగప్రణాలిక ఎల్లపుడును నిర్మాతల యొక్క అభిప్రాయములను, ఆదర్శములను అనుసరించి యుండునని తలంచుట పొరపాటు. కాలక్రమమున పరిస్థితుల ననుసరించి మార్పులు జరుగకమానవు. ప్రథమములో కాంగ్రెసు కోరిన హామీని కొంతవరకు తృప్తిపరచలేదా ? రాజకీయ నిర్బంధితుల విడుదలవిషయమై బీహారు, సంయుక్త రాష్ట్రముల మంత్రివర్గములు రాజీనామా నిచ్చినపుడు తిరిగి రాజీ కాలేదా ? ఒరిస్సా రాష్ట్రముయొక్క తాత్కాలికగవర్నరు పదవికి అచట పనిచేయుచున్న సివిలియను వుద్యోగిని ఏర్పాటుచేయు ప్రయత్నముమీద నున్నపుడు కాంగ్రెసు తీవ్ర అసమ్మతిని గ్రహించి ఆ ప్రయత్నమును మానవలసివచ్చినది. బీహారు ప్రభుత్వపు ప్రధానకార్యదర్శి యగు బ్రెట్టు, సివిలియను సెక్రటరీ సంతకము లేకుండ మంత్రులు జారీచేయు హుకుముల ననుసరింపనక్కరలేదని జిల్లా అధికారుల కందచేసిన ప్రకటనకుగాను క్షమాపణకోరెను. మదరాసు ప్రధాని సీలుసేనాని విగ్రహమును మ్యూజియములో పెట్టించినపుడు పార్లమెంటునందలి కలవరము నిరర్థకమైనది. మధ్యరాష్ట్రము గవర్నరు తాను బర్తరఫు చేసిన మంత్రులనే తిరిగి ఆహ్వానించవలసివచ్చినది. ప్రజోపయోగకరమగు చట్టములు సులువుగ అంగీకరింపబడుచున్నవి. పెద్దవుద్యోగుల సహకార ముండదను అనుమానముకూడ తీరిపోయినది. ఇ దంతయు చూడగా ప్రతివారును పరిస్థితులమార్పును గ్రహించి తదనుకూలముగ ప్రవర్తించుచున్నట్టు కనుపించుచున్నది.

వివిధ రాష్ట్రములందు మంత్రివర్గము లెట్లు ప్రవర్తించుచున్నది తెలిసికొనవలసియున్నది. కాంగ్రెసు రాష్ట్రములందు అఖిల భారత కాంగ్రెసు కార్యనిర్వాహక వర్గము వారే పరోక్షముగ బాధ్యత వహించుచున్నారు. అచటి మంత్రులు కాంగ్రెసుయొక్క కీలుబొమ్మలు. ఈపద్ధతి స్వపరిపాలనాసిద్ధాంతమునకు వ్యతిరేకమైనను పార్టీయొక్క అంతస్తుకు సౌష్ఠవమునకు సహాయభూతముగ నుండును. కాని యీపద్ధతిని చివరవరకు కొన"సాగిం"చిన చాల చిక్కులు గలుగును. మధ్యరాష్ట్రములం దిదివరకు ప్రధానిగా నుండిన డాక్టరు ఖరేగారు రాజకీయ రంగమును విడువవలసివచ్చినది. ప్రతివిషయమం

దును అఖిలభారత కాంగ్రెసుసంస్థ జోక్యము కలిగించుకొనిన, మంత్రివర్గము స్వయముగ బాధ్యతవహించు అధికారము లేకపోవుటచే చివరకు నిరర్థక మగును. కాని యీపని అంతయు, స్వలాభాపేక్ష లేక దేశమునంతను ఒక్క తాటిమీద తప్పటడుగులు వేయకుండ నడిపించవలెనను సదుద్దేశముతో, చేయుచుండుటచే అనుకున్నంత నష్టము కలుగ లేదు. చివర కంతయు సక్రమముగనే జరుగునని ఆశించెదము.

కాంగ్రెసు అధ్వర్యముక్రింద లేని రాష్ట్రముల పరిస్థితులనుకూడా పరిశీలింపవలసియున్నది. అచట పైన అధికారము చలాయించుసంస్థ యేమియు లేకపోయినను, అచటివి మిశ్రమమంత్రివర్గము లగుటచే ఒక పద్ధతిమీద పనిచేయుటకు వీలుకాదు. సిద్ధాంతములు ఆదర్శములు అనునవి అసలే లేవు. మంత్రివర్గమునకు ముప్పురాకుండ కాపాడుకొనుటయందే కాల మంతయు వృథాయగుచున్నది. బెంగాలు మంత్రివర్గము అచటి యూరపియనుసభ్యుల సహాయము లేనిదే నిలువజాలదు. అందువల్ల అంగరక్షకులగు ఆంగ్లేయులే బాధ్యత వహించవలసియున్నది. అస్సాముసం దిటీవల కాంగ్రెసు మంత్రివర్గము అధికారమునకు వచ్చువరకు సాదుల్లామంత్రివర్గము అచటి తేయాకు తోటల యజమానులగు యూరపియనుల చెప్పుచేతలలో నుండెను. వారు అందుచేతనే ఎట్లాగైనను కాంగ్రెసుమంత్రివర్గమును పడగొట్టి తమపాతమిత్రులకు పట్టాభిషేకము చేయవలెనను తలంపుతో విశ్వప్రయత్నము చేయుచున్నారు. సింధు మంత్రివర్గముపని దినదినగండమువలె నున్నది. పంజాబునందు పరిస్థితు లనుకూలముగ నున్నను అచటి మంత్రివర్గము రాజభక్తి సహకారములను ఆదర్శముగ నుంచుకొని పనిచేయుచుండుటచే స్వపరిపాలనాప్రసక్తి అట్టే లేదు. వున్న ఆదర్శములు సర్వజనాంగీకృతమగు సిద్ధాంతములుగల రాజకీయసంస్థ అధికారము హస్తగతము చేసుకొనువరకు యీరాష్ట్రములందలి పరిస్థితు లిట్లే యుండును.

సమష్టి బాధ్యతను గురించి కొంచెము చెప్పవలసియున్నది. రాజ్యాంగచట్టమం దీవిషయ మేమియు చెప్పబడియుండలేదు. సలహాపత్రప్రకారము (Instrument of instructions) గవర్నరు-మంత్రివర్గమునడుమ సమష్టి బాధ్యతను సర్వదా పెంపొందించు ఆవశ్యకతను జ్ఞాపక ముంచుకొనవలెను. ఇది అధికారరీత్యా జారీచేయబడ్డ హుకుము కాదు. సలహాపత్రము పరిపాలనావిధానమునుగురించి చక్రవర్తిగారి కోరికను తెలియజేయును. ఈ సలహాపత్రప్రకారము గవర్నరు ప్రవర్తింపకపోయినను అందునుగురించి ప్రశ్నింప వీలు లేదని రాజ్యాంగచట్టమందు స్పష్టముగ చెప్పబడియున్నది. మరిన్ని సమష్టిబాధ్యతాసూత్రము కాలక్రమమున రాజకీయాచారమువలె నభివృద్ధి నొందవలసినదే కాని రాజ్యాంగ చట్టమందు నిర్వచించి ఆప్రకారము అమలులో పెట్టుటకు వీలుపడదని జాయింటు పార్లమెంటరీ కమిటీవారు తమ నివేదికయందు చెప్పియుండిరి. అట్టి ఆచారము బయలుదేరువరకు మంత్రులనడుమ సమష్టిబాధ్యత యుండజాలదని తేటతెల్లమగుచున్నది. బెంగాలు మంత్రివర్గమునకు చెందిన నవాబ్ ముషర్ఫ్ అలీగారికి ప్రధానామాత్యునితో భేదాభిప్రాయము కల్గినపుడు

రాజీనామా నీయవలసిన దని కోరగా రాజ్యాంగచట్టమందు సమష్టిబాధ్యత లేకపోవుటవల్ల తా మట్లు చేయనొల్లమని కచ్చితముగ చెప్పియుండిరి. తర్వాత ఆయనను వదలించుకొనుటకు మంత్రు లందరు రాజీనామా నిచ్చిరి. మధ్యరాష్ట్రములందు ఖరేప్రభృతులు రాజీనామా నిచ్చినపుడు తమకు సమష్టిబాధ్యతతో సంబంధము లేదనియు, తాము అఖిలభారత కాంగ్రెసు కార్యసంఘముయొక్క ఆజ్ఞలకుమాత్రమే బద్ధుల మనియు పట్టుపట్టి రాజీనామా నీయనందుకు మహాకోసలమంత్రులను వేరే గత్యంతరము లేక గవర్నరు బర్తరఫు చేయవలసివచ్చెను. ఇట్లు జరుగుట శోచనీయమైనప్పటికిని యిక ముందైనను అందరు సమష్టిబాధ్యతాసూత్రముయొక్క ఆవశ్యకతను గ్రహించెదరని నమ్మెదము.

ఇట్లా సింహావలోకనము చేసినమీదట కొన్ని సందర్భములందు పరిస్థితు లాశాభంగకరముగ నున్నప్పటికీ మొత్తముమీద రాష్ట్రీయస్వపరిపాలన జయప్రదముగ సాగినదని చెప్పవచ్చును. పాశ్చాత్య దేశములందు ప్రజాపరిపాలన మడుగంటి నియంతలు చక్రము త్రిప్పుచున్న సమయమందు మన దేశమందు రాష్ట్రీయస్వపరిపాలనద్వారా కొంతవరకైనను ప్రజాప్రభుత్వ మమలులోకి వచ్చినందుకు గర్వపడవలెను. రాజ్యాంగ చట్టమందు లెక్కలేనన్ని ప్రతిబంధకము లున్నప్పటికీ చివరకు ప్రజాభిప్రాయమే జయమొందును. రాష్ట్రీయస్వపరిపాలనను స్వీకరించుటవల్ల ప్రజాపరిపాలనకు పునాది వేయబడినది. ఇట్లే వాతావరణ మనుకూలముగ నున్న యెడల అనతికాలములో రాష్ట్రీయస్వపరిపాలన సంపూర్ణముగ సఫల మగుటకు సందేహము లేదు.



# ఒక సంఘటన

పాలగుమ్మి పద్మరాజు

ఇంటిముం దొక కారు ఆగింది. ఒక యువకుడు లోపలికి వచ్చి అడిగాడు, "రుక్మిణమ్మగారున్నారా?" అని.

లలిత చటుక్కున నిలబడి చీర సవరించుకుంటూ కొంచెం ఖంగారుపడుతో అంది: "లోపల స్నానం చేస్తోంది. ఇప్పుడే వస్తుంది. కూర్చోండి" అని కుర్చీ చూపించింది.

అమితమైన సిగ్గు ఆమె నావేశించింది. సంధ్యాకాలపు తమ్మిపువ్వులా, ఆమె తనలోకి తను ముడుచుకుపోయింది. ఈ యువకుడిరాక, దాని ఉద్దేశం తన అక్క తనతో ముందే చెప్పడంచేత ఆమె తన సహజమైన సమతని నిలబెట్టుకోలేకపోయింది.

యువకుడు చిఱునవ్వు నవ్వుతూ కూర్చున్నాడు, అప్పుడప్పుడు లలితవంక చూస్తూ.

"ఓహో! అప్పుడే వచ్చారా మీరు? నే నింకా మొదటి ఘట్టంలోనే ఉన్నాను" అంటూ రుక్మిణి స్నానపుగదిలోంచి బయటికి వచ్చింది.

"ఆడవారికి ఒక పట్టాన్ని తెములవు పనులు" అని ఆ యువకుడు లలితవంక తిరిగి చిఱునవ్వు నవ్వాడు.

"లలితా! ఈయనే ప్రసాద్‌గారు. శాంతినికేతనంలో బి. ఏ. ప్యాసయినారు. మంచి చిత్రకారుడు" అని రుక్మిణి తన చెల్లెలికి ఆయువకుణ్ణి పరిచయంచేసింది

లలిత రెండు చేతులూ కొంచెంగా మోడ్చి, మెల్లగా తనలో తను అనుకున్నట్టుగా "నమస్కారం" అంది. ప్రసాద్ దాన్ని అందుకున్నాడు.

అతని అసలు పేరు ప్రసాదరావు. శాంతినికేతనంలోకి వెళ్లింతరువాత, అతనివ్యక్తిత్వంతోపాటు అతని పేరుకూడా అవస్థాభేదం చెందింది.

రుక్మిణి క్వీన్ మేరీ కళాశాలలో ఉపాధ్యాయిని. లలిత ఇంటర్మీడియేటు చదువుతోంది ఆ కళాశాలలోనే. ఆ అప్పచెల్లెళ్లలో సామ్యం ఏమీ లేదు. ఒకతల్లిదండ్రులకి పుట్టిన ఆడపిల్లలలో అంత స్వభావభేదం ఉండడం ఒకవింత. రుక్మిణి కొంచెం లావు. ఏదో ప్రకృతికోపంవల్ల మగవాడయి పుట్టవలసి మరచిపోయి ఆడదిగా పుట్టినట్టు ఆమె కనిపిస్తుంది. వేగం ఆమె స్వభావం. ఆమెసంభాషణలో చాతుర్యం ఏమీ ఉండదు. ఆమె హాస్యం గంభీరంగా ఎప్పుడూ ఉండదు. ఆమె పకపకమని నవ్వినప్పుడు ఆమెలో పురుషప్రకృతి బాగా కనబడుతుంది. ఆమెకు తన ఆకారసంభాషణాదికాలను గురించిన సంకోచం ఎప్పుడూ లేదు. అసలామె కాధ్యానమే ఉండదు. లలితమాత్రం కేవలం స్త్రీ. ఆమె చాలా తక్కువగా సంభాషిస్తుంది. ఆమెమనసు ఆమెకొక్కతెకే తెలుసును. ఆమె గట్టిగా ఎప్పుడూ నవ్వి ఎరగదు. ఒకవేళ నవ్వినా వెంటనే ఆపుకుంటుంది. పెదవులు బాగా విప్పి నవ్వడం ఆమెకు చాలా సంకోచం. ప్రతి అడుగూ జాగ్రత్తగా చూసుకుంటూ నడుస్తుంది. గాంభీర్యం ఆమెలక్షణం.

అడయార్ దివ్యజ్ఞాన సామాజికులలో రుక్మిణికి చాలామంది స్నేహితు లున్నారు. అప్పుడప్పుడు ఆమె ఇంటికి ఎవరో ఒకరు వస్తూనే ఉంటారు. ఆమెకూడా ఒక దివ్యజ్ఞానసామాజికురాలే. కాని ప్రసాద్ ఆనాడు వారి ఇంటికి రావడంలో ఒక ప్రత్యేకతఉంది. రుక్మిణి ఊరికే అతన్ని పిలవలేదు. అయితే తన ఉద్దేశాన్ని ఆమె ఇద్దరిదగ్గరాకూడా దాచలేదు. క్రితంరోజునే తన చెల్లెలితో ఆమె చెప్పింది: "ఇదుగో! చూడు! అతను రే పిక్కడికి వస్తాడు. చలాకీగా ఉండాలి. తెలిసిందా? మూతి ముడుచుకొని కళ్లు కిందికి వంచుకుని కూర్చుంటే

మాత్రం లాభం లేదు. చలాకీగా ఉన్నవాళ్లని చూస్తే అతనికి చాలాయిష్టం" అని.

అయినా దీనికి తగిన ప్రమాణాలు ప్రసాద్‌తో అంతకీత మే చెప్పింది ఆమె. తన చెల్లెలికి చాలా సిగ్గనీ తన సహాధ్యాయినులతోనయినా కలిసిమెలిసి తిరగదనీ, మనసు విప్పి ఎవరితోటీ మాట్లాడదనీ, కొంతవరకు ఉపోద్ఘాతం ప్రసాద్‌ముందు అయింది. ఈ పరిచయం ఇంతటితో పోతుందని అనుమానం ఆమె కెప్పుడూ లేదు తన చెల్లెలు చిత్రరచనకి ఆదర్శస్వరూపం, ప్రసాద్ చిత్రకారుడు!

చిత్రరచనగురించి రుక్మిణికి అట్టే ఏమీ తెలీదు. చిత్రరచనలో ప్రసాద్ యొక్క విలువ అంతకంటే తెలియదు. ఆమె నాకర్షించింది అతనిస్థితిగతుల విలువ. అతనితండ్రి మద్రాసులో వకీలుగా చాలాకాలం పనిచేసి పేరుప్రతిష్ఠలతోపాటు కావలసినంతడబ్బు సంపాదించాడు. చివరకి ఆయన తనవృత్తిమీదా, అర్థంలేని అనుజీన ధనార్జనమీదా విసుగుచెంది, తన అంత్యదినాలని దైవచింతలో గడపాలనే మహదుద్దేశంతో ప్రశాంతమయిన అడయార్ వాతావరణంలో ఇల్లుకట్టుకున్నాడు. ప్రసాద్‌తో స్నేహం చెయ్యడానికి రుక్మిణి అట్టే కష్టపడలేదు; ఎందుచేతంటే రుక్మిణిని ఎరగనివారెవరూ అడయార్‌లో లేరు. ప్రసాద్ అందరి దృష్టికీ కేంద్రవస్తువు. అతన్ని అందరూ, శాంతినికేతనపుకార్ఖానాలో తయారయిన ఒకవింత ఆటవస్తువుని చూసినట్టుగా చూస్తారు.

ఆనాటిప్రథమపరిచయం నిష్ఫలంగా పోలేదు. రాత్రి వారంతా సినీమాకి పోయారు. లలిత తన సిగ్గుని కొంతవరకూ లొంగదీసుకుని కొంచెం అప్పుడప్పుడు మాట్లాడింది. కాని మాట్లాడడంఅంతు చాలామట్టుకు రుక్మిణిదే. ప్రసాద్ సమాధానంగా తల ఊపేవాడంతే. కాని రుక్మిణికి తన చెల్లెలు అతన్ని ఆకర్షించినట్టుగానే తట్టింది. ఆమె సంతోషానికంతులేదు. వలలో చేప పడినప్పుడు పల్లెవాడెంత సంతోషిస్తాడో అల్లా ఆమె సంతోషించింది. అయినా, తన చెల్లెలుమాత్రం అంత తక్కువది కాదు.

క్రమంగా వారిపరిచయం అభివృద్ధిచెంది స్నేహంగా మారిందనీ, ప్రసాద్ వేళగాని వేళల్లోకూడా వారి ఇంటికి వస్తూఉండేవాడనీ, లలిత ప్రసాద్‌దగ్గర బంగాలీ నేర్చుకుంటోందనీ రుక్మిణికి తెలిసేసరికి ఆమె ఆశ్చర్యానికంతులేదు. తన చెల్లెలికి పరాయి మగవారితో మాట్లాడేటందుకు తగిన ధైర్యం లేదు. అల్లాంటప్పుడు, తనకి తెలియకుండానే వారిద్దరూ చాలాసార్లు కలుసుకుంటున్నారని తెలియగానే, ఆమెకు సంపూర్ణసంతృప్తితో ఆశ్చర్యంకూడా కలిగింది. వారిద్దరి స్నేహానికి మూల మేదో ఆమెకు తెలియదు. తెలుసుకోడానికి ప్రయత్నం ఆమె ఎప్పుడూ చెయ్యలేదు. అంతసిగ్గుగా ఉండే తన చెల్లెలు అతనితో సినీమాలకి ఎల్లా వెడుతూ ఉందో, బీచిరోడ్డుని అతనితో ఎల్లా తిరుగుతోందో ఆమెకుమాత్రం అర్థం గాలేదు. కాని ఈప్రశ్ననిగూర్చి అట్టే ఆమె ఎప్పుడూ గట్టిగా ఆలోచించలేదు. ఆమెకు అర్థమయిందీ, ఆమె అర్థంచేసుకోడానికి ప్రయత్నించిందీ ఇంతవరకే — తన చెల్లెలి భవిష్యత్తు తన కాట్టే శ్రమ అక్కరలేకుండా స్థిరపడిపోతోంది.

౨

లలిత, కిటికీలో కూర్చుని, బయటి తోటలోకి పరధ్యానంగా చూస్తోంది.

రుక్మిణి గబగబా లోపలికి వచ్చి, "నేను ప్రసాద్ ఇంటికి వెడుతున్నాను, నువ్వుకూడా వస్తావా?" అని అడిగింది.

"రాను." లలిత మళ్లీ బాహ్యప్రపంచంలోకి వచ్చింది.

రుక్మిణి లలితపక్కని కూర్చుని నెమ్మదిగా ఆమెను బుజ్జగిస్తో సగం కౌగిలించుకుని, "మరేమీ ఫరవాలేదే. అతనికి తన స్టూడియోలో పని ఎక్కువ. తొందరగా ఉంది. అంచేత రావడంలేదుగాని మరి ఇంకో కారణం ఏమీ లేదు. అతన్నిగురించి దుష్ప్రచారం చేసేవారందరికంటె అతన్ని నేను చాలా బాగా ఎరుగుదును" అంది.

లలిత చిరాకుగా లేచింది. "ఆయన కిక్కడికి రావడానికి వీలు లేకపోతే, అక్కడికి వెడితేమాత్రం ఏంలెలా ఉంటుంది? ఆయన్ని అనవసరంగా కష్టపెట్టడానికి నా కిష్టంలేదు. అయినా ఏమి టిదంతా? ఎవరికెందుకు ఆదుర్దా? ఆయన వస్తే ఏం, రాకపోతే ఏం?"

రుక్మిణి లేచి వెళ్లిపోతూ, "కాముకు లెంత తమా షామనుష్యులో గదా!" అనుకుంది ప్రతీచిన్న విషయం వారిని తలక్రిందు చేస్తుంది. అయినా, అది వచ్చినా ఒప్పుకోరు వాళ్లు!

ప్రసాద్ ఒక నెలరోజులనుంచి వారిని చూడ్డానికి రావటంలేదు. అతని రాకపోకలతో తనకేమీ ప్రమేయంలేదని తెన్నుతాను లలిత ఎంత సమాధానపరుచుకున్నా, ఆమె ఎప్పుడూ కారణాలూ, వాటిఫలితాలూ ఆలోచిస్తూనే ఉంది.

ప్రసాద్‌కి దూరపుచుట్టం ఒకఅమ్మాయి ఉంది. ఆమెపుట్టకక్రితమే ఇతని కామె నివ్వడానికి మాటలు జరిగాయి, వేళాకోళంగానే ననుకోండి. కాని చిన్న నాటి వేళాకోళాలు పరిస్థితులు దూరకుండా ఉంటే నిజా లవడానికి చాలా సావకాశా లున్నాయి. ఆమె కిప్పుడు పదమూడో ఏడు, శారదాబిల్లువయస్సురు అప్పటికి చక్కవలేదు. కాని ఆమెనాటాకి వచ్చే లక్షరూపాయల ఆస్తి, ఆమె వయస్సులోలొరతని బాగా పూడ్చి వేస్తుంది. ప్రసాద్ తండ్రికి ఆపిల్ల బాగానచ్చింది. శారదాబిల్లు అంతగా బాధించదు. పెళ్లిళ్లన్నీ ప్రేమమీదే ఆధారపడిఉండాలని ఆయన నిరభ్యంతరంగా ఒప్పుకుంటాడు గాని, తనకొడుకు ఈపిల్లని ప్రేమించగలగడం విషయంలో ఆయన కేమీ అనుమానం లేదు. ఎంచేతంటే? పిల్ల చాలా బాగుంటుంది, మంచిది. ఈ పదమూడేళ్లపిల్లనీ తను పెళ్లాడడం అసంభవమనీన్నీ, ఏమీ ఎరగనటువంటి ఒకచిన్నపిల్లని వివాహబంధంలో బంధించి ఆమెను మోసగించే మహాపాతకానికి తను కారణభూతుడు కాలేడనీన్నీ తనతండ్రితో నిష్కర్షగా ప్రసాద్ చెప్పివేశాడని మద్రాసులో వాలుపనూల్లా చెప్పుకుంటున్నారు. బాల్యవివాహాలనుగురించి అతని అభిప్రాయాలని అతడు స్పష్టంగానే చెప్పివేశాడట. బాల్యవివాహాలవల్ల బాలవితంతువులు తయారవుతున్నారని అతని నమ్మకం— అయితే, ఈపిల్లని పెళ్లాడినందువల్ల తన భవిష్యత్తుని గూర్చిన సూచన ఏమీ ఇందులో లేదు. కాని తను సంఘసంస్కర్తఅయినందువల్ల దాన్ని ఒకప్రాతిపదికమాత్రంగా అతడంగీకరిస్తాడట. అతని తండ్రిమాత్రం ఈ సమాధానం విన్నతరవాత ఉగ్రుడై, తనఇష్టానికి వ్యతిరేకంగా గనక అతడు నడుచుకున్నట్టయితే, తనసంపాదనలో దమ్మిడీఅయినా అతనికి దక్కదని శ్రీముఖం ఇచ్చాడట!

లలిత ఈ సంగతులన్నీ విన్నతరవాత ఆమెమనస్సులో సందేహం, సంతృప్తీ దెబ్బలాడుకున్నాయి.

నలుగురూ మాట్లాడుకునే మాటల్లో ప్రసాద్ పేరూ తన పేరూ కలియటం ఆమె చాలాసార్లు నిర్లక్ష్యంగా వింది. అయినా వా రిద్దరిమధ్యా ఏవిధమయినమాటలూ జరగలేదు, ప్రసాద్ ఆసంభావణల నన్నింటినీ ఏదృష్టితో చూస్తున్నాడో ఆమెకు తెలియదు.

ప్రసాదంటే తన కిష్టంలేదని గాదు, పరిస్థితు లనుకూలంగా పరిణామంచెందినా అతన్నికాదని త్రోసి వేస్తుందనీకాదు. కాని లేనిపోనివన్నీ కల్పించి మాట్లాడుకోడానికి సంఘానికేమి అధికారంఉంది? ప్రసాద్‌వంటి యువకులు అరుదే. అతనికి ధనసంపత్తే ప్రధానం గాదు. ఏలక్షణాలు యువకుల్ని ఆదర్శప్రాయులుగా, యువతీ ప్రేమకు పాత్రులుగా చేస్తాయో, అవన్నీ అతనిలో ఉన్నాయి. కాని, అతన్ని తన వలలో వేసుకుందామనే నీచోద్దేశంతో అతనిస్నేహం ఆమె కాంక్షించలేదు. వా రిద్దరికీమధ్య నున్నది పరిశుద్ధమైనమైత్రి, ప్రపంచకంలో వ్యక్తికీ వ్యక్తికీ మధ్య ఉండే పవిత్రబంధం. వారి స్త్రీపురుషభేదం కేవలం ఒకసంఘటన. వివాహసంబంధమయినచర్చ ఎప్పుడూ వా రిద్దరిమధ్యా రాలేదు. ఆ విషయంలో అతనిఇష్టం అతనిది.

కాని అతడు తనదూరపు బంధువైన ఆపిల్లని బహిరంగంగా నిరాకరించాడు. ఎంచేత? లలితమీద ప్రేమయే దీనికి కారణమా? ఈమధ్య అతడు తనని చూడ్డాని కెందుకు రావటంలేదు?

ఒకవేళ మొదట్లో అతని కేమన్నా ఉద్దేశం ఉండేదేమో! ఈ నూతనఘట్టాలన్నీ వచ్చింతరవాత తనను చూడడాని కతడు సంకోచిస్తున్నాడేమో!

లలితకి తెలియకుండానే చీకటిపడింది. ఆమె హృదయం ఆ చీకటియొక్క నిశ్శబ్దంలో గబగబా కొట్టుకుంది. ఆదూరపు ఆకాశంలో నీలిలోతులూ, ఆమిణుకుమనే లెక్కలేనితారకాహృదయాలూ, ఈ ఒక్క మానవాదర్శనిఘాతానికే విషాదంతో నిండిపోయాయి.

దాసి వచ్చి వెలిగించిన దీపాన్ని ఆర్పివేసి భోజనం చెయ్యకుండానే ఆ మెపక్కమీదికి పోయి పడుకుంది. దీపపువెలుతురు ఆమె మనోనేత్రాలని మిరుమిట్లు గొలిపింది. ఆమె తనభావనావేగాన్ని సరిగా గ్రహించడానికి వెలుగు అడ్డుపడింది. అందుచేతే ఆమెదీపం ఆర్పివేసింది. ఆ చీకటిలో అనంతస్వప్న ప్రపంచంలోకి ఆమె వెళ్లిపోయింది. ఆ నల్లటితెరమీద తన మనస్సంతృప్తి కలిగించే బొమ్మలు చిత్రించుకుంది. తనకి ఇష్టమయిన కథలు వ్రాసుకుంది.

పగటివెలుగు ఆమె సహించలేకపోయేది. ఆదుర్దాగా రాత్రికోసం ప్రతిరోజూ ఎదురుచూస్తూ ఉండేది. ఆచీకటితెరమీద తను వ్రాసుకున్న భావాలలో మునిగిపోయేది.

## 3

ప్రసాద్ ఒకవేళ ఆ పదమూడేళ్ల పిల్లని పెళ్లాడితే, తన కేమీ లక్ష్యంలేదని, లలిత అస్తమానూ తనలో తను ధైర్యపరుచుకోడానికి ప్రయత్నించేది. సంఘం, వీళ్లమీదా వాళ్లమీదా ఏవో చెప్పుకుని రహస్యంగా సంతోషిస్తుంది. సంఘం ఒక తమాషాజంతువు. లలిత అప్పుడే మూడునెల్లక్రితమే ప్రసాద్ భార్య అయిపోయినట్టు విన్న మాట్లకిన సంఘమే, ఈవాడు, ప్రసాద్, ఆ పదమూడేళ్లపిల్లనీ, ఆమెవెనకనే తప్పిపోకుండా వచ్చే సిరిసంపదలనీ ఎల్లా గ్రహిస్తాడో వింతగా చెప్పుకుంటోంది.

కాని తన అక్కకెందు కంత ఆదుర్దా? ఏదో ఇదివరకే అంతా నిశ్చయ మయిపోయినట్టుగానూ, ప్రసాద్ ఇప్పుడు మాట తప్పిననేరానికి పాత్రు డయినట్టుగానూ ఆమె మాట్లాడుతుంది. అప్పుడప్పు డామె లలితదగ్గరకు వచ్చి, ఎదో మించిపోయినట్టుగా గొంతుకు పెట్టి, "ను వ్వెంత బాధపడుతున్నావో నాకు తెలుసునే తల్లీ! అయినా నాశక్తికొద్దీ ప్రయత్నం చేస్తాను. మాడు మరి. అత డేదన్నా నిశ్చయించుకునేముందు ఎన్ని సంగతు లాలోచించుకోవాలి?..." అంటూ చెపుతుంది.

ముఖం చిట్లించి ఇదంతా విని, లలిత కొంతసేపటి కంటుంది, "ఏమిటే ఇదంతానూ? ఆయనకోసం నే నేమీ పడి చచ్చిపోవడం లేదు, ఆయనిష్టం ఆయనది. మధ్య నే నెవరిని?"

రుక్మిణిమొగంమీద ఆందోళన ముద్రించినట్టు కనబడుతుంది. ఆమె నడవడిలో చాపల్యం కనబడుతుంది. తన చేతుల్లోంచి దాటిపోయే ఒకపిట్టని పట్టుకోడానికి నిస్పృహతో ఎదురుతో ఉన్నట్టుగా ఉంది ఆమెధోరణి.

"అయినా అతను మంచివాడే. కాని పైని తండ్రి ఉన్నాడు. సరే, చూద్దాం పెళ్లి ఇప్పుడెల్లా అవుతుందో. క్రొత్తకారదాబిల్లుకూడా వచ్చిందిగదా. ఇంకా ఏడాదిపైగా ఆగాలి అతను. ఈలోపుగా ఎన్ని మార్పు లయినా రావచ్చు" అని తనమనస్సులోని ఆలోచనలని పైకి అనేస్తూ ఉంటుంది ఒక్కొక్కసారి.

లలిత వెంటనే, చాలా విసుక్కున్నట్టుగా, "నీకు మొత్తంమీద మతిపోయినట్టుగా ఉంది. నన్ను పెళ్లిచేసుకుంటానని ఆయ నేమన్నా రాసి ఇచ్చారా ఏమిటి? అసలా సంభావనే ఎప్పుడూ రాందే! ఆయన ఉద్దేశం ఏమిటో మన కసలు తెలియదు. ఊరికే స్నేహరీత్యా మన ఇంటి కాయన వచ్చేవాడు. అంతే" అనేది.

కాని అది "అంతే!" కాదని లలితమనస్సుకే తెలుసును. ఆమెహృదయంలో లోతుగా ఒకమూల, ఆ స్నేహం ఊరికే నిమిత్తమాత్రం గాదనే విశ్వాసం గాఢంగా నాటుకుపోయి ఉంది.

ఆమెభావనా ప్రపంచంలో అతను ఏమృదుతల్పంమీదో, ఏపండు వెన్నెల్లోనో, హృదయవేదనచేత నిద్రరాక దొర్లుతూ ఉంటాడు. అతని మనస్సుని రెండు మహాశక్తులు రెండువైపులకీ లాగుతున్నాయి. ఒకటి ప్రేమశక్తి; రెండవది, తండ్రి ఆజ్ఞాపాలనం. రెండవప్రక్క ఇంకొక బలంకూడా ఉంది – ఆపిల్లఆస్తి. ఆ ఆకర్షణని ఆపగలిగినంతశక్తి అతనిప్రేమకి ఉందా లేదా అని ఆమె ఆలోచించుకుంటూ ఉంటుంది.

ఎప్పుడో ఒకప్పుడు ఆ మహాసంఘర్షణచేత రక్తపంకిల మయిపోయిన తనహృదయాన్ని విప్పి ఆమెకు చూపిస్తాడని ఆమె నిరంతరమూ ఆశిస్తూఉంది. ఎప్పుడో అతడు తన ప్రేమనిగూర్చి చెపుతాడు. తను పడినబాధ నంతనీ వర్ణిస్తాడు. ఆమెముందు తనముఖాన్ని చూపించడానికి ఎంత సంకోచించాడో, అయినా ఆవిలంబన

అతని కెంత అసహ్యజనకంగా ఉండేదో అంతా వర్ణిస్తాడు. తప్పకుండా, అతనిబాధ, ఆమె బాధకంటె చాలా గొప్పది. ఈ దీర్ఘ వాసరాలలో తను సహించిన బాధనంతనీ ఆమె తప్పకుండా మరిచిపోయి అతన్ని క్షమించగలదు.

౪

"ప్రసాద్ దగ్గరనుంచి నీ కేమన్నా వచ్చిందా?" అని రుక్మిణి లలిత నడిగింది, ఎక్కడికో వెళ్లడానికి తయారవుతో.

"లేదు". అత డెందుకు రాస్తాడు? ఇంతకాలం రాయలేదు, ఇప్పుడంత ఏమి అవసరం వచ్చిందని రాస్తాడు?

రుక్మిణి గబగబా ఎక్కడికో వెళ్లిపోయింది. లలిత ఆలోచిస్తూ పడకకుర్చీలో పడుకుంది.

కొంతసేపటికి ఎవరో ఒకనౌకరు వచ్చి ఆమెచేతి కొక ఉత్తరం ఇచ్చి వెళ్లిపోయాడు. లలిత ఉత్తరం విప్పింది.

అది ప్రసాద్ రాశాడు. ఒకగంటక్రితమే తన అక్క అడిగింది, అతనిదగ్గరనుంచి ఏమన్నా ఉత్తరం వచ్చిందా అని. ఇప్పుడే ఉత్తరం వచ్చింది. దీనిఅర్థం ఏమిటి?

"శ్రీమతి లలితకు,

"నేను చాలాకాలంనుంచి మీయింటికి రాలేక పోయినందుకు చాలా విచారం."

ఎందుచేత?

"మన ఇద్దరిపేరులూ నలుగురి నోళ్లలోనూ కలిశాయి. ఈసంగతి నీకు తెలిసే ఉంటుంది. దీనికి నేనుకారణభూతుణ్ణయాను."

అత నొక్కడే కారణభూతు డెల్లా అయాడు? బాధ్యత ఇద్దరిమీదా సమానంగానే ఉంటుందిగా.

"అందువల్ల విచారించాలో సంతోషించాలో నాకే తెలియదు."

అబ్బ! ఎంతనిర్లక్ష్యం? ఇంత అసహ్యంగా ఉత్తరం రాస్తాడని ఆమె ఎప్పుడూ అనుకోలేదు. ఉత్తరమంతా శుద్ధనటన.

"నాఅంతట నేను ఇప్పుడు చెప్పడాని కేమీలేదు. నేను నీకేవిధమయిన బాధన్నా కలగజేశానేమో నని భయపడుతున్నాను."

ఓ! చాలా బాగుంది. అయితే ఇంక ఈఉత్తరం రాయడ మెందుకు?

"నేను నిన్ను వివాహం చేసుకునేసందర్భంలో నీకోసం నే నెంత పోట్లాడుకోవాలో నీకు తెలిసే ఉంటుంది."

పోట్లాడుకోమని ఎవ రన్నారు? తనేమన్నా సాష్టాంగపడి ప్రార్థించిందా?

"నేను మీయింటిదగ్గర ఎల్లుండి నిన్ను కలుసుకుంటాను. అప్పటికి నే నేదో ఒకనిశ్చయానికి రాగలను.

ఇట్లు,
ప్రసాద్."

లలిత తనకు తెలియకుండానే పళ్లు కొరికింది. ఆమెచేతులో ఆ ఉత్తరం నలిగి ఉండయిపోయింది.

గబుక్కుని ఒకకాగితంతీసి, తను రాయగలిగినంత వేగంగా ఆ ఉత్తరానికి జవాబు రాసింది.

"శ్రీయుతులు ప్రసాద్‌గారికి,

మీరు దయతో రాసిన ఉత్తరం అందింది. నాకోసం మీ రేమీ పోట్లాడుకో నక్కరలేదు. నేను మీయెడల ప్రేమలో కుత్తుకబంటిదాకా మునిగిపోయి ఉన్నా ననుకోడానికి తగినంత సూచన లేవీ చెయ్యలే దనుకుంటాను. ఒకసామాన్యస్నేహాన్ని మీ రింకొక విధంగా అర్థం చేసుకున్నట్టయితే, అది కేవలం మీపొరపాటు. మీరు నాతో ఈ విషయమయిదే మాట్లాడదలచుకున్నట్టయితే మీరు ఎల్లుండి మాయింటికి శ్రమ తీసుకుని రానక్కరలేదు.

ఇట్లు,
లలిత."

వెంటనే సేవకుణ్ణి పిలిచి ఆ ఉత్తరం పోస్టులో వేయించింది.

కొంతసేపటికి రుక్మిణి ఎక్కడినుంచో ఆదుర్దాగా వచ్చి, "ప్రసాద్‌దగ్గరనుంచి ఉత్తరం వచ్చిందా?" అని అడిగింది.

"ఆ. దానికి జవాబుకూడా రాశాను అప్పుడే?"

"ఏమని రాశావు?"

"ఏమనా?" లలిత త్రాచులా లేచింది. "తగిన సమాధానమే రాశాను. అంత అసహ్యంగా ఉత్తరం రాస్తే అర్థం ఏమిటి? నే నేదో కాళ్లమీదపడి బతిమాలి నట్టుగా అర్థంచేసుకున్నట్టున్నా డాయన."

రుక్మిణి స్థాణువులా నిలబడిపోయింది.

"ఏమి టీపిల్ల? ఒకచిన్నతరుణం చేయిజారి పోయినా ఇంక లాభం ఏమీ ఉండదు. తెలుసునా?"

"తరుణాలకోసం ఎవరూ ఎదురుచూడ్డం లేదు. ఏమీలేనిచోట నువ్వు ఏవో నాటకాలు కల్పిస్తావు. నువ్వు ఆయనచేత ఆ ఉత్తరం ఎందుకు రాయించావు?"

ఇంక లలితతో మాట్లాడడంవల్ల లాభం లేదని రుక్మిణికి అర్థమయిపోయింది. ఆమె తొందరగా వచ్చిన దారినే — పరిస్థితులు ఇంతకంటే సులువుగా ఎక్కడయితే మార్పవచ్చో అక్కడికి గావును — వెళ్లి పోయింది.

కాని లలిత అస్థైర్య స్థైర్యాలని అట్టే కాలం నిలుపుకో లేకపోయింది. రుక్మిణి వెళ్లిపోవడంతో నే ఆమె, పరుపుమీద బోర్లగిల పడుకుని, తనముఖాన్ని తలగడాలో దాచి చాలాసేపు ఏడ్చింది.

—*—



# నిషేధము

పుట్టపర్తి నారాయణాచార్యులు

మరచిపోనిమ్ము నన్ను, దుర్భరవిషాద
బాధ, నరములు గదలించు పాతపాట,
అది తలపు దాకెనా! లోకమంత, కటిక
చీకటికోటారుగా మారు, చెదరు గుండె,
కనులు మూతలు వడును, నా గళమునందె,
తీవ్రభావధ్వనులు నినదించిపోవు,
సుఖమొ, దుఃఖమొ, యేటికీ వోదె మనసు,
చెప్పకుము! శోకముగ్ధనిశీథగీతి.

---

# ఆధునిక హిందూధర్మం

## గౌరావఝుల వెంకటసుబ్బరామయ్య

ప్రాచీన హిందూధార్మిక ఇతిహాసాన్నికూడా సామాజిక, నైతిక ఇతిహాసములవలెనే అనేకభాగములుగా విభజించవచ్చు. ఇక్కడి సామాజిక, ధార్మికజీవనంలో ప్రాచీనకాలంనుండి ఘనిష్ఠసంబంధం ఉంది. ఈరెంటిలో ఏ ఒకదానిలో మార్పు కలిగినా, రెండవదానిలో అనివార్యముగా మార్పు కలుగుతూవచ్చింది. వైదికకాలంలో ఇక్కడి సామాజికజీవనం సహజమైనది, స్వాభావికమైనది, అకృత్రిమమైనది, ఆడంబరరహితమైనదిగా ఉండేది. కనుక వైదికధర్మంకూడా ఆడంబరరహితమైనదిగా ఉండేది. ప్రతిఒక్క గృహస్థు ధార్మికసూత్రధారుడుగా ఉండేవాడు. జనులు భగవదారాధన స్వయముగా చేసుకునేవారు.

కాని సభ్యత వికసించినకొద్దీ కర్మక్షేత్రం విస్తృతం కాజొచ్చింది. క్రమేణ గొప్పగొప్ప సామ్రాజ్యాలేర్పడ్డాయి. ఐశ్వర్యవైభవాలు వృద్ధికాజొచ్చాయి. వైదికకాలంలో సారవంతమైన భూములను వెదుకుటలో మగ్నులై ఉండేవారు రాజ్యాధిపతులై, కష్టపడి సంపాదించిన బల, వైభవములను అనుభవింపసాగారు. ఆర్యజాతి కర్మక్షేత్రమునుండి భోగక్షేత్రంలోకి దిగింది దీనికి ఉదాహరణ 'మహాభారతం' ప్రతిపుటయందు కాన్పించు -.

ఇది సామాజిక జీవనమందుకూడా తనప్రభావమును ప్రదర్శింప సాగింది. సకలైశ్వర్యసంపన్నులైన రాజులతో కలసి మెలసి ఉండేవారు, వారిఆస్థానాలలో ఉండేవారు నిరాడంబర జీవితమును ఎలా గడుపగలరు? అసంభవమే. అవసరములు ఎక్కువైనాయి జనులలో అధికారేచ్ఛ ప్రబలింది. జనులు భోగవిలాసములందు తగుల్కొనినందువల్ల ఆడంబరం ఎక్కువైంది. ఐశ్వర్యప్రదర్శనంకూడా ప్రబలింది. కర్మక్షేత్రం విస్తరించినందున ఒకమనిషే వీటి నన్నిటిని నిర్వహించ అశక్తుడైనాడు. దీనికై ఇతరులను యాచించవలసివచ్చింది. అప్పుడు వర్ణవిభాగం ప్రారంభమైంది.

ఆ కాలపు వాతావరణంవల్ల ధర్మం చలింపసాగింది. దాని స్వాభావికత తగ్గిపోసాగింది. వర్ణవ్యవస్థ కనుకూలంగా ధర్మనిరీక్షణ బ్రాహ్మణులచేతిలోకి వచ్చింది. ఆకాలంలో బ్రాహ్మణులకు మంచిపేరే వచ్చింది.

అధికారాభిరుచి సర్వత్ర వ్యాపించేఉంది. బ్రాహ్మణులుకూడా తమ మర్యాదను కాపాడుకునేందుకు తమ గౌరవమును చిరస్థాయిగా చేసుకునేందుకు గట్టి ప్రయత్నంచేశారు. కాని క్షత్రియులు వీరికి తీసిపోలేదు. వారు దీని నెన్నడైనా సహించగలరా? వారు తమతక్కువను ఒప్పుకుంటారా? ఇందుకై ఒకరియెడ ఒకరికి వైమనస్యం ఏర్పడ్డది.

మహాభారత మీమాంసానుసారం ఈ వైమనస్యం చాలా ప్రాచీనకాలంనుంచే ప్రారంభమైంది. బ్రాహ్మణ. పిల్లవాడు బ్రాహ్మణుడు, క్షత్రియపిల్లవాడు క్షత్రియుడే కావాలని బ్రాహ్మణుల పట్టుదల. ఒకవేళ క్షత్రియబాలుడు తన బుద్ధిశక్తిని పెంపుచేసుకుంటే బ్రాహ్మణుడవటానికి ఏమీ ఆటంకం ఉండకూడదని విశ్వామిత్రుని వాదం.

సమాజంలో జీవనం, ఉత్సాహం ఉండేటంతవరకు బ్రాహ్మణాధికారములను తగ్గించి తమ అధికారము స్థాపించవలెనని అనేకసార్లు క్షత్రియులు ప్రయత్నించారు. మహాకావ్యములు పుట్టినకాలంలోకూడా ఇటువంటి ప్రమాణములు కనబడుచున్నవి. మరల కొంతకాలానికి బౌద్ధమతప్రవాహం వచ్చింది. క్షత్రియులకు సందు చిక్కింది. వారు దేశంలో దానిస్థాపన, ప్రచారముచేసి బ్రాహ్మణాధిపత్యాన్ని తొలగించేందుకు ప్రబల ప్రయత్నంచేశారు. కాని బ్రాహ్మణుల యుక్తిముందర

వారి ఆటలేమీ సాగలేదు. ఆఖరుకు తలవంచవలసి వచ్చింది. బ్రాహ్మణులు స్వయముగా బుద్ధుని భగవంతుని అవతారమని చెప్పి, అతని సిద్ధాంతాలను కొంత మార్పుతో తమధర్మములో చేర్చుకొని బౌద్ధ మతాన్ని భారత దేశంనుంచి సాగనంపారు.

ఇందువల్ల పౌరాణిక కాలంలో వైదికధర్మ స్వరూపం మరల మారింది. రానురానే ఇచ్చటి ధార్మికోద్దేశాల్లో మార్పుకలిగింది. పూర్వాపర ధర్మాల్లో ఆకాశపాతాళ వ్యత్యాసం కలిగింది.

ఆదివైదికధర్మం నిరీశ్వరుల సంకుచితబుద్ధివల్ల, స్వార్థపరత్వంవల్ల మహాకావ్యయుగంలోనే విషమ స్థితికి వచ్చింది. ధర్మాచారంలో అడుగడుగునా నియమా లేర్పడ్డాయి. సరళ, స్వాభావిక దైవపూజకు బదులు, ఆస్థానంలోకి ఆడంబరంతో కూడిన యజ్ఞాలు, అగ్నిహోత్రాలు వచ్చాయి. యజ్ఞాలకు చాలా డబ్బు ఖర్చు పెట్టేవారు. అనికూడా చివరకు నియమాల్లో చిక్కుకున్నాయి. బుద్ధుని పుట్టుకకు ఇవి ఇంకా విషమస్థితికి వచ్చాయి.

బుద్ధుని పుట్టుకకు పశుయజ్ఞం ప్రబలిపోయింది. నిరపరాధ, నిస్సహాయ పశురక్తంతో యజ్ఞవేదిక తడిసిపోయేది. పుట్టుక మొదలు చావులోపల ప్రతిఒక్కడు యజ్ఞం విధిగా చేసితీరవలె. దక్షిణ ఇవ్వనిదే యజ్ఞం నిష్ఫలమని తలంచేవారు. కనుక వీటివల్ల బ్రాహ్మణులకు చాలాలాభం కలుగుతూ వచ్చింది. ఇదే వారిముఖ్య జీవనం. సమాజం బ్రాహ్మణులచేతిలో చిక్కిపోయింది. ఆ సమాజంయొక్క ఆత్మ, అజ్ఞానాంధకారంలో చిక్కుకొని కొట్టుకుంటూ, జ్ఞానప్రకాశంకొరకు ఎదురు చూస్తున్నది.

ఈఘోర అనర్థాన్ని తొలగించటానికి మొదట జ్ఞానవర్ధనుడు ప్రయత్నించాడు. లోకానికి పరమేశ్వరుని సాక్షాత్కారమును చూపించ ప్రయత్నించాడు. ఫలితమేమంటే, ఉపనిషత్తులు సృష్టించి క్షత్రియులు అఖండ కీర్తిని పొందారు. ఆత్మగర్వులు, స్వార్థాంధులైన బ్రాహ్మణులమీద, తమ శ్రేష్ఠతర జ్ఞానముద్రికను స్థాపించారు. ప్రపంచంలో, ఏజాతిలో, ఏభాషా సాహిత్యంలో, ఇంత శ్రేష్ఠమైన, దార్శనిక భావములతో కూడిన, సర్వాంగసుందరమైన గ్రంథం లభ్యపడదు.

"జీవ నిర్జీవ వస్తువులన్నీ పరమాత్మని ఆత్మజనితములే; అవన్నీ అతని అంశములే" అని జనులకు బోధింపసాగారు. కర్మకంటె, జ్ఞానానికే ప్రధానత ఇవ్వబడ్డది. ఆత్మ, పరమాత్మల సంబంధమొదలైన గూఢవిషయాలను గురించి బాగా తర్కించారు. పునర్జన్మ సిద్ధాంతాలుకూడా మొట్టమొదట ఉపనిషత్తుల్లో క్షత్రియరాలైన "చిత్రగార్గ్యాయణి"వల్ల రచింపబడినవే. కాని యీజ్ఞానబోధ మరుభూమిలో పడు నీటి బిందువులవలె నిష్ఫలమైంది. మేఘావృతమైన ఆకాశాన్ని రెండు మూడు నక్షత్రాలు ఆ అంధకారమును పోగొట్టగలవా? జనులు ఈ జ్ఞానభాండారమును సైతము దురుపయోగం చేసేంత పదభ్రష్టులను చేశారు ధర్మనిరీక్షకులు. సారగర్భితమైన ఉపనిషద్విషయాల్లో వితండవాదం చేసేందుకు జనులకు మంచి అవకాశం చిక్కింది. ద్వైతాద్వైత విశిష్టాద్వైతమత మతాంతరములు, సాంఖ్య వేదాంతవైషమ్య సిద్ధాంతాలు జనుల హృదయాలను డోలాయమానము లొనరించినవి. ఏది మంచిదో, ఏదికాదో, గుర్తించు పరిజ్ఞానం జనులలో అంతరించింది. జనులలో అశాంతి ప్రబలిపోయింది.

రానురానే ధార్మిక అశాంతి మితిమించిపోయింది. తమ అధికారములను నెలకొల్పవలెనను ఉద్దేశంతో స్వార్థాంధులైన బ్రాహ్మణులు హద్దుదాటిపోయినారు. ఇటు క్రమేణ నిస్సారకర్మకాండయందు జ్ఞానపురుషుల ద్వేషం పెరిగిపోయింది. వారికి సమాజంయొక్క కృత్రిమ జీవనం కష్టం కలిగించింది. సత్యాన్వేషకులు తమ ఇండ్లను వదలి అడవులయందు నివసింపసాగారు.

క్షత్రియులకు బ్రాహ్మణాధికారములను తొలగించుటకు ఇంతకంటె మంచిఅవకాశం ఎక్కడ దొరుకుతుంది?

"యదా యదాహి ధర్మస్య, గ్లాని ర్భవతి భారత
అభ్యుత్థాన మధర్మస్య, తదాత్మానం సృజా మ్యహం"

అను భగవత్ప్రతిజ్ఞను చరితార్థం చేయుటకు మంచి తరుణం చిక్కింది. ఇందుకుగాను బుద్ధభగవానుడు

ధర్మసంస్కారానికీ, సమాజోద్ధరణానికి అవతరించాడు. కుహకభోగాల్లో మునిగిఉన్న బ్రాహ్మణులకు యీ ఆకస్మిక ఆఘాతం విచిత్రంగా కాన్పించింది. వారు మొదట తమ్ము తాము సంబాళించుకోలేకపోయినారు. ఆప్రవాహంలో కొట్టుకోపోవలసివచ్చింది. దేశమంతా బౌద్ధమయమైంది. కనుక కొంతకాలంవరకు వైదిక హిందూధర్మం మృతప్రాయముగా ఉంది.

ఇంతలో మరల కాలచక్రం తిరిగింది. ఒకరితో ఒకరికి కలహాలు పెరిగాయి. రెండుధర్మాల్లో పరస్పర సంఘర్షణ ఏర్పడ్డందువల్ల చాలామార్పు కలిగింది. ఆ మార్పువల్ల ఆధునిక హిందూధర్మం మార్పుచెందిన వైదికధర్మమో లేక మార్పుచెందిన బౌద్ధధర్మమో చెప్ప వీలులేకపోయింది. సనాతనధర్మంకూడా తన అస్తిత్వమును నిలబెట్టుకునేందుకు కొద్దో గొప్పో మార్పుచెందవలసివచ్చింది. ఇక బౌద్ధులో! తమ మతాన్ని సర్వప్రియంగా చేయగలందులకు హిందూ ధర్మసిద్ధాంతాలను కొన్నిటిని తమ ధర్మంలో చేర్చుకున్నారు. రెండిటి కలయికవల్ల భారతదేశంలో క్రొత్తధర్మం ఒకటి పుట్టింది. అదే పౌరాణికధర్మం. ఈ పౌరాణిక ధర్మంలో రెండు ధర్మాలఛాయలు స్పష్టంగా కనిపిస్తున్నవి.

మొదట ప్రచలిత మార్గానుసారం బౌద్ధధర్మం కూడా సన్యాసమార్గంతో చాలా సాదృశ్యంగా ఉండేది. మహావగ్గ(౫—౧—౨౪)లో యీ విధంగా ఉంది:

"ఏభిక్షువైతే నిర్వాణమార్గంవరకు చేరుతాడో, అతనికి ఏకర్మకూడా మిగిలిఉండదు; అంటే చెయ్యవలసిన పనిలేదు. మరియు అతనికి చేసిన కర్మఫలితం అనుభవించ నవసరంలేదు." ఉపనిషత్తుల్లోని సన్యాసమార్గానికి దీనికి చాలా సంబంధంఉంది.

బౌద్ధధర్మం మూలసిద్ధాంతాలలో భగవంతుని అస్తిత్వమును వప్పుకోలేదు. బుద్ధభగవానుని భవ్యమూర్తి, వారిపావనచరిత్ర జనులఎదుట నున్నంతవరకు, జనులకు భక్తిమార్గాన్ని బోధించనవసరం కలుగలేదు. కాని వారు నిర్వాణము పొందినపిదప సాధారణజనులకు ఈ శుష్క, నిరీశ్వర సన్యాసమార్గం బోధకాలేదు; అంటే, బుద్ధుని సిద్ధాంతప్రకారం, నిర్వాణప్రాప్తికై, ప్రపంచంనుంచి సన్యసించి భిక్షుకులవలె జీవితంగడపటం ముఖ్యావసరం. కాని జను లందరు సంసారమును వదలి సన్యాసులు కాగలరా? ఇది సృష్టికే విరుద్ధం. సర్వులకు దీనిని బోధించవలె ననుకున్నారు. కనుక విధిగా దీనిలో కొంతమార్పు చెయ్యవలసి వచ్చింది. తత్ఫలితంగా అప్పుడు "మహాయాన సాంప్రదాయం" పుట్టింది. ఈ సాంప్రదాయ ప్రకారం బుద్ధుడు భగవంతుని అవతారము. బుద్ధుని అనుచరులు, ప్రధానమత ప్రవర్తకులు బోధిసత్వుల స్థానాన్ని ఆక్రమించారు. జనులు బుద్ధుని, బోధిసత్వులను దేవీ, దేవతలుగా భావించి పూజింపసాగారు; అంటే బౌద్ధమతం శుష్క సన్యాసమార్గంనుంచి సరస భక్తిమార్గంలోకి దిగిందన్నమాట. ఈసిద్ధాంతప్రకారం గృహస్థుకూడా భక్తిద్వారా నిర్వాణప్రాప్తిని పొందవచ్చు. చూచారా! ఎంత మార్పు కలిగిందో!

వైదికహిందూధర్మంకూడా బౌద్ధమతంతోపాటు మార్పుచెందవలసి వచ్చింది. లేకపోతే యీధర్మాన్ని అవలంబించే దెవరు? భారతదేశంలోనేకాక విదేశాలలోకూడా బౌద్ధమతం తనఅధికారాన్ని వహించింది. యీతాకిడికి తాళలేక అనేకమతాలు, ధర్మాలు నశించినవి. ఒకవేళ యీబౌద్ధమత ప్రళయానికి తట్టుకొని ఏధర్మమైనా నిలిచిఉంటే మార్పుమట్టుకు విధిగా చెందితీరింది. విదేశాలలోనే బౌద్ధమతం ఆధిపత్యం వహించిందంటే, వైదిక హిందూధర్మం మార్పుచెందకుండా ఉండగలదా?

ఇంతవరకూ వైదికధర్మం మహాభూతాధిష్ఠాతలైన దేవతలయందే తనగాఢభక్తిని నెలకొలిపిఉంది; అంటే ఇం, ద్రాగ్ని, సూర్య, మరుత్ మొదలైనవారి పేరుతో యజ్ఞాలు జరిగేవి.

ఉపనిషత్తులలో పరమేశ్వరుని అధికార ఐక్యతలు ప్రతిపాదింపబడినవి. దేవుడు ఒక్కడేనని వప్పుకున్నా, జనులకు, భౌతికశక్తులు వేరు, పరమేశ్వరుడు వేరనిన్నీ, ఆభౌతికశక్త్యధిష్ఠాతే పరమేశ్వరుడనిన్నీ నమ్మకమున్నది. కాని యీశక్తులు పరమేశ్వరుని అంశములేననునమ్మకం జనులలో లేదు.

పౌరాణికకాలంలో యీభౌతిక దేవతలకు గౌణస్థానం ఇచ్చారు. దీనికి ముఖ్యకారణం క్షత్రియుల

ద్వారా ఉపనిషత్తులలో ప్రతిపాదింపబడిన ఏకేశ్వర సిద్ధాంతమును వైదికధర్మంలో చేర్చడమే. క్రమేణ జనులకు ఏకేశ్వరునియందే శ్రద్ధాభక్తులు, నమ్మకం ఎక్కువైనవి.

కాని బౌద్ధమత ప్రవాహం ఆ ఏకేశ్వరవాదాన్ని కూడా స్థిరంగా ఉండనివ్వలేదు. పరబ్రహ్మకు సృష్టికర్త, పాలకుడు, సంహారకర్తఅను మూడురూపా లేర్పడ్డాయి. అదిగాక పౌరాణిక పరమేశ్వరుడు త్రిదేవ స్వరూపంగా వర్ణింపబడ్డాడు. బహుశా ఈ త్రిదేవ స్వరూపసిద్ధాంతం బౌద్ధమతంనుంచి గ్రహింపబడి ఉంటుందేమో! ఇదేకాదు, తత్కాలమందు ఉండే సమస్తధర్మాల్లో యీ కల్పన స్పష్టంగా గోచరిస్తున్నది. క్రైస్తవ ధర్మపిత—పుత్రుడు—పవిత్రాత్మ (Father Son and the Holy ghost) సిద్ధాంతం, హిందువుల త్రిమూర్తుల సిద్ధాంతం, బౌద్ధుల త్రిరత్నముల (బుద్ధుడు, ధర్మం, సంఘం) సిద్ధాంతంతో సరిపోవుచున్నది. కనుక ఆకాలపు సమస్త ధర్మాల్లో బౌద్ధమత సిద్ధాంతాలు కొద్దో, గొప్పో ప్రవేశించినాయని చెప్పకతప్పదు.

ఋగ్వేద ప్రథమమండలం ౧౩౯ సూక్తాధారం వల్ల వైదికకాలంలోనే దేవతలను మూడు విభాగములు చేశారని చెబుతారు. కనుక ఋగ్వేదకాలపు, పౌరాణికకాలపు విభాగాల్లో నలుసుకూడా సమానత లేదని స్పష్టంగా తెలుస్తున్నది.

వైదిక కల్పనప్రకారం జలము, పృథ్వి, ఆకాశములయందు ఒక్కొకదానికి ౧౧ రు చొప్పున 33 గురు దేవతలు ఆధిపత్యం వహించారు. కాని పౌరాణిక కాలపు వర్ణన దీనికి కేవలం విపరీతంగా ఉంది. ఇచ్చట ఒక బ్రహ్మే సృష్టి, స్థితి, లయ అను మూడు శక్తుల భిన్నస్వరూపంగా వర్ణింపబడ్డాడు. పౌరాణిక త్రిమూర్తులు మూడు భిన్న స్థానాధిపతులుగా లేరు. కేవలం కర్మ ననుసరించి త్రిగుణాత్మకద్యోతకులుగామాత్రం ఉన్నారు. త్రిమూర్తుల యీకల్పన మనువుసమయం వరకు అజ్ఞాతంగానే ఉన్నది.

పై స్తోత్రంవల్ల ఇంకోవిషయం ద్యోతకమవుతున్నది. అది భౌతిక దేవుల సంఖ్యావృద్ధి. వైదిక కాలంలోని 33 గురు దేవతలు పౌరాణికకాలంలో 33 కోట్లుగా మారారు. ప్రథమమండలంలోనే దీనికి ఇంకా ఉదాహరణములు కనుబడుతున్నవి.

ఈసంఖ్యావృద్ధి మహాయానసాంప్రదాయంలోని బోధిసత్వులవల్ల వచ్చిందని తెలుస్తుంది. ఉపనిషత్తులకాలంవరకు హిందూ దేవతల సంఖ్య 33 గానే ఉంది. కాని, బౌద్ధకాలంలోని బోధిసత్వుల సంఖ్యావృద్ధిని చూచి హిందువులుకూడా 'బృహదారణ్యకం' 'శ్రేణి'అర్థంలో ప్రయుక్తమైన 'కోటి'శబ్దాన్ని భావాంతరం చేసేశారు. మహాయాన సాంప్రదాయులు బోధిసత్వులను తమలోచేర్చుకొని తమసంఖ్యను వృద్ధి చేసుకున్నారు. ఇక హిందువులో, 33 గురు దేవతలను 33 కోట్ల దేవతలుగా చేశారు.

కాని బౌద్ధకల్పనలో హిందూదేవతలుకూడా బోధిసత్వుల క్రిందనే పరిగణింపబడ్డారు. త్రిమూర్తులు కూడా అన్యాన్యబోధిసత్వులవలెనే బుద్ధునికిందికి వచ్చారు(?). హీనయాన సాంప్రదాయంలో యీ త్రిమూర్తులు విష్ణు, బ్రహ్మ, నారాయణుడు మొదలగు పాతపేర్లతోనే పేర్కొనబడ్డారు.

కాని మహాయాన సాంప్రదాయంలో వారి పేర్లనుగూడా మార్చినారు. శక్రుని పేరు 'వజ్రపాణి', అతని స్వర్గంపేరు 'త్రయస్త్రింశల్లోక'మనియు; బ్రహ్మకు 'మంజుశ్రీ', విష్ణువుకు 'అవలోకితేశ్వరుడు', సూర్యునకు 'మారీచి', కుబేరునకు 'జంభల్' (?) అని పేర్లు మార్చారు. కాని హిందువులుమట్టుకు సాధ్యమైనంతవరకు దేవతల నామకరణమందు ప్రాతపద్ధతినే అవలంబించారు.

ఋగ్వేద మంత్రాల్లో 'బృహస్పతి'ని స్తోత్రాధిష్ఠాతనుగా చేశారు. ఉపనిషత్తుల్లో 'అఖిలేశ్వరు'ని 'బ్రహ్మ'అనే స్తుతించారు. పౌరాణిక కాలంలో యీ పేరే సృష్టికర్తకు ఉపయోగించారు.

ఋగ్వేదంలో విష్ణువును, సూర్యుని పర్యాయపదాలుగా తీసుకున్నారు. భాస్కరుడు అన్నిజీవులను పోషించేవాడు. కనుక పౌరాణికకాలంలో సృష్టిపాలక

కర్త 'విష్ణువు'కంటె మంచిపేరును సృష్టించలేకపోయి నారు.

అదేమాదిరి వేదాల్లో రుద్రుని బీభత్సరూపం వర్ణింపబడ్డది. కనుక పౌరాణిక కాలంలో ఇతనే భయోత్పాదకుడైన సంహారకర్తగా వర్ణించబడ్డాడు. వేదములలో ఇతను 'ఓషధులస్వామి' అను బిరుదుతో సులభముగా సంతుష్టి చెంది సోమరసమును అర్పించేవాండ్లకు మేలుచేశేవాడని వర్ణించబడ్డాడు. ఇది కేవలం పౌరాణికశివుని కల్పనానురూపంగా ఉంది.

కాని వేదములలో త్రిమూర్తులకు ఇంతగౌరవ స్థానం ఎక్కడా ఇవ్వబడలేదు. ఇంద్రునికే సర్వత్ర సర్వోచ్చస్థానం లభించింది. శివకేశవులు ఇంద్రుని సైనికులుగాను, సహాయకులుగాను వర్ణింపబడ్డారు.

ఋగ్వేదంలో ముఖ్యాతిథులు ఇంద్రుడు, అగ్ని స్తుతింపబడ్డారు. ఇతర దేవతలకు గౌణస్థాన మివ్వబడ్డది. కాని వైదిక ఇంద్రునికల్పనకు పౌరాణిక ఇంద్రునికల్పన కేవలం భిన్నంగా ఉంది. తన శ్రేష్ఠత్వమును అధిరోహించి దస్యులకు విరుద్ధముగా రణరంగమందు ప్రమత్తనృత్యముచేయు వీరాగ్రగణ్యుడైన వైదిక ఇంద్రునకు, విలాసప్రియుడు, వ్యసనములలో తగుల్కొనియుండు దేవేశుడైన పౌరాణిక ఇంద్రునకు చాలా వ్యత్యాసం ఉంది.

దీనికంతా కారణం దేశంలోని రాజనీతియొక్క మార్పేనని తోస్తుంది. వైదికకాలంలోని రాష్ట్రీయ నాయకులు, ప్రముఖ సేనాధ్యక్షులిప్పుడు ప్రదేశాధిపతులై నారని పైన చెప్పబడేఉంది. ఆదిమనివాసులను పారద్రోలినతరువాత ఆ ప్రదేశశాసనమాత్రం వీరిచేతిలోకి వచ్చింది. కనుక అధికారంతోపాటు వైభవోపేతములైన దర్బారులు ప్రతిచోట నిర్మింపసాగారు.

తదనురూపంగా పౌరాణికకాలంలో ఇంద్రుని, సకలైశ్వర్య సంపన్నమైన దర్బారుకు అధిపతినిగా వర్ణించారు. ఇప్పు డతను తనకాలమునంతయు సుఖభోగములయందు, నృత్య గానములయందే గడుపజొచ్చాడు. దీనికై రంభోర్వశులు సృష్టింపబడ్డారు. కాని ఆధిపత్యం లభించినందుకు రాజసులభమైన సతర్కత అతనిలో ఏర్పడ్డది. అధికారం పోతుందనే భయం అతనిని ఎల్లపుడు బాధింప సాగింది. ఎవరైనా తపస్సు చేస్తున్నారని తెలిస్తే దానిని చెరపటానికి రంభ మొదలైన అప్సరసలను పంపించేవాడు. ఇటువంటిగాథలు పురాణాల్లో అనేకంగా ఉన్నవి. ఇవి అందరెరింగినవే, కనుక వాటి నిచ్చట చెప్పనవసరిలేదు. వైదికకాలపు ఇంద్రుడు పౌరాణిక కాలంలో ఈర్ష్యాప్రతిమగా మారాడు. కనుక వైదిక కాలంలో లక్షలకొలది దస్యులను సంహరించినవాడు, శత్రువులనగరములు ధ్వంసముచేసినవాడు వీరపుంగవుడైన ఇంద్రు డిప్పుడు, చిన్నచిన్న అసురుల భయం వల్ల కంపింపసాగాడు. అతని క్షమ క్రమేణ అంతరించి చిన్నచిన్న పనులకుకూడా త్రిమూర్తులను యాచించవలసి వచ్చింది.

ఈ కాలంలోనే త్రిమూర్తులకు గౌరవస్థానం ఏర్పడ్డది. బౌద్ధమత సిద్ధాంతప్రకారం ప్రతిపాదింపబడిన కర్త, భర్త, హర్తలభావన స్థిరపడ్డది. క్రమేణ శాస్త్రకారులు ముగ్గురిలో భేదములు కల్పించి వారి కర్మక్షేత్రమును, వ్యక్తిత్వమును వేరుచేశారు. ఇదకీ పార్థక్యభావం వికృతరూపాన్ని తాల్చి, ముగ్గురి ఉపాసకులలో ఈర్ష్యాబీజములు నాటింది.

వ్యక్తిత్వము వేరయ్యేవరకు యీముగ్గురి అవతారముల విషయంకూడా విశేషరూపాన్ని తాల్చింది. వేదకాలంలో పౌరాణికకాలపు అవతారముల విషయం ఎక్కడా చెప్పబడలేదు. మనువు సమయంవరకు దేవతలు యజ్ఞహవిస్సును స్వీకరించుకొరకు భూమిమీదికి దిగివచ్చేవారు. కాని పౌరాణికకాలంలో మనుష్యులవలెనే జన్మించడం, మానవలీలలు చూపడం-ఇట్లు వారు వర్ణింపబడ్డారు. ఇక్కడకూడా బౌద్ధులతో సమానత కనబడుతున్నది. అవతారముల కథలు చదివినమనుష్యుని ధ్యానం సులభంగా బౌద్ధుల జాతకకథలమీదికి పోతుంది.

కొంతకాలానికి జనులు త్రిమూర్తుల ఆరాధనను వదలి వారివారి అవతారములను వేరువేరు విధులతో పూజింపసాగారు. ఈ విషయంలో జనులను ఎక్కువగా ఆకర్షించింది ఒక్క విష్ణువే. అతని ౧౦ అవతారములను వర్ణించారు. దీనికంతా ముఖ్యకారణం వైష్ణవ

సాంప్రదాయానికి, ఆకాలపు సర్వశక్తి యుతమైన బౌద్ధ మతానికి దగ్గరసంబంధం ఉండటమే. తరువాత శంకరుని విషయం వచ్చింది. అతని అవతారముల విషయం అంత ప్రఖ్యాతికి రాలేదు. కాని అతని భార్యలను సతి, దుర్గ, అంబ, పార్వతి, కాళి, కరాళి మొదలైన రూపాలతో పేర్కొన్నారు స్వయంగా హనుమంతుడు ౧౧ రుద్రుల అవతార స్వరూపమని తలంచబడ్డాడు. అతనుకూడా వైష్ణవ సాంప్రదాయంలోకి వచ్చాడన్న మాట. బ్రహ్మ అసలు ఆరాధ్యక్షేత్రంలోకే రాలేదు. కనుక అతని అవతారములవిషయం ఎక్కడా కాన్పించదు.

పునర్జన్మ, మోక్షాలనుగురించి ఉపనిషత్తుల కాలం లోనే ప్రతిపాదించారు. ఉపనిషత్తుల మతప్రకారం తృష్ణా పరిహారంవల్లనే మనుష్యుడు మోక్షార్హుడౌతాడు. బౌద్ధుల నిర్వాణ ప్రాప్తికల్పనకూడా ఉపనిషత్తుల మోక్షభావనలోదే. పౌరాణికకాలంలో నిర్వాణప్రాప్తి చాల కష్టంతో లభించేది నిర్వికార, పాపరహిత జీవిత మును గడిపినవారు, తృష్ణను త్యజించినవారు, ఆత్మోన్నతికై పాటుపడేవారు, పవిత్రాధ్యయనము చేయువారే మోక్షార్హులు. పుణ్యకర్మలద్వారా లభించే స్వర్గంనుంచి, ఆ కర్మ క్షయమైనతరువాత తిరిగీ భూమి మీద జన్మించవలసి ఉంటుంది. కాని పునర్జన్మ రహితమైనదే మోక్షం లేక నిర్వాణ ప్రాప్తి ఈ క్రొత్తసిద్ధాంతంలో బౌద్ధ సంస్కృతి స్పష్టంగా కనబడుతున్నది. దీనినే హిందువులు మోక్షమార్గంలో చేర్చారు; అంటే ఉపనిషత్కాలంలోని మోక్షమార్గం, బౌద్ధుల నిర్వాణ కల్పనతో పరిష్కృతమై మరల హిందూధర్మంలో ప్రవేశించింది. సారాంశమేమిటంటే, ఆకాలంలో హిందూ ధర్మానికి, బౌద్ధధర్మానికి దగ్గరసంబంధం ఉండేది అని. ఇలాగే కొంతకాలం రెండుధర్మాలలో ఇచ్చిపుచ్చుకోటాలు జరిగాయి. ఇదే క్షత్రియుల అధికారప్రాప్తికి అంతిమప్రయత్నం. క్షత్రియులు బ్రాహ్మణాధికారపు వేరును కదిలించారు. కాని సనాతనబ్రాహ్మణులు తమ కుంచితబుద్ధిని వదలి, హిందూమతానికి, బౌద్ధమతానికి సామ్యం చూపించి తమమతాన్ని బౌద్ధమత ప్రవాహంలో కొట్టుకుపోకుండా కాపాడుకున్నారు.

ఆధునిక వైష్ణవధర్మం బౌద్ధధర్మాంతర్గత మహాయాన సాంప్రదాయ సిద్ధాంతాలతో నిండియుండుట చూస్తే మధ్యకాలపు హిందూధర్మరూపం ఎలా ఉండేదో నిర్ణయించ శక్యం కాకుండా ఉంది. బౌద్ధులమాదిరిగానే వైష్ణవ సాంప్రదాయంలో అన్ని జీవుల సమానతను వప్పుకున్నారు. సాంప్రదాయంలో మతవిభేదాన్నంతగా పాటించకపోవటం కూడా బౌద్ధమతంలోనిదే. నేటికి దేవాలయములలో అన్ని శాఖల వైష్ణవులు ఏకపంక్తిన భుజించుట కలదు. "అహింసా పరమో ధర్మః" అన్న సిద్ధాంతాని కిద్దరూ పక్షపాతులే. ఇద్దరూ అవతారములను వప్పుకుంటారు. క్రమంగా వారు బుద్ధుని, శ్రీరాముని, కృష్ణుని అనన్య భక్తితో పూజింపసాగారు. ఇప్పుడో, బుద్ధుని విష్ణువు యొక్క ఒకఅవతారమని వప్పుకొని, తమమతంలో కొంత బౌద్ధసభ్యతను మిశ్రమంచేసి, హిందూదేశంనుంచి బౌద్ధమతాన్ని శాశ్వతంగా అంపించివేశారు.

పౌరాణికకాలంలో ధార్మిక సిద్ధాంతాలలోనే కాక పూజావిధానంలోకూడా మార్పు కలిగింది. ఆకాలపు ధర్మనిరీక్షకుల చాతుర్యమున కిది ఒక ఉదాహరణ. ఇదే ఆఖరుకు దేశానికి, కాలానికి, పరిస్థితులకు మృత్యురూపం తాల్చింది. ఈ విషపూరితమైన క్రొత్త పద్ధతే దేవాలయస్థాపన. వైదికకాలంలో మూర్తిపూజ అజ్ఞాతంగా ఉంది. ఆరోజుల్లో ప్రతివారు యజ్ఞం చేసి, దేవతలకర్పించే హవిస్సును అగ్నిలో హోమంచేసేవారు. దేవతలు స్వయముగా వచ్చి యజ్ఞహవిస్సును గ్రహించి పోయేవారు. దేవాలయస్థాపన ఇంతవరకు కాలేదు. మనువు పూజారులనుగురించి వ్రాసినను, వారిని మద్యమాంసవిక్రేతలజాతిలో చేర్చినాడు[1]. కాని బౌద్ధుల

1. We have seen before that Manuwho was a strong conservative in matters of realigious rites, upheld the ancient system of offering sacrifices in the domestic and sacrificial fires and indignantly classed temple priests with venders of liquor and sellers of meat. — R. C. Dutt's Ancient India, Book. V, Chapter, V.

ప్రభావంవల్ల ఈ పద్ధతి దినదినము వృద్ధి కాజొచ్చింది. మొదట బౌద్ధసంఘస్థాపనే దీనికి చేయూత ఇచ్చింది. తరుపతి మహాయానసాంప్రదాయులచేత స్థాపింపబడ్డ మఠములవల్ల దీనికి అశాతీతమైన సహాయం లభించింది.

ధర్మనిరీక్షకులు రెండుకారణములవు దృష్టియం దుంచుకొని దేవాలయములను స్థాపించినారని తోస్తుంది.

(౧) తమ పూర్వాధికారమును కాపాడుకొనుట. తమ అధికారమును కాపాడుకునేందుకు, అంటరానితనమును స్థిరముగా నంచుటకు. ఇంతకంటె మంచిది, సుగమమైనమార్గం వారి కింకొకటి కనుబడలేదు.

(౨) నర్తకీల యొక్క అలంకార, శృంగార వైభవములచేత జనులను ఆకర్షించి, వారిని ధర్మచ్యుతులు కాకుండా చేయడమే. కనుక పౌరాణిక కాలంలో దేశమంతా నర్తకీలతో నిండిపోయింది. మఠాధిపతులు, పూజారులు వైభవంలో రాజుల్ని మించిపోయినారు. జనులు ఇద్దరిని సమానదృష్టితో చూచేవారు. దేవాలయ నిర్మాణమునకు, దేవునకు వినియోగించు డబ్బుకు అంతే లేదు.

అంతరంగికలక్ష్యము దూషిత మైనను, బహిరంగానికి మత, దేవాలయస్థాపనోద్దేశం మంచిదే. జనులు తమ పొట్టచింత మాని ఆధ్యాత్మిక చింతలో మునిగి ఉండుటకు యాత్రికులకు, అభ్యాగతులకు ఉచితసత్కారములు చేయుట, బీదలసేవచేయుట, విద్యార్థులకు ఉచితవిద్య గరపుట, పాఠశాలలు, గ్రంథాలయములు, ఔషధాలయములు స్థాపించి సాధారణ, బీదజనులకు సహాయంచేసి, సమాజంలో, దేశంలో సౌఖ్య శాంతులు వ్యాపింపజేయుటే వీటి ముఖ్యోద్దేశం.

వీటివల్ల దేశము, సమాజము అక్కడక్కడ కొంత లాభాన్నికూడా పొందింది. కాని కొంతకాలానికి వీటిదృక్పథం మారింది. ప్రస్తుతం మఠాధిపతులు, ధర్మధ్వజధారుల నడవడి, మార్గం చూచి, విలాసమే లక్ష్యంగాగల కాముకులు సైతం లజ్జితులౌతున్నారు.

ఇదే తుదకు దేశానికి, సమాజానికి ధూమకేతువుగా పరిణమించింది. ఆధ్యాత్మిక ఉన్నతివిషయం ఎత్తుకొనే పనిలేదు. మధ్యకాలపు రాజనైతిక పతనానికి కూడా ఇదే మూలకారణమైంది. వైభవోపేతములైన మఠ, దేవాలయముల ఖ్యాతి ఖండాంతరములవరకు పాకింది. విదేశీయులకండ్లు వీటిమీద పడ్డాయి. ఆఖరుకు గజనీమహమ్మదువంటివారు దేశంలో కుళ్లుకొట్టి దోపిడి ప్రారంభించారు. తుదకు హిందూదేశపు ఐశ్వర్యమంతా యీమఠ దేవాలయములద్వారా విదేశాలకు బలియై పోయింది.

ఇప్పటికీ మనధర్మనిరీక్షకులు కండ్లు తెరవలేదు. ఈ ఇరువదివ శతాబ్దంలో - ప్రపంచమంతా స్వాతంత్ర్య గీతాన్ని ఆలాపిస్తుంటే—ప్రపంచమంతా విజ్ఞానంలో, నాగరికతలో అగ్రస్థానాన్ని అలంకరించియుంటే—వ్యక్తిగత స్వాతంత్ర్యానికై ప్రాణా లర్పిస్తుంటే, మన సనాతనులు — ప్రాపంచికదృష్టిలేనివారు, మఠ, దేవాలయములగుండా అంటరానితనాన్ని స్థిరంగా—శాశ్వత బ్రహ్మకల్పంగా ఉంచవలెనని ప్రయత్నిస్తున్నారు. ఈ భేదభావాన్ని తొలగించవలెనని విశ్వప్రయత్నం చేస్తున్నను, వీరు కృతయుగపు స్వప్నాలు చూస్తున్నారు. దేశంలోని ప్రస్తుతపు సంస్కార ప్రళయం వీరికండ్లను తెరువగలదో లేదో చూడవలెను.

# స్వామి

విద్వాన్ పాలెపు వెంకటరత్నము

ఈనిరాశాతమస్వినీ హృదయమందు
సంతతము నిట్టులే నివాసంబు సేయు
నాకు గనబడనీయకున్నావదేల
నో ప్రభూ! నీదుకరుణానవోదయంబు.

* * *

౧

నీలజలదమాలికలు ఘనీభవించి
కారుచీకటుల్ విశ్వాన గ్రమ్మినపుడు
స్వామి! భవదీయ విమలహాసంబుబోలె
తోచనీవయ్య క్షణము విద్యుత్కుమారి!

౨

దీర్ఘహైమంత శైశిరదివసములను
ప్రీతి నీ పాదయుగము నర్చించినాను
ఇంక నీదాసునకు గల్గనీయవేల?
స్వామి! సుమనోజ్ఞమైన వాసంతవేళ.

౩

నేను నీభవనప్రాంగణాన సతము
దీనభావాన వేచియున్నాను స్వామి!
ఇపుడు భవదపాంగముల నీక్షించి ప్రేమ
బెట్టలేవె? మనశ్శాంతిభిక్ష నాకు.

౪

దారుణాగమ్య కాననాధ్వముల జిక్కి
తెలియకున్నాడ నొకదారి తెన్ను స్వామి?
కాంతిపూరితమౌ దీపకళిక బూని
యిపుడు నాకీవు దారి చూపింపలేవో?

౫

నేను పద్మాసనమున నిర్నిద్రమౌన
సమున గావింతు నాయాత్మసంయమనము
స్వామి! బిందునాదామలస్వరయుతంబు
నాకు వినిపింపు మోంకార నవ్యగీతి.

---

# నవగ్రహాలలో మనుష్యులున్నారా?

సర్ వేపా రామేశంపంతులు

[శ్రీ సర్ వేపా రామేశంపంతులుగారు ఇటీవల ఆల్ ఇండియా రేడియో, మద్రాసులో చేసిన ప్రసంగమిది.— భా. సం.]

ఈ రోజుల్లో మనకు అక్కరలేని విషయమే లేదనవచ్చు. మన యిరుగుపొరుగువారి సంగతి, మనజాతివారిసంగతి, మన దేశం సంగతే కాకుండా మనం ఈభూగోళపు ఎల్లలను దాటి యితర ప్రపంచకాలవేపుకూడా దృష్టి సారిస్తున్నాము.

కాని, యితరగోళాలలో మనుష్యులున్నారా? అసలు ప్రాణికోటి ఉన్నదా? అనే ప్రశ్నమాత్రం యింకా అల్లాగే ఉంది. శాస్త్రరీత్యా పరిశోధన ప్రబలకపూర్వము ఊహాబలము ఎక్కువగాఉన్న కొందరు కథకులు యితర లోకాలలో ఉన్నారనుకొన్న మనుష్యులనుగురించి వింతవింతకథలు వ్రాసిఉన్నారు. ఇందులోముఖ్యముగా 'వెల్సు' అనేకథకుడు 'First men in the Moon', అంటే చంద్రగ్రహములోని మొదటిమనుష్యులు అనేపుస్తకములో, ఎవరో యిద్దరు మనుష్యులు ఒక విచిత్రయంత్రంమీద చంద్రలోకంలోకి వెళ్లడమూ, అక్కడ వారికి వింత అనుభవాలు కలగడమూ వర్ణించి ఉన్నాడు. 'వెల్సు' ఊహాలో చంద్రగోళం ఒక చీమలపుట్టలా వుంటుంది. పగలంతా- అంటే మన ౧౪ రోజులు చంద్రలోకంలో ఒకరోజు. చంద్రలోకపు మనుష్యులు వారిపశువులతో చంద్రుని పైభాగాన్నే మసలి రాత్రి కాగానే గుల్లగాఉన్న లోపలిభాగంలోకి దూరిపోతారట. వెల్సు ఈచంద్రలోకపు మనుష్యుల ఆకారంకూడా వర్ణించిఉన్నాడు. మనలాగే చీకట్లో దీపాలు పెట్టుకోడం మొదలైనవి చెప్పి ఉన్నాడు. చంద్రలోకం అంతా ఒకే రాజ్యమట. అంచేత అక్కడ యుద్ధాలే లేవు. ఎంత హాయి!

ఈ వెల్సు మరోపుస్తకంలో అంగారకగ్రహంలోని మనుష్యులకూ మన భూలోకంలోనివారికీ జరిగిన యుద్ధాన్ని వర్ణించాడు. అంగారకగ్రహం - దీన్నే 'మార్స్' (Mars) అంటారు - లోని మనుష్యులు శాస్త్ర పరిశోధనలో మనకంటె అనేకరెట్లు ఎక్కువ గొప్పవారట. వారు ఒక పెద్ద ఉక్కుబంతిని తయారుచేసి అందులో యుద్ధవీరులను ఉంచి ఆబంతిని మరల మరల ప్రేలే తుపాకీమందు సహాయంతో భూమిమీదికి చేర్చారట. ఈ వీరులు భూమిని చేరాక బయటికి వచ్చి భూలోకాన్ని జయించటం ప్రారంభించారట. వారిదగ్గర పాశుపతాస్త్రమువంటి అతితీక్ష్ణమైన కిరణాలను ప్రసరింపజేసే ఒక అస్త్రం ఉండడంవల్ల వారు సర్వాన్ని దహించి సమస్తం వశపరుచుకున్నారట.

ఈ అంగారకలోకంవారు మనలాగ ఆహారాన్ని తిని జీర్ణంచేసుకోటం లేదట. చిన్న తొండంవంటి నోటితో యితరప్రాణుల్ని పట్టుకుని రక్తాన్ని పీల్చివేయడమే వీరి కాహారంట. ఈవిధంగా వీరు మన మనుష్యుల్ని కొందర్ని చంపి తిన్నారు. ఇంతలోకే భూలో

కంలో ఉన్న కొన్నిక్రిములు (germs) వారిని తగులుకున్నాయిట. అంత వారికి రోగాలు వచ్చి వా రందరూ చనిపోయారట. ఇదొక వింతకథ.

'సర్విస్' అనేఅమెరికనుసిద్ధాంతి 'కొలంబస్ ఆఫ్ ది స్కై' (Columbus of the Sky) అంటే అమెరికాదేశాన్ని కనిపెట్టిన కొలంబస్‌వంటి ఒక నావికుడు ఆకాశయానంచేసి కొత్తలోకాలు కనిపెట్టడాన్నిగురించి రాశాడు. కొందరు భూలోకపు మనుష్యులు శుక్ర గోళం చేరతారు. శుక్రుడు అంటే మనం వేగుచుక్క అంటామే ఆగ్రహం. ఆ శుక్ర గోళంలో ప్రజలు, రాజ్యాలు, రాజులు, రాణీలు, అంతా మనలోకంలో లాగే ఉంటారు. వారిలో విరోధాలు, యుద్ధాలు కూడా ఉంటాయి. భూలోకాన్నుంచి వెళ్లిన మనవాళ్లు యీ యుద్ధాల్లో ఏదో ఒకపక్షం చేరుతారు. కథ చమత్కారంగా నడుస్తుంది.

ఇల్లాగే ఫ్రెంచి సిద్ధాంతి ఫ్రీమేరియన్ (Fremarian) కూడా భూలోకపువారు అంగారకగ్రహంలోకి వెళ్లడాన్ని గురించి వర్ణించాడు.

కేవలం ఊహమీద ఆధారపడ్డ యీ కథలు యిలా ఉండగా శాస్త్రపరిశోధనవల్ల యితరగ్రహాలనిగురించి మనకు అనేక విషయాలు తెలిసి ఉన్నాయి. తెలియని విషయాలు మరీ ఉన్నాయి. లోకంలోకల్లా ఒక గొప్పనక్షత్ర పరిశోధనశాల 'గ్రీనిచ్' లో ఉంది. ఇక్కడ ఉన్న 'స్పెనెర్ జోన్స్' (Spenen Jones) అనే సిద్ధాంతి ఈ విషయాన్నిగురించి విపులంగా కృషిచేసి ఉన్నాడు.

గాలి లేకపోయినా, గాలి ఉండి ప్రాణవాయువు లేకపోయినా, మనకు తెలిసిన జీవకోటి ఎల్లా జీవిస్తుందో మనం ఊహించలేము. గాలిలాగే నీళ్లుకూడా ప్రాణానికి అత్యవసరం. ఇంతేకాక వేడిమీ, చల్లదనమూ, నీటి భేదాలుకూడా పాటించవలసి ఉంటుంది.

పగలు ఎండలు మండిపోయి, ఆరాత్రే గడగడ వణకించే చలి వుంటే జీవకోటి భరించలేదు; అంటే మనం అలవాటుపడ్డ జీవకోటి. కొన్నికొన్ని జీవరాసులుమాత్రము అసాధారణమైన వేడిలోకూడా బ్రతికి హాయిని అనుభవించుచుండడము శాస్త్రజ్ఞులకు తెలుసు

సూర్యలోకపు పరిస్థితులను ఆలోచిస్తే, అక్కడ వేడిమి అపరిమితం అని చెప్ప నక్కర లేదు. ఇక్కడ ౧౧౦ డిగ్రీలకే మనుష్యునికి బ్రతకడం దుర్లభ మవుతుంది. సూర్యునిలో వేడిమిఎంత లేదన్నా నాలుగువేలడిగ్రీలుదాటి ఉంటుంది. ఇక్కడ ఘనపదార్థములుగా - అంటే గట్టిగా - ఉన్న యినుము మొదలైన పదార్థములు కరగి నీళ్లప్రాయమై వాయువై పోవడమే కాకుండా, అంతకంటె సూక్ష్మమైన పరమాణువులుగా మారిపోతాయి; అంటే యిక్కడ మనం చూస్తూన్న పదార్థాలన్నీ కూడా సూర్యునిలో సూక్ష్మాతిసూక్ష్మమైన స్థితిలో వుంటాయి. అందుచేత ఎంత వూహించినా సూర్యునిలో ఎటువంటి ప్రాణికోటీ వుండడానికి అవకాశం ఉన్నట్టు కనుపడదు.

ఇంక చంద్రగోళం. సిద్ధాంతుల అభిప్రాయంప్రకారం చంద్రునిమీద గాలే లేదు. ఎప్పుడో ఒకప్పు డున్నా, మొదట ఉదజని (Hydrogen) అనేవాయువు పైకి చెదిరి

పోయింది. తరువాతను మనగాలిలో వుండే యితరవాయువులు - ప్రాణవాయువు (Oxygen), నత్రజని (Nitrogen) - యివి క్రమముగా చెదిరిపోయాయి.

ప్రాణవాయువు (Oxygen), ఉదజని (Hydrogen) వాయువు - యివే లేనప్పుడు యీ రెండున్నూ కలియడంవల్ల అవతరించిన నీరుమాత్రం చంద్రగోళంమీద ఎట్లా వుంటుంది? గాలి నీరు లేనప్పుడు చంద్రబింబము ఎటువంటి ప్రాణికోటికి ఆస్కారం యియ్యగలదు? ఎంతటి తీక్ష్ణమైన దూరదర్శిని యంత్రాల (Telescopes)లో పరీక్షించినా చంద్రునిలో మనం అలవాటుపడ్డ జీవరాసులకు స్థానం వుంటుం దని నిదర్శనం ఏమీ కనపడదు. చంద్రగోళము మృత్యువుకు ఆస్థానమనే చెప్పవలసి ఉంటుంది.

బుధుని విషయంలోకూడా ఏమీ గాలి లేనట్టే కనపడుతుంది అక్కడ. పైగా ఆ గోళంలో సూర్యరశ్మి తగిలినచోట అపరిమితమైన వేడిమీ, తగలనిచోట విపరీతమైన చల్లదనమూ వుంటాయి.

బృహస్పతి, శని — ఈగ్రహాలచుట్టూ కొంత వాయుప్రదేశం ఉన్నట్టు కనపడుతుంది. కాని దూరదర్శిని (Telescope)లో చూచినా, యితరవిధాల ఎంత జాగ్రత్తగా పరిశీలించినా, ఈవాయుప్రదేశములో ప్రాణవాయువు (Oxygen) కాని, నీటి ఆవిరికాని ఉన్నట్టు కనిపించదు. ఉదజని (Hydrogen), అమ్మోనియా మార్ష్ గాస్ (Ammonia Marsh gas) ఉండవచ్చును. ఇవి అనేక మైళ్ల ఎత్తున విస్తరించి ఉండును. ఇన్ని మైళ్లు విస్తరించిఉండే ఈ వాయువుల వొత్తిడికింద ఏపదార్థ మున్నా అది ద్రవరూపంలోనే వుంటుంది. ఈస్థితిలో అక్కడ జీవరాసు లెట్లా వుంటాయి?

యూరేనస్ (Uranus), నెప్ట్యూన్ (Neptune)-యివి మనపూర్వులకు తెలియని రెండు కొత్తగ్రహాలు. వీటిలోనిస్థితి బృహస్పతి, శనిగ్రహాలలోకంటె మరీ అన్యాయము. ఇచ్చట శీతలము మరీ హెచ్చు. వాయువంతా మార్ష్ గాస్ (Marsh gas) మయమే. ప్లూటో (Pluto)గ్రహము అంతే.

పైని గ్రహముల విషయం అట్లా వుండగా వానిలో కొన్నిటికిఉన్న ఉపగ్రహములు కూడా ఎటువంటిజీవరాశికీ ఆస్థాన మిస్తూన్నట్టు కనపడదు. చిన్నవుపగ్రహముల (Satellites)లోంచి గాలి అప్పుడే చెదిరిపోయివుంటుంది. ఇక బృహస్పతిని అనుసరించిన పెద్ద ఉపగ్రహాలలోను, శనిని అనుసరించినవానిలోనూ కూడా ఎటువంటి జీవకోటికీ నివాసయోగ్య మగుతా వున్నట్టు కనుపడదు.

ఇంక పెద్దగ్రహమైన శుక్రునివిషయం: ఈగ్రహం దిట్టమైన మేఘాలచేత కప్పబడి వుండడంవల్ల ఎంతటి తీక్ష్ణమైన దూరదర్శినులు కూడా దాని లోపలిసంగతిని కనిపెట్టలేవు. దీనిలో ప్రాణవాయువుకాని, నీరుకాని, వున్నదీ లేనిదీ నిర్ధారణగా చెప్పలేము; లేదు అనడానికి వీలులేదు. ఈ దట్టమైన మేఘాలు ఉండడంవల్ల నీరు వున్నదనే అనవలసి వుంటుంది. బొగ్గుపులుసువాయువు (Carbon-di-oxide) వున్నట్టు రుజువైంది. మనభూమిమీదకంటె అక్కడ ఈ వాయువు చాలా హెచ్చుగా ఉన్నట్టు తెలుస్తుంది. ప్రాణవాయువు వుంటే తక్కువగానే వుండవచ్చును. శీతోష్ణస్థితులుమాత్రము జీవరా

సులకు అనుకూలంగానే వున్నట్లు కనిపిస్తుంది.

ప్రాణవాయువే అవసరమైనంత వుంటే శుక్రునిలో మనుష్యులు నివసించడానికి ఆస్కార మున్నదనే చెప్పాలి. కాని అన్ని విషయాలు ఆలోచిస్తే, అక్కడి యిప్పటిస్థితి అన్ని జీవరాసులకు అనుకూలం కాదనీ, వుంటే ఒకవేళ చెట్లూ, చేమలూమాత్రం వుండ వచ్చనీ అనిపిస్తుంది.

ఇంక అంగారకగ్రహంవిషయము - మన అదృష్టమా అని మనకు చాలా చాలా బలమైన దూరదర్శినులు వున్నాయి. వీటిసహాయంవల్ల యీ గ్రహానికి సంబంధించిన విషయాలు మనకు చాలా తెలుస్తాయి..

అంగారకగ్రహంలో ప్రాణవాయువు (Oxygen), నీటిఆవిరికూడా వున్నాయి. యీవాయువుఒత్తిడి చాల తక్కువ. కాని యీ పరిస్థితికి మనుష్యుడు అలవాటు పడగలడు. ఇప్పుడు హిమవత్పర్వతాలపైకి, విమానంమీద ఏడు, ఎనిమిదిమైళ్లు పైకి వెళ్లేవారు పలుచనైపోయిన వాతావరణంలో వూపిరి పీల్చడానికి వీలగునట్లు అలవాటు చేసుకొనే నెగ్గవచ్చును.

లెవెల్ (Level) అనే అమెరికను సిద్ధాంతి యీ అంగారకగ్రహాన్ని (Mars) గురించి చాలా కృషిచేసివున్నాడు. ఆగ్రహం ఉపరిభాగముపైన కొన్ని గీతలను చూచి వాటికి కాలువలు అని పేరుపెట్టినాడు. ఈ కాలువలు వేలకొలదిమైళ్లవరకు వ్యాపించి వున్నాయి. అవి 'వాకవింత అల్లికలా వుంటాయి. అడ్డకాలువలు, నిలువుకాలువలు కలసిన చోట్లు ఎక్కువ నల్లగా కనబడతాయి. ఒకచిత్రము: యీగ్రహంలో ఋతువులు మారినప్పుడు యీకాలువలు కూడా మారుతూవున్నట్లు కనబడతాయి. సాధారణంగా తేలికగా కనబడే యీగీట్లు వసంతఋతువు వచ్చేసరికి ఉత్తర భాగము నుంచి, మధ్యభాగందాకా రోజుకు ఏబది మైళ్లచొప్పున నల్లబడుతూ వస్తాయి. ఈ గీట్లు - అంటే, కాలువలు - మరల క్రమంగా తేలికై మళ్లీ ఋతువుకు దక్షిణ ధ్రువంనుంచి తిరిగి మధ్య భాగానికి నల్లబడుతూ వస్తాయి. దీనినిబట్టి గ్రహించేది యేమిటంటే వసంతం వచ్చేసరికి ధ్రువమండలాలలో వుండే మంచు కరగి యీగీట్లలా కనబడే కాలువలద్వారా ప్రదేశమంతా నీరు ప్రవహిస్తుం దని; అంటే, ఒక వేళ అంగారకుడిలో వర్షాలు తక్కువనీ, అచ్చటివారు మిక్కిలి తెలివికలవారు కాబోలు, అద్భుతమైన కాలువల నిర్మాణం ద్వారా వ్యవసాయం మొదలైనవి జరుపుతున్నారేమో అనీ సిద్ధాంతము. కాని, మరివొక అమెరికను సిద్ధాంతి పై గీట్లు కాలువలు కావని వాదిస్తాడు. ఇతను అనేక సంవత్సరాలనుంచి అనేకవేల నక్షత్రాలను పరిశీలించి వున్నాడు. కాబట్టి యీయన మాట తీసివేయలేము. 'ఈ గీట్లు కాలువలే' అనడానికి ఎన్నికారణాలు వున్నాయో, 'అవి కాలువలు కావు' అనడానికిన్నీ అన్ని ప్రబలమైన కారణా లున్నాయి.

కాని అంగారకగ్రహంలో మనుష్యులు వున్నారా అనే ప్రశ్నకు జబా బేమిటి? ఇక్కడ గాలి అంత బాగా లేకపోయినా, ప్రాణికి అవసరమైనంత గాలి వున్నట్టే తోస్తుంది.

శీతోష్ణస్థితి కూడా అంత అనుకూలంగా లేకపోయినా అది ప్రాణినాశనము చేసేటంత కఠినంగా లేదనవచ్చును.

ఇంతకూ తేలిన విషయం యేమిటంటే:

మన భూమిమీదతప్ప సూర్యసంబంధమైన నవగ్రహప్రపంచకంలో ఎచ్చటను జీవరాసులు వున్నట్టు కనబడదు - అని. ఒకవేళ వుంటే శుక్రగ్రహంలోనూ, అంగారకగ్రహంలోను వుండవచ్చును. అప్పటికీ ఈగ్రహాలలోని పరిస్థితులు మనుష్యజాతి నివాసానికి అనుకూలం గావు. అయినప్పటికీ ఈ రెండుగ్రహాలలో బొత్తిగా ప్రాణికోటి లేనేలేదని దృఢంగా చెప్పలేము.

---

# మృషైషిక

దేవరాజు వేంకట రమణారావు

"కలదు కొండొకయెడఁ జిలుకా! యొకొండు
సరస ఫాల కిసాల రసాల సాల
మరుగుదె మ్మగు విందు సాయంతనమున :
దప్పకుమి!" యంటి; వేనును నొప్పికొంటి.

కమ్మ లేమావిచివురుజొంపమ్ములంట!
నాకు విందంట! నేడు యానమ్మటంట!
యని య దెంతొ హృదర్థ ముబ్బినది సుంత,
కాని, నీమాయ గానగాలేనిదయ్యె.

*　　*　　*

కోకిలా! మెచ్చుచేని లేగొమరు చివురు
మామిడీకలాదె? చెప్ప మమ్మరొ యటంచు
నిన్ను బ్రతిమాలినానొక్కొ? నీవె కోరి
వినుపగా దాని కే నొప్పికొనితిగాని...

*　　*　　*

ఎంత కమ్మదనంపుమో కెంత తిమ్మ
నైన కిసలమ్ము లయ్యారె యంచు నటుల
నంత యూరింపనేల?— కల్లాడ నేల?—
నా మనమ్ము నొక్కటిగ నానందమునను
ముంచి, తిరుగంగ శోకాన ముంచనేల?—

*　　*　　*

అటు కరీష మృషా కషాయముల గురిసి
నా శిరీషమ్ము ద్రోచి; తింతటికి నింతె!

*　　*　　*

ఎన్నినాళ్లాయి డాచికొంటీ సుధాస్ర
వంతికా శాంత లాస్య విశ్రాంతికముల
నో! మృషాసఖ! యే భాగ్యసీమయందు?

*　　*　　*

భవుజటాయూని గాంగ భవానిలోని
కమల కమలామలామృతైకముల కేని—
కలుగ విట్టి ప్రసన్న తాంకములు పికమ!

—నా 'ఏలాలత' నుండి.

# దొంగతనము

గజపతి రాయవర్మ

[దొంగతనం ఒకవృత్తి, వ్యాపారము- దిలాసా-పొరపాటు - కళకూడానేమో ! ఇన్నివిధాలా వింటున్నాం - చూస్తున్నాం కాని ఇలాంటి దొంగతనం విచిత్రంగానే వుంటుంది. విలువైనవస్తువును చేతులారా కోరి ఎత్తుకుపొమ్మని దొంగ కవకాశమిచ్చే ఉదారు డెవడైనా ఉన్నాడా? చదవండి మరి మీరే అంగీకరిస్తారు. కథాధారము అంతా.—ఆర్నాల్డు బెనెట్ వ్రాసిన బర్గ్లరీ.—]

"ఏమండోయ్! ఆపటం ఇంకా అక్కడ్నే అలా వుంటే ఇలాంటి సంతోషసమయాల్లోకూడా ఎప్పుడో ఓసారి నేను వాల్తేరు వెళ్లి బుర్ర మరామ్మతు చేయించుకోవాల్సొంటుంది" అం దావిడ.

వాల్తేరులో పిచ్చాసుపత్రి వుంది. కృష్ణ కివతలి వారంతా మానసికమరామ్మతు అవసరమైనవార్ని వాల్తేరు తీసుకువస్తుంటారు కాని అసహా దసహా ఖర్చు ఎక్కువైపోతాయనేమో సగం సగం చికిత్సలోనే ముఖ్యంగా ఆడవాళ్లని తరచు వదిలేస్తుంటారు. కావలిస్తే మీరు విశాఖపట్నం వెళ్లి చూడండి రోజూ కో పిచ్చివాడైనా మెయిన్‌రోడ్డుమీద కాన్పిస్తాడు.

జాలిగా గోడమన్న పటాన్ని చూస్తూ "దీన్ని చూసి భోజనాని కెత్తే కక్కొస్తుందికూడా" అంది విమలారావు.

భార్య అసహ్యానికి నవ్వుకుంటూ జగన్నాథరావు పడకకుర్చీలో తాపీగా పీలుస్తున్న చెరూట్ చివర నుసిలో నిప్పు చూస్తున్నాడు.

ఆ పటం అంటే ఆయనభార్యకే గాదు సాధారణంగా చూపరుల కెవరికైనా వెగటుగానే వుంటుంది. కాని ఆ పటం వెయ్యిరూపాయలపైన కిమ్మత్తు చేసింది. తయారై ఇంకా రెండు సంవత్సరాలైనా కాలేదు. అబ్బే, పాతగిలిందని ఎవరైనా అన్నా బజార్లోపెడితే కనీసం, ఉత్తమచిత్రంకాబట్టీ, రావుగారి రూపపటంకాబట్టీ — ఆరువందలైనా చేస్తుంది.

జగన్నాథరావు ఆ పట్నంలోవున్న అన్ని సంస్థలకూ విరాళా లిచ్చి ప్రజోపకారి అనిపించుకున్నాడు. చక్రవర్తిపటం ఒకటి గ్రంథాలయానికి కొనియిచ్చి తనరాజభక్తిని ప్రకటించుకున్నాడు. ఇతని విరాళాల్తో పదిమంది చదువుకుంటున్నారు. ఇలాంటి వెన్నో ఉపకారాలు చేశాడు. ఈ వితరణానికి డబ్బెక్కడిదయ్యా అని మీ రడగవచ్చును. జగన్నాథరావుతండ్రి గోదావరినీరు తగిలే భూములస్వామి. చనిపోయి ఎక్కడున్నాడోగాని పాపం భూములవల్లనైతే నేం, వడ్డీ వ్యాపారంవల్లనైతే నేం, కొన్నాళ్లు ఆనరరీ మేజిస్ట్రేటు చేసినప్పుడైతే నేం ఇద్దరు కొడుకులూ ఉద్యోగం చేసుకోనవసరంలే దనిపించే ఆస్తి యిచ్చి మరీపోయాడు. అనంతరం ఆయన రెండోకొడుకు బ్రహ్మచారిగానే వుంటూ జిల్లా అంతటికీ ఓబిశెసస్ మాగ్నెట్ అనిపించుకుని మార్వాడీలు గుజరాతీవాళ్లైనా చిల్లంగిపెట్టేరేమో (ఈర్ష్యవల్ల సుమండీ) అన్నట్టు అమన్యనే ప్రాపకంచేసుకున్న మనోహరానికైనా చెప్పకుండా దానింట్లోనే సీగ్గేడు. అప్పుడు జగన్నాథరావు తమ్మునిమరణానికి చాల విచారించి మనోహరాని కొంతభృతి యిచ్చి మిగతాధంతా తన ఆస్తిలో కలుపుకున్నాడు. ఇంతాస్తికీ తనఉద్యోగం రాబడీ కలిపితే ఇక చెప్పాలా?

కొన్నాళ్లనుంచీ ఉన్నవూరికే బదిలీ అయి మేజిస్ట్రేటుగిరీ చెలాయిస్తూ ఇంకో రెండేళ్లకల్లా రిటైరై పోతాడనగా పౌరులు ఇతన్ని శాశ్వతంగా గౌరవించడం తమ విధి అని గమనించారు. అందుకని ఆయన రొత్తూ, ఆయనఫాయా, హుందాకు తగినట్లుగా ఓమాంచి తైలవర్ణచిత్రం తయారు చేయించాలని చందాలు

వేసుకుని ఎలాగై తేనేం వెతికి వెతికి ఓగొప్పచిత్రకారుణ్ని రప్పించారు.

చిత్రకారుడు సమ్మతిస్తూనే కొన్ని షరతులు పెట్టాడు. చిత్రం పూర్తయాక దాన్ని అఖిలభారత చిత్రకళాప్రదర్శనానికి పంపి తర్వాతనే పౌరులూ, జగన్నాథరావుగారూ మాడ్డం అన్నాడు. ఎంత గొప్ప చిత్రకారుడూ కాకుంటే అలా అంటాడు? అందుకు పౌరులు సరే అన్నారు.

* * *

విమర్శశిఖామణులూ, పేరొందిన చిత్రకారులూ, కళాప్రియులూ ఆ తా సజీవచిత్రం అని మెచ్చుకోవమేకాదు; ఈ చిత్రంవల్ల జగన్నాథరావుగారికీర్తి దశదిశల నిండిపోతుందని వ్రాశారు.

ప్రదర్శనం అయాక పటం పురమాయించినవారికి వచ్చిచేరింది. ఈ చిత్రాన్ని సమర్పించడానికని పౌరులు బ్రహ్మాండమైనసభ ఏర్పాటుచేశారు.

పత్రికావిలేఖరు లప్పటికప్పుడే ఆచిత్రం ఫొటో తీసి శ్లాఘిస్తున్నారు. పౌరులు రావుగారిరూపాన్ని బట్టి ఒరియాదొడలూ, నీగ్రోపెదిమలూ, మిట్టకొసలూ, జపానుముక్కూ, గణపతికడుపూ ఇవన్నీ తలపుచేసుకుని అసహ్యంగా వుంటుందేమో అని విరగబడి తోవ తొక్కిళ్లలో వెళ్లి తీరా చూస్తే చిత్రం అర్థంలేని కలగాపులగం రంగులపులుమడంగా కనిపించింది. కాని కొంచెందూరమండి చూసినవారు అచ్చంగా మన జగన్నాథరావుగారే అనుకున్నారు.

అంతకుముందే చిత్రకళ అంటే ఏంవిటో తెలియదు కాబట్టి ఆ చిత్రకారునిచేత వ్రాయించిన ఉపన్యాసాన్ని చెప్పి పరమానందభరితుడైపోయినట్లు నటించాడు.

* * *

ఆ పటం జగన్నాథరావుగారిహాల్లో తగిలించిన మూడోమాసంనుంచీ భార్య విమల పటం చూస్తే డోకొస్తుందనడం ప్రారంభించింది. కాని ఎప్పటికప్పుడు రావుగారు ఆ పటాన్ని విడిచిపెట్టలేనన్నట్లు ఏలాగో సర్దుకుపోయేవాడు - కాని భార్యపోరుకి ఎన్నాళ్లు ఆగగలడు ?

ఉన్న దున్నట్లు చెప్పాలంటే ప్రజలకీ, విమలా రావుకూ ఆ పటం అంటే ఎంత వెగటుగా ఉందో దానికి రెట్టింపురోతగా వుం దాతనికి. కాని ఆ జుగుప్స నితరులకు కించిత్తూ తెలియకుండా తనలోనే అణచిపెట్టుకున్నాడు. కొంపకు నిప్పపెట్టయినా ఆ పటాన్ని విరగడచేసుకో గలడు. దాన్ని పోగొట్టుకోడానికి ఏ మాత్రం వివేక మున్నవాడూ అంతపెద్ద మేడకు చేతులారా నిప్పపెట్టుకోడు. కాని ఆ చిత్రం కంటికి కెలా దూరం చేసుకోవమా అని రాత్రింబవళ్లు ఆలోచిస్తుండేవాడు.

* * *

ఆ వేళ కోర్టులో ఒక్కసుమాస్తాలూ, సాక్షులూ, పోలీసులేగాకుండా ముద్దాయికూడా మెజస్ట్రేటు తీర్పుకు విస్తుపోయారు.

ఆ మత్స్య పట్నం పరిసరాల్లో చిత్రంగా దొంగలు దోచుకుపోతూవుండటం జరిగింది. నానాఅవస్థలూ పడి పోలీసుసబిన్స్పెక్టరు ముద్దాయిగా ఒకడ్ని పట్టి తీసుకువచ్చాడు. ముద్దాయికీ దొంగలకూ సంబంధం వుందని ఎస్. ఐ. అనుమానం - దొంగ దొరికాడని పౌరులు తండోపతండాలుగా తీర్పు వినడానికి వచ్చారు.

నేరం ఋజువు కాలేదనీ - సాక్ష్యం చాలదనీ, ముద్దాయి దొంగతనంచేసేంత బలిష్ఠుడుకూడా కాదనీ నిందితుణ్ని విడుదలచేశాడు మేజిస్ట్రేటు. ఒక్క మేజిస్ట్రేటు తప్ప అందరూ ఆశ్చర్యపోయారు. జగన్నాథరావు దొంగని అనవసరంగా అనుమానించి అవమానించాం అని అనక ప్రైవేటుకూముడు తీసుకరం సని చెప్పాడు. వాళ్లు మేజిస్ట్రేటుగా రానిందితుని కేమైనా బహుమానం చేస్తారేమో అనుకున్నారు.

* * *

వెంకట్రావు మేజిస్ట్రేటుగారికి దూరంగా తలుపు దగ్గర ఒదిగి నిలిచాడు. దొంగ బలంగా వస్తాదులా ఉంటాడనీ, పగలు చూస్తే రాత్రి కలలోకి వచ్చేంత భయంకరంగా ఉంటాడనీ అంటారు కాని వెంకట్రావులో అలాంటి వేవీ లేవు. ఆదరణ, ప్రతిఫలము లేని పారస్యంలో పాసకునిలా బక్కచిక్కి ఉన్నాడు. ఆ

రూపూ ఆదీ చూస్తే కూటికీ గుడ్డకీ కరువైన మర్యాదస్తునిలా ఉన్నాడు.

"ఇవాళ నక్కని తొక్కి వచ్చావ్" అన్నాడు నవ్వుతూ మేస్ట్రేటు.

ఆయనఅభిప్రాయ మేమిటో తెలుసుకోవాలన్నట్లు వెకిలినవ్వుతో "ఔనండి" అన్నాడు దొంగ.

దొంగ అని నిర్ధారించుకునీ విడిచిపెట్టడంలో మేస్ట్రేట్ ఉద్దేశం వెంకట్రావు గ్రహించలేకపోయాడు.

చమత్కారంగా "దొంగతనం ఏమంత లాభించేదీ!" అన్నాడు ఏదోవూహ తల్లో పెట్టుకున్న మేస్ట్రేటు.

వెంకట్రావు లాభసాటిబేరమే అన్నట్లు నవ్వాడు.

"లాభించేదైనా పాపం పని — సంఘద్రోహం కాదా ?"

"దొంగతనంగురించి చాలా విన్నానుకాని ఇలా ఎవరూ అనలేదు. అయినా ఈ సారి దొంగతనం ఉత్తమమైనదే అనుకుంటున్నాను; ఏమంటే దొంగతనం వల్ల గొప్పవారితో చనువుగా ప్రవర్తించవచ్చు—".

"ఇదివర కెప్పుడైనా పట్టుబడ్డావా ?"

"తరు చెప్పడమా అలా జరగలేదు; కాని మీ ఉద్దేశం ఏంవిటో తెలుసుకోలేకున్నాను. దయయుంచి త్వరగా పంపితే సంతోషిస్తాను. కాలం నాకు చాల విలువైనది.

జగన్నాథరావు చిరునవ్వుతో కూచోమని సైగ చేశాడు. వెంకట్రావు విముక్తిపొంది అందరిలా స్వతంత్రుడుగా ఉండడంవల్ల నిర్భయంగా వెళ్లి మేస్ట్రేటుకు సమానస్థాయిలో ఆయన కెదురుకుర్చీమీద కూచున్నాడు.

"నేరం అనిపించని దొంగతనం, అంటే న్యాయసమ్మతంగా ఇతరుల వస్తువులను తీసుకుపోవడంలో నీ అభిప్రాయం ఏంవిటి ?" అన్నాడు మేస్ట్రేటు కొంచెం ఒల్లమీదికి వొరిగి.

"అసలు మీ ఉద్దేశం ఏంవిటో తెలియడంలే" అన్నాడు, ప్రశ్నార్థకదృష్టిని చకితుడైన వెంకటరావు.

జగన్నాథరావు తాపీగా, సాక్షిగా మాట్లాడుట కారంభించాడు.

"మా బంగ్లాలో పెద్ద ఆయిల్ పెయింటింగ్ ఒకటుంది. దాన్నెవరైనా దొంగిలించుకుపోతే బావుండు ననిపిస్తుంది. తెలిసిందా ?"

"దొంగిలించుకు పోవడం!"

"ఔను — . అ దెలాగయినా విరగడైపోవాలి. ప్రజలు దాన్నెవరో చోరీచేసుకుపోయా రనుకోవాలి."

"ఏ అర్ధరాత్రి సమయానో మీరే చాటుగా తీసి తగలెట్టకూడదూ ?"

"అది మోసం అవుతుంది. నువు చెప్పినట్లే చేస్తాననుకో — ప్రజలతో దొంగిలింపబడినదని చెప్పడం ఏం సబబుగా వుంటుంది? వాస్తవంగా దొంగిలింపబడాలనే నీతో చెప్పడం."

"సరే ఏమిస్తారు?" అన్నాడు వర్తకసరళిని వెంకట్రావు.

"డబ్బివ్వాలా?"

"ఔను — దాన్నెత్తుకుపోవడానిగ్గాను ఏం బహుమతి చేస్తారు?"

అంతఖరీదైనపటం ఎత్తుకుపొమ్మంటుంటే వేరే ఇందుకు పారితోషికం యివ్వాల్నా అని మేస్ట్రేటు ఆంతరంగికంగా దాచే పిసినారితనం వెల్లడించుకున్నాడు. వేయిరూపాయలపటం దొంగిలించుకుపోడానికి అవకాశం యిస్తుంటే ఇంకా బహుమానం ఇవ్వాలిట. ఏకలకత్తాలోనో అమ్ముకుంటే చవ్వగా ఎనిమిదివందలైనా తెస్తుంది. దీని కింకా బేరమా? ఆ పటాన్ని ప్రజలంతా విరగబడి చూశారు పత్రిక లలాంటి చిత్రం ఇంతవరకు తయారుకాలేదని శ్లాఘించాయి అంటూ చిత్రప్రాశస్త్యాన్నిగురించి వివరాలతో మేస్ట్రేటు ఓ ఉపన్యాసం ఇచ్చాడు.

"నిజంగా మీరు చెప్పేంత గొప్పదే అయితే దాన్ని పోగొట్టుకునే ప్రయత్నం ఎందుకు?"

"అదనోయ్ బాబూ - ఘట్టిచిక్కు. ఆ పటం అంటే నాకు పరమఅసహ్యం. ఇక మా ఆవిడకోసం

చెప్పనక్కర్లేదు. ఆఖరుక్కు మాపిల్లలూ-నౌఖర్లుకూడా అసహ్యమే. ప్రజలంతా ప్రయాసపడి తెచ్చినదాన్ని చేతులారా కాల్చివేయడం నా కేం యిష్టంలేదు. అందుకే ఆ పటాన్నే బహుమతి అనుకుని తీసుకు పొమ్మంటున్నాను."

"పెద్దల్ని కాదనడం నా కిష్టంలేదు. మీ మాట ప్రకారం ఈమాత్రంసహాయం చేయగల్గుతా ననుకోండి. అదేం వెండీ బంగారం కాదాయె కరగించుకుని అమ్ము కోడానికి. అదిగాక మీమాటలవల్ల ఆ పటం అంద రెరిగినదల్లే తెలుస్తుంది; పోనీ అమ్మకుండా మన్నా ఇదో అడ్డు వుందే!"

"అసందర్భం! నీవు తలిస్తే ఎవరిచేతనైనా పంపి ఫారిన్‌లో అమ్మించగలవు. విదేశాల్లో ఇలాం టివి సులభంగా అమ్ముడుపోతవి. అప్పుడు చూసుకో నీ అదృష్టం. రెట్టింపిచ్చైనా కొంటా రక్కడ. ఓ ఏడాదిపాటు ఎక్కడైనా దాచి వుంచి తర్వాత ఆ పని చేయి."

వెంకట్రావు అంగీకారసూచకంగా తలూపి మేజామీద తబలా కొట్టినట్లు వ్రేళ్లాడిస్తూ హఠాత్తుగా "సరే ఏంచేయను మరి - మీ రింతగా చెప్తుంటే చేయ ననడం బాగుండదు. కాబట్టి పట్టుకుపోతాలెండి" అన్నాడు మహోజాలిగా.

మేస్ట్రీటు సంతోషాన్నీ ఆత్రుతనీ కష్టంగా ఆపుకుంటూ "ఎప్పుడు! రాత్రికి!!" అన్నాడు.

"అబ్బే! కుదరదు. ఇవాళరాత్రికి నాకు వేరే పని వుంది."

"పోనీ రేపురాత్రికి?—".

"రేపూ కుదరదు. రేపటికే కార్యక్రమం నిర్ణయించుకున్నాం".

"అలాయితే నీ కింక తీరిక వుండే దెప్పుడు?"

"మీ కిది తేలికగా కనిపిస్తున్నట్లుంది. —ఎల్లుండి రాత్రికైతే మీ కాపని చేసిపెట్టగలను."

"హింగల్‌కు వెళ్లి మా ఆవిడ్ని తీసుకొద్దామను కుంటున్నానే! పండుగకూడానే!!"

"పండుగైతేనేం? పోనీ మర్నాడు రమ్మం టారా? ఆవేళ తప్పితే మళ్లా నాకు పని వుంది".

"సరేలే — నీకు వీలవదన్నప్పు డేంచేస్తాను?— మరి బంగ్లాప్లాను యివ్వనా?— నీకు సులువుగా..."

"మీ మేడప్లానే నాకు తెలియ దనుకుంటూన్నా రా? నే నేం కొత్తగా వినోదానికి దిగినవాడ్ని కాను - నా వ్యాపారంసంగతి మీ కట్టే తెలియనట్లుంది".

పటం కొంగిలించుకపోడానికి వెంకట్రావు సూచ నలను పరిశీలిస్తూ, అతడ్ని మెచ్చుకుంటూ సంతోషంగా తలూపాడు మేస్ట్రీటు.

* * *

జగన్నాథరావు పండుగఅని ఆవాళ నౌకర్లంద రకూ మామూళ్లిచ్చి సెలవు యిచ్చాడు. ఆవాళ్నే ఏదో మిషపెట్టి రెండురోజులో స్వయంగా వస్తున్నానని పుట్టింట వున్న భార్యకు జాబూ వ్రాశాడు.

రాత్రి భోజనానంతరం ఒంటరిగా చుట్ట కాల్చు కుంటూ నిశ్శబ్దంగా ఆ పటాన్ని చూస్తూ కూచున్నాడు.

కార్యక్రమం అంతా సవ్యంగానే జరుగుతుం దను కున్నాడు. కాదూ? మరి — ప్రజలు నిజంగా పటా న్నెవరో దొంగిలించారని నమ్మితీరతారు. బంగ్లాలో స్వేచ్ఛగా తిరగమని దొంగకు అవకాశమీయడం మేస్ట్రీటు కిష్టంలేదు. కార్యక్రమం ఎలా కొనసాగిందో స్వయంగా చూడా లనుకున్నాడు. కాని మళ్లీ దొంగ కింతవీలివ్వడంవల్ల ఏం అనర్థమొస్తుందోఅని శంకించాడు. పటం పోతుందనేఆనందం ఆసంకోచాన్ని తరిమివేసింది. అదిగాక దొంగ చిల్లరమల్లరవాడూ కాదు. చాల నమ్మ కంగా ప్రవర్తించాడు.

ఇన్ని ఆలోచనలలో ఆపటం చూస్తుంటే తలుపు కొచ్చే అసహ్యం అది పోగొట్టుకోగల్గుతున్నాననే సంతోషంలో మాయమైపోయినది. పటాన్ని పోగొట్టు కోడానికి అతడు ఇంటికి నిప్పుపెట్టుకోడానికైనా సం సిద్ధుడేకాని తీరా నిప్పంటిస్తే ఏ ఫైరింజనో వచ్చి ఆర్పే స్తుందేమో! మూర్ఖపుప్రజలు పటాన్నైనా కాపాడాలని దాన్నెక్కడ తగులడకుండాచేస్తారో! ఇన్ని వ్యయ ప్రయాసలకు లోనవక్కర్లేకుండా దొంగిలించుకు

పోతున్నాడు వెంకట్రావు. అతడు దీన్నెత్తుకుపోతే ప్రజలు ఇది అవశ్యం దొంగిలింపబడిందని విశ్వసిస్తారు.

విరగడైపోతావులే అని జగన్నాథరావు పటం చూశాడు. మిలమిల్లాడే పైడిపూత చట్రంమీదికి దృష్టి పోయింది. ఈ వెండిచట్రంకూడా ఎత్తుకుపోతాడేమో! అచ్చే అలాంటి దొంగ కాడని తన్నుతా నోదార్చుకున్నాడు.

వెంకట్రావుతో నిర్ణయించుకున్న ప్రకారం గడియలు తీసి, దీపాలు ఆర్పి నెమ్మదిగా పడకగదిలో ప్రవేశించా డతడు. మంచంఅయితే ఎక్కాడుకాని నిద్రరాదు. అసలు నిద్రపోవడంఅనేది పడదలదు. నిద్రపోవాలనేఆశా లేదు. జరుగబోయేదంతా తెలుసుకోవాలనే చెవులు రిక్కించుకు పడుకున్నాడు.

అర్ధరాత్రిని, అంటే సరీగ్గా వెంకట్రావు వస్తానన్న ఘడియకు ఏదో అలుకుడైనట్లు భావించుకున్నాడు. వెంకట్రావు ఆసీతప్పనివాడు, సరీగ్గా చెప్పినఘుంటకు వచ్చేడనుకుని సంతోషించాడు. నిజానికి దొంగకూడా సరీగ్గా అప్పుడే వచ్చాడు.

మేస్త్రీటు చేతనైనంతసేపూ ఓపికపెట్టి ఏమి జరిగిందో చూతామనేకుతూహలా న్నిక ఆపుకోలేక నెమ్మదిగా లేచి చెట్టుతొర్రలోంచి తొంగిచూసే వడ్రంగిపిట్టలా కిటికీలోంచి చూశాడు. పూలమొక్కల కావల ఇద్దరు నల్లగా కనిపించారు. ఇద్దరూ ఏకో మోసుకుపోతున్నట్లు కనిపించింది. ఇకనేం పటం పలిగిపోకుండా పట్టుకుపోతున్నారని వా ళ్ళిద్దర్నీ చూపుకందినంతసేపూ ముచ్చటగా చూశాడు.

* * *

తెల్లవారింది. వంటవాడు లేస్తాడుగదా— నౌఖర్లూ వాళ్లూ వస్తారు. పటం పోయినట్లు వాళ్లు తెలుసుకున్నాకనే వెళ్లి తన కేమీ తెలియనట్లు నటించాలనుకున్నాడు జగన్నాథరావు. కాని ఒకసారి వాళ్ళకన్నాముందే చూస్తే ఎలా వుంటుందో ?

గబగబా కిందికి దిగి వెళ్లి బోగన్‌విల్లా కవతల పరిచివున్న దేంవిటా అని చూశాడు.

“దీని ఉపయోగం నా కేంవీ లేదని విడిచిపెట్టినందుకు క్షమించాలి” అని తెల్లటి అక్షరాలు కనిపించాయి. పరికించి చూచాడు. ఇం కేముంది - పోతుందని సంబరంపడిన పటం — ఒక్కచట్రంమాత్రమే పట్టుకుపోయాడు దొంగ !— ఎంత నమ్మకద్రోహం !

ఆ చిడిముడిపాటులో ఇల్లంతా తిరిగేశాడు. ఫ్లవరువేసులూ, అద్దం, దువ్వెన్లూ, టాయిలెట్ టేబిలుమీదవీ, కంటింట్లోవీ ఒక్క వెండిసామానైనా కనిపించక జరిగినమోసానికి వెర్రెత్తిపోయింది జగన్నాథరావుకి.

# చకోరికా ప్రలాపము

పాకల వేంకట సూర్యనారాయణ

౧

ఉ. "ఆరజనీప్రియప్రవిమలాధిక శారదపూర్ణిమాసుధా
సారకృతావగాహములు శాశ్వతలభ్యములే యటంచు వే
మారు దలంచి భీకరతమఃపటలావృతి విస్మరించి త
ద్భూరితుషారభానులవభుక్తికి సైతము నోచనైతిగా ?

౨

చ. దిన మొకవత్సరంబుపగిదిం గమియించును; తావకీన పా
వనచరణద్వయస్మరణబంధిత మీ హృదయమ్ము రాజ! త్వ
ద్వనుతకృపాసముద్రమున వెల్వడి యొక్క తరంగమేని గ్ర
క్కున నిను గొల్చుదాసికడకుం బ్రవహింప దిదేమి కర్మమో ?

౩

చ. నిరతము నిన్ స్మరించుచు ననిర్వచనీయదురంతదుర్వ్యథా
భరవివశాంగినై హృదయవాసమునన్ లిఖియించుచుందు నీ
సురుచిరమండలాకృతి విశుద్ధమహోన్నతభావతూలికన్ ;
స్థిరముగ నీయభాగ్యపయి జిందవె శీతలవీక్షణాంశువుల్ !

౪

ఉ. పూచిన తెల్లుపూత లవి పూచినయట్టుల నుండె ; ప్రేమమై
జాచుకరంబు లల్ల దిగజారగలే ; యిసుమంత నీ సుధా
వీచిక లాహరించుటల వేడుక దీరదు; దేహ మంతయున్
లోచనమై కనుంగొను విలోకనకేనియు జాలినొందవో !"

—— ० ——

# నాటకకళ: నేటి మన నాటకములు

రాళ్లపల్లి అనంతకృష్ణశర్మ

[నెల్లూరులో గడచిన డిసెంబరు (౧౯౩౮) ౨౫-వ తేది అష్టమాంధ్రనాటకకళా పరిషత్సమావేశము జరిగినది. దానికి విఖ్యాత విద్వాంసులైన శ్రీయుత్ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారు అధ్యక్షత వహించినారు. ఈ క్రింద ప్రకటితమయినది వారి అధ్యక్షోపన్యాసము నందలి ప్రధానభాగము.—భా. సం.]

ఒకటిరెండుతప్ప ఇప్పటిరూపకములు సామాన్యముగా రెండుతరగతులకు చేరును. తీవ్రములయినవి కొన్ని, శైలికరైనవి కొన్ని. రెంటియందును నాటకానురాగము కృశించినది. తీవ్రజాతివి కామము, క్రోధము, మత్సరము, హింస, శోకము మొదలగు కష్టభావములను తెగబెంచి సభ్యుల ఉద్రేకపు మత్తెక్కించి భావజ్వరమును కలుగజేయును. సభాకంపమును తెచ్చుకొన్న సాహసిక నటులచేత కిట్టివి లభించెనా వారు బొమముడులు, పిడికిళ్లపిసుకులు, వడకు, గద్గదస్వరము మొదలగు వెగటు నటనలను మితిమీరి ప్రయోగించి సభ్యులహృదయ సౌకుమార్యమును పదమదము చేయుదురు. మత్తుకు లోగి తాత్కాలమునకు తృప్తిపడుట ఎట్టిసంస్కారులైనను మనుష్యులకు స్వాభావికమైన యింద్రియధర్మము. మద్యము వాసనచూచినను ప్రాయశ్చిత్తము చేసికోవలెనని నమ్మి యాచరించు పవిత్రవైదికునికిగూడ బలవంతముగానో, మోసముగానో ఒక గంటెడు కల్లు పోసి, "లాహిరే గంజాహిరే" పాడించి తైతక్కలాడింపవచ్చును. ఇట్లే నాలుగైదుమారులు చేసినచో ఇదే బ్రహ్మానంద మనుకొనువంత లోతుకు వానిని దింపవచ్చును. కొన్ని తాంత్రికమతములలో కల్లు సారాయీలకు అవధూత పద్ధతులలో అఫీమునకును ఇట్టి పవిత్రతయే యేర్పడియుండుట మన మెఱుగుదుము. ఉద్రేకపుబలిమి యిట్టిది గావుననే దానియొత్తిడిగల రూపకములు జడిసినపుడు, అంతకంతె నెక్కువగా జూచినప్పుడు, వివేకులను సహృదయులు గూడ సహించుచున్నామను భ్రాంతికి లోనగుదురు. క్రమముగా ఇదే యుత్తమ నాటకకళ యనుకొందురు!

ఇట్టి నాటకముల నాట్యముల ప్రభావము ఇటీవల కొంత తగ్గుసూచన లున్నవి. నాకేమో ఇది సంతోషవిషయమే. కాని అట్లగుటకు కారణము ఈపద్ధతిలోని లోపముల నెఱుగుటకాదు ; మఱి మనకు గలిగిన చేజారేయని తలచుచున్నాను. మనుష్యుల యోగ్యతకు తగినట్లు తాటికల్లు మొదలు తాచుపాము విషమువఱకు వేరువేరు డిగ్రీల మాదకవస్తువు లున్నట్లు నాటకములలో మీదమీద ఉద్రేకమును హెచ్చించుచు పోవుటకు సాధనములులేవు. ఒక మాదకద్రవ్యము రుచిచూచి అలవాటుపడి చేసరినవానికి దానిమోతాదును హెచ్చుచేసికాని వేఱుద్రవ్యమును మార్చికాని ప్రయోగించి క్రొత్తమత్తు గల్గించి ఆశచూపవచ్చును. కాని రంగస్థలమున నట్లుచేయు నవకాశము చాలదు. నిన్నటిమాటలే నిన్నటిపాటలే నేడును. అల్పస్వల్పపు మార్పులతో ఆశతీరదు. కొన్ని తెగబెంపు మార్పులు చేయుసాహస మున్నను ఇంకను సంఘమువారో సర్కారువారో అడ్డువచ్చుచున్నారు. పురుషుడు స్త్రీవేషమువేసి చేయు విలాసబిబ్బోక విభ్రమములతో తృప్తిచాలదని తెలిసికొని స్త్రీలనే రంగము రచ్చకీడ్చితిమి. కాని యిప్పుడు దాని యందలి మోజును మందగించినది. నాయకుడు నిజమైన పురుషుడు నాయిక నిజముగా స్త్రీ యైనమాత్రముతో తృప్తిపడు కాలము పోయినది. నటుల సభ్యుల కామోద్రేకము ఇంకిపోకుండ నాయికా నాయకుల శృంగారపు చక్కందములను నవనవోల్లాసముగా పెంచి రచిం

చుటకును నటించుటకును చూచి యనుభవించుటకును తయారైన మనుష్యులున్నారు కాని, సంఘమందు పెద్దలైనవారి కింకను కొంతబుద్ధి యున్నది; సర్కారువారి కింకను నీతియందు కొంతనమ్మక మున్నది. కావున అట్లు చేయుటకు వీలులేకున్నది. స్వాతంత్ర్యము ననుభవించువారును మన కిప్పటి కన్ని వడతలకును ఆదర్శభూతులును అగు పాశ్చాత్యుల సంస్కృతిలో ఇట్టి ఉద్రేకమునకు ప్రాధాన్య మెక్కువ. కాబట్టివారు తమజీవితమందును కళలయందును ఉద్రేకము పరమావధికి దాకు వఱకు ఈడ్చి యాడినారు. దీనిఫలముగా హిట్లరులు ముసోలినీలును అవతరించి యూరపుదేశపు నీతి ధర్మములను నయవాణ్యములను ఏకాపోశనముచేయ సంకల్పించి ఎక్కడజూచినను రణోద్రేక భేరిని వాయించుచున్నారు. ఇటీవల వారిలో తీవ్రవివేకశాలు లనేకులకు మనుష్యజీవిత డోలయందలి యీభావ శృంఖలను ఇట్లు తుదిదాక మితిమీరి త్రోసి యూచుటలో సుఖము నిజముగా లేదనుటయేగాక అపాయము లెక్కువ యను తత్త్వము పలువిధములుగా అనుభవమునకు వచ్చినది. ఆస్వచ్ఛందమును నిరోధించుటకై వారు ప్రబలప్రయత్నముచేయ మొదలిడినారు. మనలో సమగ్రులు ఇంకను ఆజనాబ్దాకీని గుర్తింపవలసియున్నది. చెప్పవచ్చిన దేమనగా మనలో తీవ్రభావముల నుద్రేకించు చేరమునకు దిగినకళలు - ముఖ్యముగా నాటకములు - మత్తుమోతాదు హెచ్చించు మార్గములు లేక వెనుకబడుచున్నవి కాని తమది తప్పుదారియని తెలిసికొనికాదు. ఇప్పుడట్టినాటకములు రచించువారును అభినయించువారును అరుదుగనున్నారు. దీని నొకనష్టముక్రింద పరిగణింపబనిలే దనియు మీదుమిక్కిలి ధన్యవాదము చేయవలసిన విషయ మనియు జెప్పితిని.

కాని యీ యుద్రేక కోలాహలములలో రసప్రధానమైన రచనకు ప్రయత్నించు కవులుగాని అంతకన్న దానినభినయింప సాహసించునటులుగాని చూచు నుత్సాహముగలసభ్యులుగాని సామాన్యముగా కానరాక పోవుచున్నారనుట మన మిప్పుడు చింతింపవలసిన విషయము. ఇక ప్రాచీనమహాకవుల శాకుంతల మృచ్ఛకటికాది రూపకరసఘుటికల జిక్కు విచారించువా రెవరు? ఇప్పటి నటులలో అట్టివి కలవనిరైన నెఱిగినవారు పెక్కుమంది యుండరేమో! చదువరులను నేటి సభ్యులలో ఎవరో కొందఱు మూలములనో తర్జుమాలనో పఠించినవారు గలరుకాని వాని నభినయించి, చూచి యానందించుభాగ్యము గలవారు పలువురు లేరు. సుమారు ఇరువదేండ్లకుముందు కర్ణాటక రంగస్థలములందు రత్నావళి, శాకుంతలము, మృచ్ఛకటిక, ఉత్తరరామచరితము, మొదలగువానిని ధారాళముగా నభినయించుచుండిరి. వానియందలి ప్రధానపాత్రముల నభినయించుటయందారితేరిన నటు లుండిరి. నేడు అవియును కానరావు; వారును అంతరించినారు. తుదకు కాలేజీలలోను స్కూళ్ళలోను వినోదములకై విద్యార్థులభినయించుచుండిన షేక్స్పియరు మొదలగు పాశ్చాత్త్యకవుల తీవ్రనాటకములుగూడ నేడు గోచరింపవు. తెలుగురంగము ఇంతకంటె మేలుగా నున్నదను సూచనలు కానము. ఇప్పటి విమర్శకులు పై నాటకములలో అనావశ్యకములగు చాదస్తము లున్నవనుకారణముచేత వానిని తిరస్కరించుచున్నారు. చాదస్తములు వానిలో కలవు నిజమే. కాని అంతటితోనే వానిస్వరూప మంతయు ముగిసెనా? ప్రతాపరుద్రీయమును చదువ మొదలుపెట్టి దాని నాందీపద్యమందలి 'టకటొంకుటాటోటు'లకు వెగటుపడవచ్చునుగాని దానిచే ఆనాటకమే అభినయమునకు తరముగాదనువారి రసికత యెందుకు తరమైనది? తత్త్వము విచారించితిమేని చాదస్తముల యంతస్తును దాటి లోతుకు దిగి చూడగల్గుటయే ఉత్తమ సంస్కారమునకు గుర్తు. అట్లుచేయలేనిది వట్టి పైపూత.

మఱియు ఇట్టి చాదస్తములు ఎప్పుడు ఎందు లేవు? మనజీవితములో మతములలో కళలలో ఎందుగాని నియమ మనుదాని నేర్పఱిచితిమేని అది చాదస్తము క్రిందికి దిగకమానదు. ఏదో యొకవిధమగు నియమము లేని బ్రదుకు గడపుటకు మనుష్యుల కెప్పుడును సాధ్యము కాదుగదా. కనుక ఇప్పటిరూపకములు తక్కినయన్ని విషయముల వలెనే ప్రాతచాదస్తములను కొన్నిటిని వదలి యుండవచ్చునుగాని క్రొత్తవి కట్టుకొనక యుండజాలవు. కాలైక్యము, వస్త్వైక్యము, దేశైక్యము, పాత్రపోషణము మొదలగు పేళ్లతో ఆధునిక నాటక

కర్త లెన్నో చాదస్తములను గట్టుకొన్నారు. ప్రతిభా బలముగలవారుకూడ ఇట్టి చిల్లరవిషయములకు చెవి యొగ్గుట రసికులలక్షణము గాదు.

ఇక ఇప్పుడెక్కువ వ్యాప్తికి వచ్చుచున్న రెండవ తరగతి రూపకములు సామాజికము లనబడునవి. వీనిలో రసముమాట యట్లుండగా భావతీవ్రతకుగూడ తగినంత అవకాశము లేదు. వీనిపరాయణము మన నిత్యజీవితమును అనుకరించి అచ్చుగొట్టుట. వీనిని చూచినప్పుడు చదివినపుడు మనకు గలుగు అనుభవము, ఇరుగింటికో పొరుగింటికో పోయి గంటప్రొద్దు లోకాభిరామాయణముగా మాటాలాడి కాలక్షేపముచేసి వచ్చినప్పటి యనుభవముకంటె నెక్కువ స్థిరమును గాదు, ఎక్కువ విశాలమును గాదు. సమకాలీన సంఘమందలి వేషభాషాదులను వేళాకోళము చేయుటను జూచి మనకు కొంత వినోదముగలిగి యుల్లాసపడుదుము గాని అంతకుమించిన విలువ లేదు వీనికి. వీనిరచనలలోనెల్ల ప్రాయికముగా గ్రంథకర్తలకు స్వచ్ఛందవృత్తియందుగల నమ్మకమే బీజభూతమైయుండి, ఏయుదారాదర్శమునకు గాని ఉదాత్త భావమునకుగాని ప్రాముఖ్యము లేకపోటచేత ఇందలి యేయనుభవమునకును సత్తువలేదు. వినోదమునకు జీవితమునగల విలువ నెఱుగకపోలేదుగాని నాటకములవంటి మహాసంస్థల కీయుద్దేశము చాలదని నాయభిప్రాయము. దీనికై యింతకాలమును ద్రవ్యమును కర్చుపెట్టుట వ్యర్థముకాదా యనిపించును. ఈమాత్రపు వినోదము అరగంట చీట్లాడినను గలుగును.

కావుననే యిప్పటి నాటకములందు సామాన్యముగా మనకు గల యుదాసీనము. సినీమాలవ్యాప్తిచే నాటకములకు వ్యాప్తి తగ్గినదని కొందఱ యభిప్రాయము. ఒకవేళ కొంతవఱకది నిజమైనను సంఘమునకు ప్రత్యేకముగా కలిగిన కష్టమేమో నా కర్థముకాలేదు. నాటకపు కంపెనీలు చేయుచున్న పనినే సినీమాకంపెనీలును చేయుచున్నవి. ఇన్నాళ్లును సంకుచితమగు రంగస్థలమిప్పుడు పెద్దదైనది; ఇక్కడ ఆడుచుండిన ఆడగల నటులే అక్కడను ఆడెదరు; ఇక్కడి కవులే అక్కడను; ఇన్నాళ్లకంటె ఇరువురును ఎక్కువజీతములు గడించుచున్నారు. ఇట్లు చిన్నరంగములను పెద్దదిగా చేయుట, కవుల నటుల జీతములు హెచ్చించుట, వేషాలంకారపరికరము లన్నియు ఎక్కువ సహజమై యుండునట్లు సమకట్టుట ఇత్యాదులకై ఎక్కువ కర్చుపెట్టి ఆపెట్టుబడికి తగినట్లుగా ఎక్కువ లాభమును సంపాదించుటతప్ప మననాటకముల విషయమున సినీమాలు చేసినతప్పేమియు నాకు దోపలేదు. ఇన్నాళ్లును నాటకము లాడుచుండిన మనమే నేడు సినీమాలకు జొరబడినామే కాని క్రొత్తవా రెవరును వచ్చి చెఱుపలేదు. ఇట్లగుటచే నాట్యకళావిషయమై మన కుండిన దృష్టి యేమియు మార్పుపొందలేదు. కావున ఇది ఇల్లు విడిచి సంతకు వచ్చినట్టాయెనేకాని అసలు స్వరూప మట్లేయున్నది. నాటకాలకంపెనీలవారి కీస్పర్థలో లాభము కృశించినందుకు పెద్దసాహుకార్లతో పోటీకి నిలిచి కష్టపడిన చిన్నవేహారులకంటె మనము ఎక్కువ కనికరపడవలసినపని లేదు. పకి ప్రయోజనమును లేదు. నాటకములదృష్టి సినీమాలదృష్టికన్న భిన్నమగువఱకు రెంటికిని స్పర్థ తప్పదు. ఆ పోటాపోటీలో ఎక్కువయనుకూలములుగల సినీమాలు అవి తక్కువగల నాటకములనడచివేయుట స్వాభావికమైన మాత్స్యన్యాయము.

దృష్టిభేద మనగా నెట్టిది? ఈ యుద్రేకములను చౌకవినోదములను వదలి రసమందు దృష్టినిలుపుట. శోధితములై పవిత్రములైన భావములే రసములని స్థూలముగా జెప్పవచ్చును. రసమును సాధించుటకు పై యుద్రేకవినోదములు కొంత పనికివచ్చునుగాని వానిని ఆ మట్టు మీఱనీయరాదు. కోపము వచ్చినప్పుడు బొమముడి వేసికొని కొట్టెదనని బెదరించువఱకును రసమునకు చోటున్నది ఆమేరను దాటి బూతులు దిట్టి చేతో కాలో విఱుగగొట్టనే కొట్టినప్పుడు రసమునకు అసహ్యముగలిగి అంతర్ధానమగును. పూవులతో పూజలు పాటలతో ప్రార్థనలు జరుగుచుండువఱకు భక్తిరసము భోగ్యముగా నుండునుగాని భక్తులు పిచ్చెత్తి బిత్తలియాట లాడ మొదలుపెట్టి స్త్రీ పురుషభేదములేని యద్వైతమునకు దిగిరేని రసికు లాచోట నుండక చల్లగ జారవలసినదే. ప్రతిభావమునకును కొద్దిగనో గొప్పగనో ఇట్టి న్యాయ్య మనువర్తించును: రసోపాసకులు పైని విప

కీలకములను సహజములైనను వదలుకొనవలసినట్లే రసస్ఫూర్తి కక్కరలేని కేవలభావములు రంగపరికరములు అభినయములుకూడ ప్రాక్టాలికములుగా మన్నన త్యజింపవలసియుండును. తపస్వుల శాంతరసము స్ఫురించుటకు అడవిలోని పర్ణశాలయొకటి చాలునుగాని ప్రక్కలోని పల్లెరుగాయలు పాములు తేళ్లను అనావశ్యకములు. ఇట్టి యవాంతరవిషయములను పెంచుట యంటే ఇప్పటి సినిమాలను ముఖ్యమైన తాత్పర్యమున్నది. ఇంచుమించు మనము వానిని చూచిపోవుటయు తీరిక. సినిమాల కీపని సాధ్యముకూడ. పదార్థము లున్నచోటికే ఒకమారుపోయి అవి బొమ్మలెత్తినచో వారికి చాలును. తక్కినపనియంతయు ఆ బొమ్మలనమ్ముకొట్టి పంచిపెట్టుటయే. రంగస్థలము వారికట్లుగాక అపరికరము లన్నియు అభినయించుచోటికే ప్రతిసారియు తెమ్ముకోవలయును. ఇట్లగుట చే పరికరములను పెంచుకొనుట సినిమాలవారికి సాధ్యము; సహజము. రంగస్థలము వారికది యసాధ్యము గావున దానికై వారు కృత్రిమమార్గములకు దిగక విధిలేదు. ఇదిగాక సినిమాలలో ఉద్రేకమునకును వినోదమునకును గావలసిన స్థూలాభినయములను ఫోటోతీయవచ్చునేకాని రసస్ఫూర్తికి జీవమను సూక్ష్మ,సూక్ష్మతరాభినయమును తీయుట సాధ్యముకాదు. కనుకనే సూక్ష్మభావములను చూపవలసినప్పుడు బొమ్మను 'భూతద్దముతో' పెద్దచేసి చూపించుట సినిమాలకు విధియైనది. కాబట్టి గ్రామఫోను సంగీతమును సినిమా యభినయమును ఇంచుమించు ఒక తరగతివి. మఱియు ఫోటోతీయు యంత్రము లెంత నాణ్యముగలవైనను సాక్షాత్తుగా అభినయమును చూచినంతతృప్తి పరంపరగా చూచినప్పుడు కలుగదు; అభినేత లెంత సమర్థులైనను మనము చూచునది వానినీడలే కావున మన మనుభవించునదియు రసచ్ఛాయయే కాని రసముకాదు. ఇంతేకాక నిన్నటియభినయము చాలదనికాని బాగులేదనికాని తోచినచో నేడు దానిని మార్చుకొని చేర్చుకొని సవరించునవకాశము రంగము వారికిగలదు కావున పేలాడుకవకాశము తక్కువ. సినిమాలలోనది ఒకటే శాశ్వతముద్ర; దానిని మార్చవలెనన్న లక్షలు మరల కర్చుపెట్టవలసినదే. కాబట్టి మార్పు సామాన్యముగా సాధ్యముగాదు. కనుకనే ఒక నాటకమును చూచినన్ని మారులు ఒక సినిమాపటము చూచుట కుత్సాహ ముండదు. ఇట్లగుటచే రసోపాసన చేయు విషయమున నాటకములతో సినిమాలు పోటీకి నిలువజాలవు.

ఇట్టే వ్యాప్తియందును ద్రవ్యార్జనమునందును సినిమాలతో పోటీకి నాటకముల కంపెనీలు తాళలేవు. బొమ్మలవలె మనుష్యులనుగూడ ప్రాణములతో అచ్చుకొట్టి ఇచ్చవచ్చినచోటికి టపాలలో పంపి పంచిపెట్టు నవకాశములను ఇప్పటి కింకను ఏదేశపు వైజ్ఞానికులును కనిపెట్టలేదు. ఇంతలో కనిపెట్టుదురను నాశలు లేవు. కనుక చూచువారున్నచోటికి సినిమాలు పోగలిగినంత సులభముగా రంగస్థలములు పోలేవు. ఇది యున్నచోటికే వారు చాలవఱకు రావలసియుండును. కాబట్టి సినిమాలంత నాటకములు ఆర్జింపలేవు.

అందుచే ఈ రెంటికిని పోటాపోటి పెట్టుకొనుటయే పొరపాటు. మఱి ద్రవ్యార్జనలేనప్పుడు రంగస్థలములు కేవలాశ్రయించి బ్రతుకవలయునా? సినిమాచుక్కలతో పోల్చుకొని చూచినప్పుడు రంగనటులకు తమ యాదాయము తక్కువయనిపించునుగాని ఆదాయమే లేనిస్థితికి నాటకములు - అనగా రసప్రధానములు - ఎప్పటికి రానేరవు. రసికజనులు కొందరైనను ఎప్పుడును ఉందురుగావున రసోపాసకులను నటులకును కవులకును జీవితము దుపవాసము చేయవలసినయక్కర యెప్పుడును ఉండదని నానమ్మకము. ఇక తమకన్న ఎక్కువధనము గడించువారిని చూచి తాము హీనులమని క్రుళ్లువారికి బ్రతుకులో ఎప్పుడును నెమ్మదియుండదు.

"ఉపర్యుపరి పశ్యన్తః సర్వ ఏవ దరిద్రతి
అధో౽ధః పశ్యతః కస్య మహిమా నోపచీయతే"

అను పెద్దల నానుడి సర్వసత్యమైనది. ఇట్టివారి వలన తమకుగాని పరులకుగాని ప్రయోజనము గలుగదు. మఱియు సినిమాలు రాకముమునుపుండిన నటులును నాటక కర్తలును కుబేరులై యుండిరేమి? నే నెఱిగినంతవరకు వారందఱు మర్యాదగా ఏదో 'అహార్యహని' కాలక్షేపము చేయుచుండినవారే; మఱియు వారి

వరకుగాని ప్రాయోపవేశము చేయవలసిన స్థితికిని వచ్చి యుండలేదు. ఏవృత్తి యందైనను చేతనైనంతలోతుకు దిగి సాధింపవలయునని గొప్పపరాయణము నుంచుకొన్న వారికి శ్రద్ధావంతులకు ద్రవ్యాశ ప్రధానముగా నుండ గూడదు. ఆలోతుకుదిగన్నవారికి ధనాశ క్రమముగా మందగించునుగూడ. లౌకిక వైదిక వృత్తులందు విజ్ఞాన భాగములందు కళలయందు గొప్పసిద్ధులను సాధించిన మహాపురుషు లందఱు నాటికి నేటికి రేపటికిని ఇట్లు ద్రవ్యఫలమును గౌణముగా జూచినవారే.

కాని సామాన్య జనులకింత గొప్పపరాయణము త్యాగబుద్ధియు గలుగునా ? వారికి ధనముమీది యాశ సహజము గాదా ? అను ప్రశ్న వచ్చును. కాని ఎవరు సామాన్యజనులు ? ఎవరు విశేషజనులు ? చదువుకొన్న వారు విశేషజనులు తక్కినవారు సామాన్యులని కదా భావము ? అప్పటికి చదువరు లందఱు ద్రవ్యాశలేనివార నియు ఇతరులందఱు పిసినారులనియు జెప్పవలసి వచ్చును. అది అనుభవ విరుద్ధమని చెప్పనక్కరలేదు. అట్లు గాక ఉదాత్త విషయముల విలువ నెఱిగినవారు విశిష్టులు; తక్కినవారు సామాన్యులు అని చెప్పినచో అట్టి సామాన్య జనులకు ఉదాత్త విషయములను తెలియ జెప్పినను తెలియదని యూహింప వలెనా ? అట్లూహించుటకు ఎవరికేమి యధికారము ? అట్లుగాక సామాన్యులను సామాన్యులనుగానే యుండజూచుట విశిష్టజనుల విశేషమునకు లక్షణమా ? అవకాశ మిచ్చి చూడవలయునుగాని మనము సామాన్యు లనుకొనువారిలో ఎందఱియందు ఎన్ని విశేష ధర్మముల బీజము లణగి యున్నవో ఊరకయే మనకెట్లు తెలియును? విశిష్టజను లనుకొను వారికిమాత్ర మీ తెలివి పుట్టుకతో వచ్చినదా ? నేర్చినది నేర్పబడినది కాదా ? ఐనప్పుడు మనవిశేషమందు మనకు నిజముగానే నమ్మక ముండినయెడల సామాన్యజనులకు దానిరుచి చూపి మనదారికి దెచ్చుకోలేమా ? తెచ్చుకో వలదా ? నిజము చూడబోయిన ఈ సామాన్య విశేష విభాగము సుఖప్రియులను సోమరులు చేసికొన్నది, వారిస్వార్థ పరత్వమున కిది యూతకోల.

కనుక జనులను రసికులనుగా జేయుట, చేయ ప్రయత్నించుట రసోపాసకులగు కవినటసభ్యులధర్మము. ఈపని యిట్లొకమాఱు ఉపన్యాసముచేసిన జాలదు. పదేపదే ఒత్తి చెప్పి జనుల చిత్తమును రుచిని సంస్కరింప వలయును. అవకాశము గలిగినప్పుడు కళానుభవము నందలి భేదములను వాని గుణదోషములను నాటునట్లు బోధింపవలెను. అంతకంటె ముఖ్యముగా మంచి సరసరూపకముల వ్రాసి వ్రాయించి ఆడి యాడించి ప్రచురింపవలెను. శిక్షాస్మృతి, ధర్మశాస్త్రము, నీతిశాస్త్రము, సదాచారము మొదలగు మార్గములలో దినదినమును జనులచిత్తమును నయభయములచే దిద్దితీర్చుచునే యున్నగదా వారికి అహింస, సత్యము, అస్తేయము మొదలగు ఉదాత్తగుణములయందు నమ్మిక, వాని నాచరణలోబెట్టు నుత్సాహమును సమయకయుండును. జనులను నీతిమంతులజేయుట కెంతకష్టమో వారిని రసికులనుగా జేయుటకును అంతే కష్టముపడవలయును. దానియంతే ఇదియు నావశ్యకము.

ఇది విద్యాశాఖాధికారులును సంఘమందలి పెద్దలును చేయవలసినధర్మము. కాని విద్యాశాఖవారు ఈవిషయమున ఎక్కువ శ్రద్ధపుచ్చుకొను సూచనలులేవు. విశ్వవిద్యాలయములవారు ఇన్నాళ్లను మనుష్యునిరాణమున బుద్ధియొక్కటితప్ప తక్కినదేదియు లేదనితలచినవారివలె, దానిని పట్టి శుష్కవిషయములతో కూటినించుచుండిరి. ఈవల మనకు పొట్టకూడగలదని కనుగొన్నట్లున్నది. వృత్తివిద్యలకు ఇప్పటిప్పుడు వా రెక్కువగా అవకాశము గల్పించుచున్నారు. కాని యీబుద్ధిని పొట్టను మీఱినది, మనసుఖదుఃఖములకు మూలస్థానమయినది "భావాంబరవీధి' యొకటి మనకు సృష్టికర్త యిచ్చియున్నాడనియు, అది తిక్కలేక చెడదిరుగుచున్నదనియు వారిమనసునకు చాలినంత తట్టలేదనవలసియున్నది. యూనివర్సిటీలవారు ప్రాచీనమహానాటకముల నింకను పాఠము చెప్పుచున్నారు. ఐనను వారిదృష్టియంతయు నాటకలక్షణములు చరిత్రము, కవికథ ఒండొంటిపోలికలు, విభేదములు, మొదలగు బహిరంగముల మీదనుండునే కాని, విద్యార్థులచే వాని నాడించుట, తమచేత గాకున్న నితరులచేతనైనను వాని నాడించి చూపుట మొదలగు స్వానుభవమార్గములవంక పోకున్నది. చాలనందుకు ప్రాచీననాటకములను ఆడి చూచి అనుభవింపకయే అవి

నాటకరూపమైన కావ్యము లనియు ఆటకు పనికిరావనియు రంగమువీూద రక్తి నియ్యవనియు ధైర్యముతో నుపదేశించుచున్నారు. గురువులవాక్యములను శిష్యులు భక్తికలిగియో లేకయో అనువాదముచేయ నలవాటుపడి యున్నారు. సమర్థులైననటులు శ్రద్ధతో చేర్చి యభినయించినప్పుడు తప్ప, ఏనాటకము చేది ఎంతవఱకు అభినయింపనగునో కాదో నిర్ణయించుట యంతసులభమైన పని కాదు. వివేచించుబుద్ధికిని అనుభవించు అంతరంగమునకును పొత్తు కుదిరింపవలెనని, అంతరంగమును బుద్ధికి లోబఱుపవలెనని మనుష్యులుచేయు ప్రయత్నము లన్నియు, బుద్ధికందని యనుభవములు లెక్కలేనన్ని కలవని చూపి బుద్ధికి బుద్ధిచెప్పుటలో పర్యవసానమగుచున్నవి.

...రసికపారిషదులు చేయుప్రయత్నముచేత రసిక జీవనము పునరుద్ధారము కావలసియున్నది. సంఘము సహృదయము కావలసియున్నది. రుచులును అభిప్రాయములును శోధనకావలసియున్నవి.

---

# నా కు టీ ర ము

మధునాపంతుల సత్యనారాయణమూర్తి

నీసౌధంబులు, నీమణీమయగృహానీకమ్ము, నీశిల్పతా
వైశారద్యము, నీమనోహరకళాప్రావీణ్యతల్, మాకు లే
వోసామీ! కడుభక్తి నే నొకకుటీరోద్యానముంగూర్చి యా
వా సం బుంద నదే మదీయ సుఖసంతోషాస్పదంబై భాసిలున్.

అదియె నాభోజ్య, మదియె విహారభూమి,
అదియె శయనీయ, మదియె ప్రాసైకగృహము,
అదియె సర్వస్వ మదియె నా హృదయవీథి
నాకుటీరముకంటె నన్యమ్ము లేదు.

అదిగో! న రమణీయ రాజ్యరమ; దివ్యారామరంగస్థలిన్
హృదయమ్ముల్ చివురింపగా మధురలాస్యేచ్ఛన్ విడంబించె న
ల్లదిగో! యామె పదారవిందయుగళోద్యన్నూపురధ్వాన సం
పద ; దానిన్ సతతమ్ము నేనను శ్రవణపర్వమ్ముగా గ్రోలెదన్.

ఆమె లాస్యకళావిలాసామృతంబు
తనివితీరగ గడుపార ద్రావి ద్రావి
యమరతం జెందినాడ, నన్యమ్ము లేల ?
శాశ్వతానందసౌఖ్యరసంబు గొంటి.

ఒకనాడు బొండుమల్లెకు నాకు లూడ్చుచు
బోదెలో కరగి నే పొరిలిపోదు,
నవని రాలినయెండుటాకుల గలగల
గలగలధ్వనులలో గలసిపోదు,
పోకబోదుల నీరు పోయుచు నొక్కపు
డిట్టిట్టి చేపనై యీదుకొందు,
తలిరుటాకుల గరాంగుళుల దువ్వుచు మేను
మఱచి యల్లల్ల దన్మయుడ నగుదు

ప్రసవమున బ్రసవమయి నే పరిమళింతు
నాకులో నాకునై ప్రాకు నలముకొందు
లతను లతనయి చెట్టుపై బ్రాకిపోదు
నాకుటీరోపవనమె నానందనంబు.

సోదరా! నా కుటీరమే నాదుస్వర్గ
భూమి యీనవోద్యానమే పుణ్యఫలము
శాశ్వతబ్రహ్మలోకసంస్థాన మిదియ
పొమ్ము! నే నింక రాను మీ పొందు గోర.

"ఓదయానందరూపిణీ! ఆదరమున
నామృతాత్మను గాచి యుందే మనుపుము!
చాలు నిది" యని సతతము సంస్మరింతు
నా కుటీరోపవన దేవతాకుమారి.



# అష్టమ ఆంధ్ర నాటక కళాపరిషత్తు

## నెల్లూరు

ఆహ్వాన సంఘాధ్యక్షులయిన శ్రీ బెజవాడ రామచంద్రారెడ్డిగారు తమ స్వాగతోపన్యాసమునం దిట్లు చెప్పియున్నారు.

ఇన్నినాళ్లు ఆంధ్రనాటకకళాపరిషత్తు జరుగుచుండియును స్థిరత్వమును పొందిగాని నియమావళికి కట్టుబడిగాని యుండలేదు. ఇక జాగుసేయక యిప్పటనే నియమావళిని (Constitution) నిర్ణయించుటయు, ఈ సంస్థను రిజిస్టరు చేయించుటకు వలయునేర్పాటులను గావించుటయు ఆవశ్యకపరమని తోచుచున్నది. నియమబద్ధముగాని సంస్థ స్థిరత్వమును పొందజాలదనియును, ఉపాసకుల యారాధనకు ఉదారుల ప్రేమకు అర్హతను పొందజాలదనియును మీకు ప్రత్యేకము చెప్ప నవసరము లేదు. ఈ సంస్థకు కేంద్రమును నిర్ణయించి గృహమును గృహోపకరణములను సమకూర్చి కలకాలము కాపురముచేయుటకు వలయేర్పరుపవలసియున్నదని నా మనవి. వివరములను మహాసభవా రూహించి నిరూపింతురని కోరుచున్నాను.

ఈ పరిషత్తు చరిత్రమును సేవను రెల్లరును సుత్రె అగుటకై యింతవరకు నడచిన కార్యబాహుళ్యమును (Proceedings) గ్రంథరూపమున బయల్పరచినచో ఒక శాశ్వతమైన పునాది యేర్పడునని నాతలంపు. నూతనోపాసకుల నాకర్షించుటకును, అభిమానులను ప్రేరేపించుటకును పరిషచ్చరిత్రగ్రంథము యెక్కువగా తోడ్పడగలదని నా నమ్మకము. ఈ సూచనను మహాసభవారు ఆలోచించెదరుగాక.

ప్రసిద్ధ నటకుల సంక్షిప్త చరిత్రము నొకదానిని వ్రాయుటయు నవసరమని నామతము. పూర్వపు నటకులయొక్కయు యిప్పటినటకులయొక్కయు నామరూపములను కొంతకాలమునకు మరచుటయందు విపరీత మెద్దియును లేదు. కళాసేవను యింతవరకు గావించి కీర్తిగాంచినవారిని మరచిపోకుండ శాశ్వతస్మరణకు అవకాశమును గల్పించెడు గ్రంథమొకటి యేర్పడుటకు ప్రయత్నమును జేయవలసినవిధి యీ పరిషత్తునకు గలదను నానమ్మకమును మీరలు మన్నింతురని విశ్వసించుచున్నాను. ఆ గ్రంథమునందే అప్పటప్పటికిని గల్గుచుండిన ఆంధ్రనాటకాభివృద్ధినిగూర్చియును నటసంఘములను గూర్చియును వివరించుట యుక్తము. నాట్యరంగాంగములయిన సంగీత సహాయము, వేషధారణము, రంగరచన, నటభవన నిర్మాణము, స్వదేశ విదేశనాటక కళలు, ఆంధ్రనాటక నూత్న పరిణామము - యిత్యాది ముఖ్యవిషయములకుగూడ ఆ గ్రంథమునందు తావుండుట సమంజసము. పూర్వనాటకాంగములు అతిత్వరితముగ రూపుమాసి విశ్వరూపమును దాల్చుచున్న యీ కాలమున అట్టి గ్రంథమువలని యుపయోగములను సేమ యింకను విపులీకరించ నవసర ముండదని యూహించుచున్నాను.

ఇట్టి పరిషత్సభలకు అంగములుగ కొన్ని వస్తుప్రదర్శనము లుండుటవలన నటకులకు నాటకాభిమానులకు కొంత ఆకర్షణము నెగడుట నిర్వివాదము. నాటక ప్రదర్శన విజయమునకు తోడ్పడగలిగిన వేషధారుల రూపపటములు, వేషములకు వలయు సామగ్రి, ఆదర్శ రంగప్రతిరూపములు, నూతన యూహలను తెలుపగల గ్రంథములు, చిత్రములు, నమూనాలు ప్రదర్శనార్హములయి వివేకోత్తేజకములయి యుండగలవు. పరిషత్సంస్థకు స్థిరత్వము సౌష్ఠవము ఆదరము యెక్కువయగుడు యిట్టిప్రదర్శనములు సులభములయి యుండగలవు.

ఆడిన నాటకమునే యాడి, పాడినపాటలనే పాడి, కూడిన నటకులనే కూర్చి మండలాంతరములందు నాట్యకళాకౌశలాభివృద్ధులను ప్రదర్శించుటవలన గలుగు లాభ

ములనుగూర్చి చెప్పవలసిన యవసర మంతగా లేదు. సాంఘికములు పౌరాణికములు చారిత్రకములునను నాటకశీలనమునందు ఆదర్శములను ఆకర్షణములను ప్రదర్శింపగలనాటకము నొక్కదాని నొక్కకచోట నాడుటవలన ఉపయోగములు లేవని చెప్పలేము. అట్టి అనురూప నాటక ప్రదర్శనములు (Model dramas) నాటకకళాభివృద్ధి కెంతో తోడ్పడగలవని నమ్మకము. రాగలమహాసభల నిర్ణేతలు ఆ శాఖయందుగూడ కొంత యుత్సాహమును జూపెదరని నానమ్మకము.

నాటకముల ధోరణిని కాలము అతిరయమున మార్చివేయుచున్నది. వైదుష్యము సన్నగిలుచున్నది. సంగీతము పరరాష్ట్రీయమై పోవుచున్నది. నటనాచతురత స్వదేశీయ సహజ గాంభీర్యమును వదలుచు విదేశీయములో లీనమైపోవుచున్నది. కులద్వేషములు నాటకములలో ప్రతిఫలించుచున్నవని కొందరు వ్యాకులాయత్తచిత్తులయి ఆందోళనాపరు లగుచున్నారు. ఆకారణమున కొన్ని నాటకములు నిషేధపుటుత్తరువులకు గురియగుచున్నవి. మన చరిత్రములను నాటకరూపమున ప్రజలకు దెల్పవలయునన్నచో సంఘమునందలి వివిధ మతస్థుల గుణదోషములను జూపకుం డ్రాయు టెట్లు? ప్రదర్శించు టెట్లు—ఇత్యాదులు మననాటకకళను యెదుర్కొనెడు క్లిష్టములు; ఆంధ్రనాటకోత్సాహమును అరికట్టెడు అంతరాయములు.

---

# రవీంద్రుడు

గుఱ్ఱం వేంకట సుబ్రహ్మణ్యం

కాలభిద్విజరావముల్
మారుమ్రోయగ దిక్తటుల్
నిబిడతమము హరించుచున్
విమలతేజము నించుచున్

ప్రాక్ప్రతీచీదిశా వా
ల్లభ్యవైభవయుక్తుడై
చక్షురంతర్నిరజో
న్మేషకారణ కిరణుడై

నిత్యసముదయభాసుడై
పూర్ణుడై సంవేద్యుడై
ధారుణిన్ రవినాముడై
క్రాలు కవికి సుమాంజలుల్.

# పుస్తక సమీక్ష

## ఆస్ట్రియా ఆక్రమణ

కర్త: నార్ల వేంకటేశ్వరరావుగారు. ప్రకాశకులు, నవయుగ ప్రచురణాలయం, పెడసనగల్లు (పోస్టు) కృష్ణాజిల్లా.

హిట్లరు ఆస్ట్రియాను ఆక్రమించుకొన్న విషయం అప్పుడే చరిత్రలో చేరిపోయింది. కాని ఏవిధంగా ఈ ఆక్రమణ జరిగిందో మాత్రం వివరంగా తెలుసుకొన్నవారూ, తెలిసినవారూ మనలో చాలా అరుదు. ఈగ్రంథంలో శ్రీ వెంకటేశ్వరరావుగారు ఈవిషయాన్ని సులభశైలిలో, అందరికీ అర్థమయ్యేలాగున, ఒక కథలా వ్రాశారు.

అంతర్జాతీయ విషయాలను బాగా అధ్యయనం చేసి, బోధపర్చుకొని, జీర్ణంచేసుకొని దేశీయులకు కథలా వ్రాసి వర్ణించి చెప్పగలవారు మన రచయితలలో చాలా కొద్దిమంది మాత్రమే ఉన్నారు. అట్టివారిలో శ్రీ వెంకటేశ్వరరావుగారు ఎన్నదగినవారు. ఆస్ట్రియా ఏవిధంగా నాజీపతాక క్రిందికి వచ్చింది అనే విషయం ఈచిన్న పుస్తకంలో హృదయాకర్షకంగా వర్ణితమయింది.

యూరోపు మహాయుద్ధానంతరం అథఃపాతాళానికి అణిగిపోయి కడగండ్లు గుడిచిన దేశాలలో ఆస్ట్రియా ఒకటి. ఇది యుద్ధానంతరం ఫ్రాన్సు, ఇంగ్లాండు దేశాల స్వార్థపరమయిన కుట్రలలో ఏవిధంగా నలిగి దుట్టిదిక్కులు పొందిందో అసలు ఆస్ట్రియాకున్న చిక్కు లెట్టివో, యుద్ధానంతరకాలంలో ఆ దేశంలో ఏర్పడిన పార్టీలేవో, వాటి ఉద్దేశాలు, లక్ష్యములు ఏవో, ఇటలీ, జర్మనీలు రెండూ ఆస్ట్రియాను తమ చెప్పు చేతలలోనికీ, వశములోనికీ తీసుకురావడానికి ఎత్తినఎత్తు లేవో,— ఈ మొదలైన విషయాలన్నిటినీ అతివిపులంగా అరటిపం డొలిచినట్లు తేటతెల్లముగా వర్ణించి చెప్పారు నార్లవారు. ఇటువంటి విదేశరాజ్యాంగ విషయాలను, చరిత్రాత్మక విషయాలను చెప్పేటప్పుడు — ఆ పేర్లు మనకు పరిచితమయినవీ, పరిపాటయినవీ కాకపోవడంచేత గజిబిజిగా ఉండి విసుగు కలిగిస్తాయి సాధారణంగా. అట్లా అయినప్పటికి విషయమును బాగుగా గ్రహించి విమర్శతో చక్కగా చెప్ప గలిగిన నేర్పు నార్లవారివద్ద ఉండడంవల్ల మనకు అట్టి విసుగురాదు సరికదా కథమీదే మన మనస్సు లగ్నమవుతుంది. ఇందలి కొన్ని కొన్ని ఘట్టాలు — డాక్టరు డోల్ఫస్ హత్య, విప్లవసంఘాలతిరుగబాటు మొదలైనవి మనస్సు నాకట్టి, ఉత్కంఠనూ ఉద్వేగాన్నీ కలిగిస్తాయి.

ఇందలివిషయము అప్పుడే పాతగిలిపోయినా, ఆస్ట్రియా నాజీపరిపాలనక్రింద స్థిరపడిపోయినా పేరుపడ్డ నేటినియంతలలో మొనగాడైన హిట్లరు నాయకత్వంక్రింద — అధికారసంపాదనలో, స్వకార్యనిర్వహణంలో — ఎట్టెట్టి దుండగాలూ, దురంతాలూ జరుగుతున్నవో, నియంతలెట్టి కర్కశహృదయులో, నియంతలపరిపాలన ఎంత అనర్థదాయకమయినదో తెలిపి ఈగ్రంథం ప్రజాహృదయాన్ని జాగ్రత్తగా ఉండవలసిందని హెచ్చరిస్తుంది. పెద్దపెద్ద పేర్లతో నేడు యూరోపియను దేశాలలో జరుగుతూవున్న పిశాచవిలయతాండవం తెలుసుకోవడానికి ఈ చిన్నపుస్తకం ఒక మచ్చుముక్క. ఆస్ట్రియాలోనూ, జర్మనీ, ఇటలీలలోనూ వినవచ్చే ఈప్రళయార్భటులు కూలిపోతూవున్న యూరోపియను సభ్యతయొక్క సంకుల విలయ విహ్వలస్వనములే.

మ. సో. శర్మ.

---

## అహల్యా సంక్రందనం

[కవి: సముఖం వేంకటకృష్ణప్పనాయకుడు. ప్రచురణకర్తలు: శృంగారకావ్యప్రబంధమండలి వారు, మచిలీపట్నం.]

రామాయణం, పద్మపురాణంలో ఉండి, ప్రఖ్యాతమై, నాలుగుమూలలా అల్లుకునిపోయి ఆబాలగోపాలమూ విదితపూర్వమైనదే ఈకావ్యంలోని ఇతివృత్తం.

కుమారిలభట్టాదులు... అహల్యావృత్తాంతం ... సాంకేతిక మనేశారు. వైదికులుకూడా, అహల్య ఊషర క్షేత్రమనీ, ఇంద్రసమాగమంఅంటే వర్షం కురిసి ఫలించడమనీ వారిరూపకాతిశయోక్తిని శిఖరానికి ఎక్కించారు.

నవీనసాహిత్యంలోకూడా, రాయి, టాగోరు, కృష్ణమాచార్యులు [గుంటూరు] బహుధంగుల చిత్రించారు ఈ వృత్తాన్ని.

ప్రఖ్యాతంగాఉన్న ఇతివృత్తాన్నే తీసుకుని కల్పనల్లో కథా–గమనచాతుర్యంలో తమపనివాడితనాన్ని చూపించేప్రబంధకవులదారినే ఈకవీ పోయాడు.

కాని – సమీరకుమారవిజయంలోని కథనే ఈ కవి తీసుకునిఉంటేనా—?

—ప్రాచీనమార్గాల్లో ఈకవి నిధి. వివిధశక్తులు కలవాడు. చమత్కారరహితంగా, వ్యర్థంగా—ఏ విశేషణాన్నికూడా యితను వేయడు. శ్లేషలాంటి బడితెబాజాఅలంకారాలనుగూడా చాలా మృదువుగా అద్భుతంగా వాడాడు. ఏమాట వేసినా అద్భుతంగా ఉంటుంది. అప్రయోగాలను అశ్లే వెయ్యలేదు. పద్యాలను నడపటంలో ఎంతో గడసరి.

—అహల్యాసృష్టికి అవసరంగా కల్పించిన ఇంద్రసభలోని ఆదికృతుల, మునుల, రాజుల, రసికుల పోట్లాట...ఎంతో బావుంది? అద్భుతం...కాని—ఈ రసికులు అట్లా తమ్ముగురించి తమముందర కొట్లాడుకుంటే - ఆ సురవారవధువులు చూస్తూ బొమ్మల్లాగా నిలబడ్డారా...?

వాళ్ల హావభావాదికములుకూడా కవి రాయవలసినది. ప్చ్! ఈకావ్యంలో లోటు అక్కడే వున్నది.

—ప్రథమాశ్వాసంలో చిరునవ్వులతో మిళితమైన శృంగారం చిక్కచిక్కమంటూ, ద్వితీయాశ్వాసంలో వర్ణనలచాటునా, మాటలమాటునా దాగి, ఊగి, తృతీయాశ్వాసంలో బట్టబయలై - శిఖరాన్ని ముట్టుతుంది. కావ్యంగా విలువలుకట్టడానికి ఆగి, ఎన్నో చమత్కారాలను తనలోకునే ప్రదర్శిస్తూ, రసరాజధానిఐలయవేసి ఊరించే ఈకావ్యాన్ని చదివి కుర్రవాళ్లు మరీ మరీ రెచ్చిపోయి చాలా పద్యాలను కంఠస్థం చేసుకుంటారు. నిజం.

—రాధికాసాంత్వనం,— ఏకాశ్వాసం—ఇతనికే తోడుగా ముద్రించడం కావ్యరసికులకు తరగని పరమసంతోషం.

జైమినీభారతంలోని వోముక్కా, సారంగధరలోని వోచెక్కా గ్రంథగౌరవాన్ని హెచ్చించకపోవడంలేదు.

—ఇన్నాళ్లూ నేపథ్యంలో ఉండి, గ్రంథమండలికి అంగరక్షకుడైన 'రామకృష్ణశాస్త్రి' ఈసారి రంగంమీదకు వొచ్చి చక్కని సమీక్షను రాయడం చాలా విశేషం. ఈసమీక్ష చాలా విలువైనదీ, చాలావరకు సమగ్రమైనదిన్నీ.—

తాటాకుల్లో పచార్లుచేస్తున్న యిట్టి ఉత్తమ కావ్యాలను యింతసుష్ఠుగా ప్రచురించే శృంగారకావ్యమండలివారిని మనం ఎంతైనా ప్రశంసించాలి.

రుక్మిణీనాథశాస్త్రి.

---

## ప్రాథమిక స్వత్వములు

గ్రంథకర్త: సురవరం ప్రతాప రెడ్డిగారు, బి. ఏ., బి. ఎల్. దక్కన్, హైద్రాబాదు, దేశోద్ధారక గ్రంథమాలయందలి రెండోపుష్పం. ప్రకాశకులు వట్టికోట ఆళ్వారుస్వామిగారు. వెల కేవలం రు ౦–౫–౦ లు మాత్రమే మేనేజరు, దేశోద్ధారక గ్రంథమాల: ౨౬౮౮. ఇమాంబావి వీథి. సికింద్రాబాదు అనివ్రాసిన పుస్తకముమ తెప్పించుకొనవచ్చును.

ఇది ప్రతిరోజూ ప్రతియాంధ్రుడూ పారాయణం చేయదగ్గ గ్రంథం. ధార్మికగ్రంథ పారాయణంచేత ధార్మికభావాలు గట్టిపడేలాగు ఈగ్రంథపారాయణంవల్ల రాజకీయ, ఆత్మీయ, స్వాతంత్ర్యభావాలు గట్టిపడుతాయి. మొట్టమొదట శ్రీ భోగరాజు పట్టాభిసీతారామయ్యగారు తమ పీఠికలో ఆంగ్లేయరాజ్యం ఆరంభమైనది మొదలుకొని, నేటివరకు ఘటిల్లిన భారత రాజకీయఘట్టములనుగూర్చి తెలిపి క్రమంగా ఇక్కడిప్రాతిపదిక స్వత్వ

ములు ఏలాగు నాశం చేయబడ్డాయో క్లుప్తంగా వ్రాశారు. అటుపిమ్మట గ్రంథకర్త గారు సింహావలోకనములో ఆది యందు మానవు లందరు ఏలాగు స్వాతంత్ర్యము గలిగి యుండినదీ, తరువాత అజ్ఞానులైన, నిరంకుశులైన పరిపాలకుల మూలంగా జన్మహక్కులను ఏలాగు గోల్పోయి నదీ, పిదప ఏయే దేశాలు ఏవిధానాన్ని అనుసరించి స్వాతంత్ర్యం పడయగలిగిందీ వివరించారు. ఈసందర్భంలో ఇంగ్లాండు, అమెరికా, రష్యాజనుల ప్రాతిపదిక స్వత్వముల మూలసిద్ధాంతాలను స్పష్టపరిచారు. అటు వెనుక భావ, సభా, ఆత్మిక, రచనా, వాక్స్వాతంత్ర్యాల లక్షణాలూ, అట్టి స్వాతంత్ర్యాలు ఉన్నందు వల్లా, లేనందువల్లా కలిగే లాభనష్టాలు, విశదీకరింపబడి నాయి. అనంతరం ఫ్రాన్సు, ఇంగ్లండు, అమెరికా, స్విట్జరులాండ్, రష్యాలలోగల స్వాతంత్ర్యప్రకారాలు, వాటి వాటినియమాలూ వేరువేరుగా వర్ణితమయినాయి. తరువాత ఇండియాలో ప్రాథమిక స్వత్వములు ఏప్రకారం నాశనం పొందాయో, ప్రజలు మరల వానిని సంపాదించు

కోడానికి ఎన్నాళ్లనుంచి ఏప్రకారం ప్రయత్నంచేస్తున్నారో వ్రాశారు. చిట్టచివరకు ప్రపంచంలోకల్లా భాగ్యవంతుడైన రాజని పేరెక్కిన శ్రీ నిజాంవారి హైదరాబాదురాష్ట్రంలోని నానావిభాగాలూ ఎంత అధ్వాన్నంగా వుందీ, ప్రాథమిక స్వత్వములనేవి నిశ్శూన్యమైనప్పటికీ పైకిమాత్రం అక్కడిలోకశాంతి భద్రతలకనే పేరుతో ఎట్టిఘోరనియమాలను చేసి ప్రజలను అణగద్రొక్కి వుంచిందీ చక్కగా విపులీకరించి వ్రాశారు. కీ. శే. శ్రీ దేశోద్ధారక నాగేశ్వరరావుగారి పేర స్థాపించిన గ్రంథమాలలో ప్రచురింపబడినందుచే నిజముగానే ఇది దేశోద్ధరణానికి సహాయపడుతుందనటంలో సందేహము లేదు.

---

## శ్రీ కాశీనాథ నాగేశ్వరరాయ జీవితచరిత్రం

ఇది సంస్కృతభాషలో వ్రాయబడిన చిన్న పుస్తకము. ప్రణేత వాసా సూర్యనారాయణశాస్త్రి గారు, మద్రాసు సేవాసదనమందలి పండితులు. మొదలు

దైవప్రార్థన, తరువాత శ్రీ పంతులవారిగుణవర్ణనము, అనంతరము వారి జీవితచరిత్రము, అటుతరువాత వారి ధర్మపత్నిని సమాశ్వాసనము, పిదప భారతీదేవికి ఈ కృతిఅర్పణములోనగు విషయము లీ గ్రంథమున ఆపంబరరహితమైన, అతిశమోక్తులకు దూరమైన సరళ సంస్కృతభాషలో వ్రాయబడినవి. విశ్వదాత్ముని గుణ కీర్తనము విశ్వభాషయందు వ్రాయబడుట ఎంతయు సమంజసము. ఇందువలన శాస్త్రులవారి గీర్వాణవాణి కృతకృత్యమైనదని తలపవచ్చును. ఆంధ్రవిశ్వవిద్యాల యమువారైనా ఈ చిన్నపుస్తకమును సంస్కృతం చదివే విద్యార్థులకు పఠనీయగ్రంథముగ చేర్పరచేయుడల బాలురుమ భాషాభ్యసనంతోపాటు తమ దేశనాయకుని గుణగణములుగూడ అలవర్చుకొని కృతకృత్యు లగుదు రనుటకు సందేహము లేదు. వే. సు.

---

## హైందవధర్మవీరులు

[రచయిత: సురవరం ప్రతాపరెడ్డిగారు. ప్రకాశకులు - దేశోద్ధారక గ్రంథమాల; ౨౫౪౪ ఇమాంబావీధి, సికందరాబాదు. వెల-చందాదారులకు ౪ అణాలు. ఇతరులకు ౬ అణాలు.

ధర్మవీరయుద్ధము గ్రీకుదేశచరిత్రలో సుప్రసిద్ధమైనది. జర్జిస్ రాజును ఎదిర్చి, అసమాన పరాక్రమమును చూపి వీరస్వర్గము నలంకరించిన లియోనిడాస్ ఆధర్మవీరయుద్ధగాథను ఆచంద్రతారార్కముండునట్లు చేసినాడు.

అలాటియుద్ధాలు భారతదేశచరిత్రలో ఎన్ని జరిగినవో; లియోనిడాస్‌లాటి వీరులు ఎంతమంది తమదేశ రక్షణకు, తమ స్వాతంత్ర్యసంపాదనకు జీవితాలను అర్పించారో —

వారిలో గోరా, అమరసింహరాథోడ్, ఫల్లూసింగ్ ఇందుమతి, సావిత్రీబాయి, బాజీ దేశపాండ్యా, తానాజీ మాలుసురే, అబ్దుర్ రజాఖ్, అభయచంద్-నిర్భయచంద్, గురుగోవింద్, బలభద్రుడు, సోమనాద్రి యోధుల చరిత్రలను శ్రీ సురవరం ప్రతాప రెడ్డిగారు చక్కనిభాషలో హృదయరంజకముగా వ్రాశారు.

సుప్రసిద్ధ చరిత్రపరిశోధకులైన మల్లంపల్లి సోమశేఖర శర్మగారు యీగ్రంథానికి "పరిచయవాక్యములు" వ్రాశారు. ఈపుస్తకాన్ని చదివినతరువాత శ్రీశర్మగారి "పరిచయవాక్యముల"లోని యీక్రిందివాక్యాలు జ్ఞప్తికి వస్తున్నాయి.

"ఈపుస్తకము చిన్నదేకాని, అంతా నుసిబారని కణకణలాడు నిప్పుకణమే. ఇం గధిపర్ణితములైన వన్నీ రక్తము నుడుకెత్తించు వీరకథానకములు... తెలుగువారి వీరగాథ లిట్టివి కాలయవనికమడతలలో ఎన్ని మణిగి మటుమాయ మయి పోయినవో!"

క. స

---

## శ్రీగోపికారహస్యము

గ్రంథకర్త: ఎల్లాప్రగడ శ్రీకృష్ణమూర్తిగారు. సికింద్రాబాదులోని మోసెస్ అండుకంపెనీలో ముద్రితము. వెలరు. ౦-౬-౦ దక్కను హైదరాబాదు H. E. H. నిజాంప్రభుత్వపు P. W. సెక్రెటేరియటునందలి, స్టెనోగ్రాఫరు- గ్రంథకర్తకు వ్రాసి తెప్పించుకోవచ్చును.

హైందవేతరమతస్థులు సాధారణంగా శ్రీకృష్ణుని జారచోరునిగా నిరూపిస్తూవుంటారు. అట్టినిందను దూరం చేయడానికి ఈ చిన్నగ్రంథము ద్దేశింపబడినది. త్రేతాయుగంలో రాక్షససంహారం జరిగినతరువాత వాళ్ల బాధలనుండి విడివడ్డ మునులూ యోగు లందరూ తమ ముక్తికికారణభూతుడైన శ్రీరామచంద్రుని ఆలింగనంచేయాలని కోరగా సీత తప్ప తనను ఇతరులు కౌగిలించుకోజాల రని చెబుతూ రాముడు తాను ద్వాపరాంతంలో కృష్ణుడుగా పుడుతాననీ, వారందరూ గోపికలుగాబుట్టి ఆకోర్కెలను దీర్చుకోవచ్చునని బోధించి పంపుతాడు. అదేప్రకారం జరుగుతుంది. ఇది ఏకాశ్వాసపు నిర్వచనపద్యగ్రంథమైనప్పటికీ అందులోనే రాక్షససంహారం, మునులు రామచంద్రుల సంలాపం, కృష్ణావతారం, బాల్యక్రీడలు, కాళీయఫణిమర్దనాదులు చక్కగా వర్ణింపబడ్డాయి. మధ్యమధ్య భాగవతపుపోకడ స్మరణకు వస్తుంది. పుస్తకమంతటా యోగారూఢుడైన యోగీంద్రునిదశయు వర్ణితమైవుంది. కృష్ణయోగి జీవేశ్వరరూపి; ఇడా పింగ

కలు రెండుచేతులు; సుషుమ్న బిల్లన గ్రోవి. దానినుండి నిర్గతమయ్యేది ఓంకారగీతం.

---

**అసంపూర్తి రామాయణం; ఆంధ్రాస్పిరిట్**

రచయిత : మల్లాది అవధానిగారు, విజయనగరం. వేదవ్యాస ప్రెస్సులో ముద్రితము, వెల నాలు గణాలు.

ఇదిహాస్యప్రధానమైన రెండు నాటికలుగల చిన్న పుస్తకము. ఇందలి మొదటినాటికలో ఆంధ్రుల నాటకరంగము ఎంతశోచనీయమైన పానరంగంగా మారిందీ, రెండవదానిలో పిల్లవాడు మొదలుకొని ముదుసలి తాత గారివరకుగల ప్రస్తుతకాలపు ఆంధ్రకవి లేఖకుల మెదడులో శృంగారరసము ఎంత దోవ భూయిష్ఠ క్రిమిసంకులమైపోయినదీ మంచి చమత్కారభణితిలో విశదీకరింపబడినది. ఉపర్యుక్తములైన రెండు తావులందునూ ప్రబోధంకలగడం మిక్కిలీ అవసరం. అందుల కీలాంటి నాటికలు అపుష్పధములవంటి వగునుగాక.

---

## కృ ప ణ జీ వి

కర్త: విద్వాన్ పాలెపు వెంకటరత్నం గారు. పల్లిపాలెం, ఆంధ్రకుటీరం వారి ప్రచురణాల్లో ఇది రెండోది. కరుణాత్మకమైన దీన భిక్షుకునిగాథ.

ఒక ముష్టివాడు ఒక హోటలు దగ్గరకు పోయి ముష్టి అడిగితే అక్కడ ఫలాహారం చేస్తున్న రామారావను కాలేజీ విద్యార్థి యొకడు వాణ్ణి బూటుతో తన్నగా వాడు మరణిస్తాడు. పోలీసువారు రామారావుమీద కేసు పెట్టుతారు. రామరావు తండ్రిదగ్గర వెయ్యి రూపాయల లంచం కొట్టి న్యాయాధికారి ఆకేసును కొట్టివేస్తాడు. దీనుల హీనజీవనం, లంచగొండి యధికారుల దుర్ణయం స్వల్పంలోనే చక్కగా వర్ణితమైనాయి.

---

**మోదరన్ విద్య**

రచయిత మంచికంటి రాజారావుగారు. ప్రకాశకులు: అన్నంభొట్ల మార్యనారాయణ మూర్తిగారు. ఇది కాకినాడలో క్రొత్తగా ఏర్పడ్డ వినోదినీ గ్రంథమాల వారి మొదటి ప్రచురణము. ఇందు వర్తమాన ఇంగ్లీషు విద్యవలన జనులలో ఎట్టి దుష్పరిణామం కలుగుతూ ఉందో ఒకచిన్న హాస్యోపన్యాసం ద్వారా వివరింపబడినది. సాలు చందా రు. ౧-౮-౦.

వే. సు.

---

## గ్రంథ స్వీకారము

విద్యార్థి: గ్రంథకర్త- కామ్రేడ్ “ కెట్టిపల్లి ”. ఇది రైతాంగ గ్రంథమాలలోని అయిదవ పుష్పం. గుడివాడ శ్రీరామా ప్రెస్సునందు ముద్రితము. వెల ఒక అణా.

శ్రీ వేదం వెంకటరాయశాస్త్రిసంస్మృతి: రచయిత: గుత్తం వెంకటసుబ్బరామయ్య గారు, ఎమ్. ఏ. శ్రీ వావిళ్ల ప్రెస్సులో ముద్రితము. వెల రు ౦-౧౨-౦.

శ్రీకళాసిద్ధి: గ్రంథకర్త-శ్రీపతి త్ర్యంబకరావుగారు. దుర్గాగ్రహారం, బెజవాడ, వెల రు ౧-౦-౦.

శ్రీ వివేకానంద లేఖావలి (ప్రథమ సంపుటము): అనువాదకులు: తత్వానందస్వామిగారు. వరిసరి కాగితపు కవరుగలది రు ౦-౧౨-౦అట్ట బైండింగు రు ౧-౦-౦

ఆలోకమునుండి ఆహ్వానము (నాటకము): కర్త: శ్రీ పిఠాపురము యువరాజాగారు. పిఠాపురము, శ్రీ విద్వజ్జన మనోరంజని ముద్రాక్షరశాలలో ముద్రితము.

---

Printed and Published by S. Sambhu Prasad, at the Andhra Patrika Press, No. 7, Thambu Chetty St., Madras. Editor:— S. Sambhu Prasad.